## ప్రపంచప్రఖ్యాతి గాంచిన కేరళ ఆయుర్వేద వైద్యశాల వారి ప్రత్యేక చికిత్సలు!! (ఆపరేషన్‌లు లేకుండా)

## H.I.V / A.I.D.S. H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్సిటీ వారి పరిశోధన ప్రకారం 'మానవ శరీరంలోని A.P.O.B.E.C-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కలిగిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది.' శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.E.C-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. మా మందులు వైరల్ లోడ్‌ని తగ్గించి CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V /A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. డాక్టర్ సలహా మేరకు మందులు వాడి CD-4 కౌంట్ (Immunity)ని 800 నుండి 1500వరకు పెంచుకొని పూర్తి జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. ఎలాంటి ఆహార నియమాలు లేవు. ఆల్కాహాల్ సేవించరాదు

## కేన్సర్ - CANCER కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్థులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంధి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్‌క్రియాసిస్ * మూత్రపిండమ * ప్రాస్టేటు గ్రంధి * మూత్రకోశము * జీర్ణ కోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంధులు ఎంతో మంది క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తున్నటువంటి కేరళ ఆయుర్వేద వైద్యశాల, రేడియేషన్ థెరపి, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ (DIABETES MELLITUS) అతి మూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!!

అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) 3 నెలలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 6 నెలలలో రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్ళు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.3000/-) TYPE - II COURSE 6 MONTHS. TYPE - 1 COURSE 12 MONTHS.

## సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

[illegible] (OLIGOSPERMIA) [illegible] (MOTILITY) [illegible] (Azoosperimia) [illegible] (Varicoseviens) (Per month Rs 5000/-) Course : 3 months. [illegible] (Fallopian Tubes Block). [illegible] (Acid) [illegible] (PCOD) [illegible] (Per Month Rs.5000/-) Course : 3 months.

## ఆల్కహాల్ - స్మోకింగ్ - గుట్కా - డ్రగ్స్ మానండి! త్రాగే వారికి తెలియకుండా మాన్పించండి!! Per Month Rs.2000/-) Course : 2 months.

**నూతన యవ్వనశక్తికి : నపుంసకత్వము - శీఘ్రస్కలనము - నరాల బలహీనత** (IMPOTENCY) అంగస్తంభన గట్టిగా లేకపోవుట - లైగిక వాంఛ లేకపోవుట (LIBIDO) - రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట-వృషణములు శుష్కించిపోవుట (ATROPHY OF TESTIS) రతిలో పాల్గొనకముందే వీర్యము బయటికి వచ్చుట - నిద్రలో వీర్యము పోవుట - శృంగారమంటే భయం - శృంగారములో తమ సామర్థ్యము మీద తమకే నమ్మకం లేకపోవుట - శృంగారపరమైన సమస్యలను నివారించి - మగువదగ్గర మృగరాజులా రెచ్చిపోయే శృంగార సామర్థ్యము - 60లో 20లా యవ్వనాన్ని తరగనీయదు - శరీరము వజ్రమంత ధృఢముగా, శక్తివంతముగా - వృద్ధాప్యాన్ని రానీయని మహత్తర ఆయుర్వేద ఔషధము. (Per Month Rs.5000/-) Course : 3 months.

**సుఖవ్యాధులు:** గనేరియా - సిఫిలిస్ (per month Rs.2000/-) Course : 3 Months. **హెర్పిస్ సింప్లెక్స్** (HERPES SIMPLEX) (Per month Rs.4000/-) Course : 3 months.

లివర్ వ్యాధులు - లివరు గట్టి పడుట (Cirrhosis) - లివర్‌లో పుండు (Abscess) - లివర్ వాపు, నొప్పి (Hepatitis) (Per month 5000/-) Course: 3 Months

మూర్ఛ (Fits) అపస్మారకము (Epliepsy) - సోరియాసిస్ (Psoriasis) - బొల్లి (Leucoderma) - PROSTATE ENLARGE - THYROID - KIDNEY STONES (Per month Rs 4000/-) Course 3 month స్త్రీల శరీరంపై వచ్చు అవాంచిత రోమములు (UNWANTED HAIR) తిరిగి మొలవకుండా చేయుటకు: (Per month Rs 4000/-) Course 3 month స్థూలకాయము (Obesity) - బరువును - లావును తగ్గించుటకు (No Diet. No Exercise)- సన్నగా బలహీనముగా నుండు వారు, బరువు - లావుపెరుగుటకు - (21సం॥లోపు వారు ఎత్తు పెరుగుటకు) - నత్తిని తగ్గించుటకు (Stammering) - జ్ఞాపకశక్తిని పెంచుటకు - నిద్రపట్టకపోవుట (Insomnia) MAIGRANE - T.B - PSYCHOLOGICAL PROBLEMS Per month Rs 3000/-) Course:3months

**స్త్రీల స్తనముల సైజు పెంచుటకు - స్త్రీల పొత్తికడుపు మీద** (SCRATCH MARKS) **చారలు, గీతలు పోవుటకు** (Per month Rs.1500/-) Course : 3 months.

కీళ్ల కండరాల నొప్పులకు - ఎనిపెయిన్ - నడుమునొప్పి - వెన్ను నొప్పి మెడనొప్పి - PILES - FISSERS - GAS - TROUBLE - ACDT - ULCER (Per month 1200/-) Course: 3 Months) - తుంటినొప్పి (SCIATICA) - FITULA (Per month 3000/-) Course: 3 Months)

**బట్టతల!! Baldness! నెరిసిన జుట్టు!! Grey Hair!** చుండ్రు, జుట్టురాలుట, పేనుకొరుకుడు, జుట్టును నల్లగా పొడవుగా, పొడుపుగా పెంచి బట్టతల నెరిసిన జుట్టును నివారించును.

Kerala Herbal H[illegible] Tonic (Oil) 100ml Rs.600/-, 250ml Rs.1300/-Herbal Hair Capsules 60 - Rs600/- (Per Month Rs.1200) Course : 6 Months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

[illegible] (Sinusitis) [illegible] (Eosinophilia) [illegible] Asthama Sanjivini 400ml / TAB / CAP (Per month Rs.1000/-) Course: 9 months

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఫోన్:65526109, 9392355590, 9866155109

సప్తగిరి థియేటర్ ప్రక్కన, 2 nd బిల్డింగ్, 1 Floor R.T.C X Roads BUS STOP హైదరాబాద్-20.

అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు

9 A.M. TO 9 P.M.

Note : పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు ఏపిలో పోస్టల్ /కొరియర్ చార్జీ రూ. 100/-, ఇతర రాష్ట్రాలవారు రూ.250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు Kerala ayurveda vaidyasala పేరు మీద ఇక్కడ రాసినట్లుగా వ్రాసి పంపవలయును. మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 9 A.M. - 9 P.M. Sunday 9 A.M to 2 P.M

# ఆత్మీయనేస్తాలకు అందమైన కానుకలు

స్నేహితుల ఆనందమే మన ఆనందం
ఆప్తుల తలపులే మనకు ఆహ్లాదం
ఆత్మీయులకు అరుదైన బహుమానం
ఇవ్వాలనుకుంటున్నారా..?
ప్రతి నిత్యం వారి మదిలో
నిలవాలనుకుంటున్నారా..?



ఇందుకు మీరు చేయాల్సిందల్లా..
మిత్రుల పేరు మీద
రూ.216/- చందా కట్టండి చాలు
ఇక నెలనెలా వారికి కొనసాగుతుంది

# విపుల చతుర

ఆత్మీయ పలకరింపు
నెలంతా సాహితీపరిమళాల
చిలకరింపు
ఏడాది పొడవునా వారి మదిలో
మీ తలపులే గుబాళిస్తాయి
అక్షరాక్షరాన మీ ఉత్తమాభిరుచి
రూపుకడుతుంది



అది పుట్టిన రోజయినా..
నూతన సంవత్సర సందర్భమైనా
సరే ఎంచుకోండి
ఒక్కసారి మమ్మల్ని
సంప్రదించండి చాలు..

[illegible] లేదా [illegible] పంపవలసిన చిరునామా:
వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.

వివరాలకు : ఈనాడు టోల్ ఫ్రీ నెం : 18004258888 లేదా
vipula.chatura@gmail.comకు మెయిల్ కూడా చేయొచ్చు

సంపుటి -34, సంచిక - 4
400వ సంచిక, పేజీలు : 132
మే 2011

# చతుర





'**నీ** అతిథి ఆమెను టాక్సీలో దింపే పని ఇచ్చాడు' అన్నాడు గఫూర్. 'ఆమెను ఎక్కడికి తీసుకెళతాడు రోజూ?' అన్నాడు విలేఖరి. 'వాళ్లిద్దరూ పెళ్లాడతారట' 'భగవంతుడా..' అన్నాడు విలేఖరి. 'నీ బాధేమి? నువ్వామెను పెళ్లాడాలనుకున్నావా?'. 'ఛఛ ఆమె నాకు కూతురు లాంటిది' అన్నాడు విలేఖరి. 'అయితే మంచోడు దొరుకుతున్నందుకు సంతోషించు' అన్నాడు. 'ఆ నీచునిది ఆ పిల్లకు తాత వయస్సు' అన్నాడు విలేఖరి. ఇంతకీ మనవరాలి వయసున్న పిల్లను ఆ అతిథి పెళ్లాడాడా? అక్షరాక్షరంలో ఉత్కంఠ రేపుతూ ఆద్యంతం హాస్యంగాసాగే **ఆర్.కె. నారాయణ్ టాకేటివ్‌మాన్**కు **ఎం.వి.రమణారెడ్డి** తెలుగు అనువాదం **మాటకారి**

10వ పేజీలో...

బొమ్మలు : రాకేష్



# 2011లో ఇంప్రింట్‌వారి భారతదేశంలోని తీర్థయాత్రలు పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక, ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6, 8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్, తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.
7 రోజుల యాత్ర , రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6, 19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5, 24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్, నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6, 19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7, 19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7, 28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్థినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతిర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7, 23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సంపూర్ణ నేపాల్ యాత్ర

లుంబిని, పోక్రా, ముక్తినాథ్, మనోకామ్న, పశుపతినాథ్, దక్షిణకాశీ, జనక్‌పురి, చిన్నమస్త, కోసిదామ్, ఖాట్మండ్,
రూ. 42,000/- ఒక్కరికి
(ప్రయాణ భోజన వసతులతో సహా)

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం, గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది, ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/- , రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6, 22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 5,500/- (భోజనములు కాక) రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## చార్‌ధామ్ యాత్ర

హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
13 రోజుల యాత్ర. రూ. 20000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 3/5,20/5,27/5,3/6,17/6,24/6,1/7,22/7, 29/7,5/8,19/8,26/8,2/9,16/9,30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర

శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్, పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్, శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర. రైలు, బస్సు ప్రయాణం.
రూ. 32000/- యాత్ర తేదీలు : 27/1,24/2,24/3,26/4, 23/5,21/6,25/7,22/8,20/924/10,24/11,22/12

వివరాలకు :

Imprint

**దంటు నాగార్జున శర్మ, ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్**

ప్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్, హైదరాబాద్ - 20, ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092



# హాస్య, వ్యంగ్య చక్రవర్తి ఆర్.కె.నారాయణ్

వ్యక్తుల జీవితాల్లోని ఆటుపోట్లు, సంఘర్షణలతో పాటు సాధారణమైన విషయాల్ని సైతం అద్భుతమైన సంఘటనలుగా సృష్టించి 'ఆహా' అన్పించడం కేవలం ఆయనకు మాత్రమే అలవడిన అసాధారణ ప్రతిభ! చతురత, హాస్యరసస్ఫూర్తి ఆయనొక్కరికే సొంతం. సున్నిత హాస్యం, వ్యంగ్యం జోడుగుర్రాల్లా ఆయన కలాన్ని కదను తొక్కించాయి. భారతీయ రచయితల రారాజు, ప్రపంచ సాహిత్యంలో తనకంటూ ఓ స్థానాన్ని సంపాదించుకున్న ఆర్. కె. నారాయణ్ గురించే ఈ ఉపోద్ఘాతం! ఆర్కే నవల 'మాటకారి' తెలుగు అనువాదం ప్రచురిస్తున్న సందర్భంగా ఆయన క్లుప్త పరిచయం..

చెన్నైలో 1906 అక్టోబరు 10న పుట్టిన ఆర్. కె. నారాయణ్ భారతదేశం గర్వించదగ్గ సాహితీవేత్తల్లో ఒకరు. మనదేశంలో పుట్టి, ఆంగ్లంలో సాహిత్యసృష్టి చేసిన రచయితల్లో ఆయన ముందువరుసలో నిలుస్తారు.

నారాయణ్ నాన్నగారు పాఠశాల ప్రధానోపాధ్యాయులు. వృత్తిరీత్యా ఆయనకు తరచూ బదిలీలు జరుగుతుండడంతో అతని బాల్యం అమ్మమ్మ దగ్గర గడిచింది. ఆమె చిన్నారి నారాయణ్‌కు అంకగణితం, పురాణాలు, శాస్త్రీయ సంగీతం, సంస్కృతం బోధించింది.

చెన్నైలోని వివిధ పాఠశాలల్లో ఆర్కే విద్యాభ్యాసం జరిగింది. ఇంట్లో ఎనిమిది మంది పిల్లల్లో నారాయణ్ మూడోవాడు. కుటుంబసభ్యులు ఎక్కువగా ఇంగ్లిష్‌లోనే మాట్లాడుకునేవారు. పిల్లలు ఇంగ్లిష్‌లో మాట్లాడేటప్పుడు వ్యాకరణ దోషాలు దొర్లినప్పుడు పెద్దలు సరిచేసేవారు.

నారాయణ్ చిన్నప్పుడే చార్లెస్ డికెన్స్, ఉడ్‌హౌస్, ఆర్థర్ కానన్ డాయల్, థామస్ హార్డీలను చదివాడు.

తండ్రికి మైసూరుకు బదిలీకావడంతో నారాయణ్ చదువులు అక్కడి మహారాజ కాలేజియేట్ హైస్కూల్‌లో సాగాయి. అక్కడి లైబ్రరీలోని పుస్తకాలు అతడి జ్ఞానదాహాన్ని తీర్చాయి. హైస్కూల్ చదువు తర్వాత డిగ్రీలో ప్రవేశం కోసం రాసిన అర్హత పరీక్ష తప్పాడు. ఫలితంగా ఓ ఏడాదిపాటు ఇంటిపట్టునే చదువుతూ, రాస్తూ గడిపాడు. ఆ తర్వాత మూడేళ్లలో పూర్తికావాల్సిన డిగ్రీ కోర్సు అతడికి నాలుగేళ్లు పట్టింది. కారణం కెమిస్ట్రీ, ఫిజిక్స్ పాసయినా ఇంగ్లీష్ మోసం చేసింది. అందులో పరీక్ష తప్పాడు.

తర్వాత ఓ పాఠశాలలో స్కూల్ టీచర్‌గా చేరాడు. అయితే అతనికి డ్రిల్ టీచర్ బాధ్యతను కూడా హెడ్‌మాస్టర్ అప్పగించాలని చూస్తే, నిరసనగా వెంటనే ఆ ఉద్యోగం మానేశాడు.

1933లో కోయంబత్తూరులోని సోదరి ఇంటికి వెళ్లినప్పుడు అక్కడ పదిహేనేళ్ల రాజంను చూశాడు. జ్యోతిష్యం, ఆర్థికపరమైన ఆటంకాలన్నింటినీ తొలగించుకుని 1934లో ఆమెనే వివాహమాడాడు. పెళ్లయిన తర్వాత నారాయణ్ బ్రాహ్మణేతరుల హక్కులకోసం పనిచేసే 'ది జస్టిస్' పత్రికలో జర్నలిస్టుగా చెన్నైలో చేరాడు. ఓ బ్రాహ్మణ అయ్యర్ అయ్యుండీ తమ పత్రికల్లో పనిచేసేందుకు ముందుకురావడం యాజమాన్యానికి సంతోషం కలిగించింది. 1939లో నారాయణ్ భార్య టైఫాయిడ్‌తో చనిపోయింది. అప్పటికి వారి కూతురు హేమ వయసు మూడేళ్లే.

మొదట్లో నారాయణ్ పెద్దగా పేరులేని పత్రి

కలకు రాయడం, ఫ్రీలాన్సింగ్ చేయడం, పుస్తకాలపై రివ్యూలు పంపడం చేసేవాడు. దీనిద్వారా తొలి ఏడాది ఆయన గడించిన ఆదాయం కేవలం తొమ్మిది రూపాయల పన్నెండు అణాలే. అయితే మిత్రులు, కుటుంబసభ్యులు అతని వృత్తిని గౌరవించి, ప్రశంసించేవారు. ప్రోత్సహించేవారు.

1930లో ఆయన డిగ్రీ చేశాడు. అదే సంవత్సరం వేసవిలో ఉన్నఫళంగా మొదటి నవల 'స్వామి అండ్ ఫ్రెండ్స్'కు శ్రీకారం చుట్టాడు. అది 1935లో అచ్చయింది.

ఆ నవలలో ఓ కాల్పనిక నగరాన్ని సృష్టించి, దానికి మాల్గుడి అనే పేరు పెట్టాడు. చిన్న టౌను, అందులో ఓ రైల్వే స్టేషన్, ఆల్బర్ట్ మిషన్ స్కూల్, మార్కెట్ రోడ్, మెంపి ఫారెస్ట్, నల్లప కనుమ, సరయూనది తదితరాలను సృజించాడు.



మొదట్లో నారాయణ్ రచనలను ఎవరూ పట్టించుకోలేదు. స్వయానా వారి బంధువు ఒకాయన 'స్వామి అండ్ ఫ్రెండ్స్'ను చూసి పెదవి విరిచాడు. తనకు తెల్సిన ఆక్స్‌ఫర్డ్‌లోని ఓ మిత్రుడికి నారాయణ్ దానిని పంపాడు. అప్పటికే విసుగెత్తి ఉన్న నారాయణ్, ఒకవేళ దానికెవరూ పబ్లిషర్స్ దొరక్కపోతే, ఆ పుస్తకానికి ఓ బండ రాయి కట్టి థేమ్స్ నదిలో పారేయమని స్నేహితుడికి చెప్పాడు. పబ్లిషర్స్ ఆ రచనపట్ల ఆసక్తి చూపలేదు. దాంతో ఆ స్నేహితుడు తనకు పరిచయమున్న గొప్ప బ్రిటిష్ రచయిత గ్రాహం గ్రీన్‌కు ఆ మాన్యుస్క్రిప్ట్‌ను చూపించాడు. అది చదివి, ఎంతో ఆశ్చర్యపడ్డ గ్రీన్ తన పుస్తకాల ప్రచురణకర్తకు దాన్ని సిఫార్సు చేశాడు.

అలా ఆయన ద్వారా ఆర్. కె. నారాయణ్ నవల వెలుగులోకి వచ్చింది. ఆ తర్వాత గ్రీన్ చొరవతోనే మరికొన్ని నవలలు అచ్చయ్యాయి. గ్రీన్‌ను తన జీవితకాలంలో నారాయణ్ ఒకేఒక్కసారి 1964లో కలిశారు. అదీ తమ పరిచయమైన దాదాపు ముప్పై ఏళ్లకు. 1991లో గ్రాహం గ్రీన్ చనిపోయేంతవరకూ నారాయణ్ ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే ఉన్నారు.

ఎంతోమంది విదేశీయులు మనదేశానికి పర్యటనకు వచ్చినప్పుడు 'మాల్గుడికి వెళ్లాలంటే ఎలా?' అని టూరిస్ట్ డిపార్టుమెంట్ వాళ్లను విచారణ చేసేవారట. ఇది చాలు ఆయన తన నవ

## ◆ సాహిత్య సృష్టి

ఆర్. కె. నారాయణ్ మొత్తం పదిహేను నవలలు రాశారు. స్వామి అండ్ ఫ్రెండ్స్, ది బాచిలర్ ఆఫ్ ఆర్ట్స్, ది డార్క్ రూమ్, ది ఇంగ్లిష్ టీచర్, మిస్టర్ సంపత్, ది ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్, వెయిటింగ్ ఫర్ ది మహాత్మ, ది గైడ్, ది మ్యాన్ ఈటర్ ఆఫ్ మాల్గుడి, ది వెండర్ ఆఫ్ స్వీట్స్, ది పెయింటర్ ఆఫ్ సైన్స్, ఎ టైగర్ ఫర్ మాల్గుడి, టాకేటివ్ మ్యాన్, ది వరల్డ్ ఆఫ్ నాగరాజ్ మొదలైన నవలలు దేశ విదేశాల్లో ఆయనకెంతో విశేష ఖ్యాతినార్జించి పెట్టాయి.

'మాల్గుడి డేస్', 'ఏన్ అస్ట్రాలజర్స్ డే అండ్ అదర్ స్టోరీస్,' 'లాలీరోడ్ అండ్ అదర్ స్టోరీస్', 'ఎ హార్స్ అండ్ టు గోట్స్', 'అండర్ ది బన్యాన్ ట్రీ అండ్ అదర్ స్టోరీస్', 'ది గ్రాండ్ మదర్స్ టేల్ అండ్ సెలెక్టెడ్ స్టోరీస్' - ఆర్. కె. నారాయణ్ కలం నుండి జాలువారిన కథా సంకలనాలు.

'గాడ్స్, డెమన్స్, అండ్ అదర్స్', 'ది రామాయణ', 'ది మహాభారత' - ఆర్. కె. నారాయణ్ పురాణ సంబంధమైన రచనలు.

ఇవన్నీ కలిపి, ఆయన పేరును ప్రపంచ సాహిత్యచరిత్రలో అజరామరం చేశాయి.

లల్లో సృష్టించిన ఓ ఊహాజనిత పట్టణం ఎంత ప్రాముఖ్యం పొందిందో తెలియడానికి! అది నిజంగా ఎక్కడో దక్షిణ భారతదేశంలో మైసూరు చుట్టుపక్కల ఉందని భావించేవారట.

తన తొంభై నాలుగేళ్ల నిండు జీవితంలో అరవై ఏళ్లపాటు నిర్విరామ సాహితీసేద్యం చేసిన కృషీవలుడాయన. ఆయన రచనల్లో అతి సాధారణమైన పల్లెటూరి వ్యక్తుల జీవితాలు, నిత్యజీవితంలో ఎదుర్కొనే సమస్యలు వ్యంగ్య వైభవంతో, హాస్యస్ఫూర్తితో దర్శనమిస్తాయి. మొదలు పెడితే ఏకబిగిన చదవకుండా ఉండలేము. వాటిని చదువుతూ పోతుంటే చుట్టుపక్కల, మన ఇళ్లల్లో జరిగే అనేక విషయాలు, పరిచయస్తుల మనస్తత్వాలు కళ్ల ముందు కదలాడతాయి.

రాజకీయాల గురించో, దేశ సమస్యల గురించో నారాయణ్ తన రచనల్లో లోతైన



చర్చలు చేయరు. 'పెయింటర్ ఆఫ్ సైన్స్' అనే నవలలో మాత్రం జనాభా పెరుగుదలకు అడ్డుకట్ట వేయాలనుకున్న యువతిని పెళ్లాడాలనుకునే ఓ యువకుడి పాట్లను హాస్యంగా చిత్రించారు.

'మ్యాన్ ఈటర్ ఆఫ్ మాల్గుడి'లో ఓ సాధారణ బస్సు ప్రయాణం గురించి అదెంతో సాహసంతో కూడినటువంటి యాత్రగా, తమాషాగా వర్ణిస్తారాయన. 'అరే.. ఇవన్నీ.. మనకు తెలుసే.. కానీ వీటిలో ఇంత హాస్యం, వ్యంగ్యం దాగివుంటాయా? మరి అవి మనకు కన్పించవేంటి?!' అని విస్తుపోతారు చదువరులు. ఆ నవల ముగింపులో ఊరేగింపు రోజున దేవుడి ఏనుగును చంపుతానని బెదిరించిన జంతుచర్మాలు సేకరించే వాసు మరణం అదో గొప్ప సస్పెన్స్.

తమ జీవితాల్లో హాస్య దృష్టిలేక, ఏదో పోగొట్టుకున్నట్లు బతికేవాళ్లకు నారాయణ్ రచనలు మంచి టానిక్. సాదాసీదా మానవ జీవితంలో ఏ చిన్నఅంశమూ ఆయన దృష్టినుండి తప్పించుకోలేదు. దాన్ని అద్భుతంగా ఆయన ఒడిసిపట్టుకుని, చదువరులను అలరిస్తారు. ఆయన రచనలు చదివితే మనసులు తేలికవుతాయి.

'ది గైడ్' నవల ఆర్.కె.నారాయణ్‌కు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డును తెచ్చిపెట్టింది. ఇందులో జైలు నుంచి విడుదలై వచ్చిన రాజును చూసి అక్కడి జనాలంతా తమ ఊరికి స్వామీజీ వచ్చారని భావిస్తారు. కరువును పోగొట్టేందుకు, నీటి ఎద్దడి తీర్చేందుకు ఏమైనా చేయమని స్వామీజీకి మొరపెడతారు. వారి ప్రేమాప్యాయతలను చూసిన రాజు (స్వామీజీ) చలించిపోతాడు. ఓ టూరిస్ట్ గైడ్ పల్లెవాసులకు స్పిరిచువల్ గైడ్‌గా తలెత్తుతాడు. ఇది హిందీలో అదేపేరుతో సినిమాగా వచ్చింది.

'ది ఫైనాన్షియల్ ఎక్స్‌పర్ట్' నవలలో మార్గయ్య మాల్గుడిలోని కోఆపరేటివ్ బ్యాంక్ వద్ద చెట్టుకింద కూర్చునే దళారి. అతడు దరఖాస్తులు నింపడం, ఎంతోమందికి లోన్ ఇప్పించడం తదితర పనులు చేస్తూ బాగా సంపాదిస్తాడు. అయితే కొడుకు యోగ్యుడు కాకపోవడంతో సంపాయించినదంతా పోయి, మళ్లీ మలి వయసులో అదే చెట్టుకింద జీవికకోసం వెళ్లి కూర్చుంటాడు. ఎంతో ఆర్ద్రంగా ఉండే ఈ నవల అమెరికాలో అచ్చయిన ఆయన తొలి నవల అంటారు.

మైసూరులో 1948-53 మధ్యకాలంలో ఓ సొంతఇల్లు నిర్మించుకున్న నారాయణ్ అక్కడే ఓ ఎకరా వ్యవసాయభూమి తీసుకుని, సేద్యం చేశారు. రోజూ మార్కెట్‌కు వెళ్లి, అక్కడి జనాలతో కలిసిపోయి మాట్లాడుతుండేవారు. అలా సామాన్యుల జీవితాల గురించి తెలుసుకుంటూ తన నవలలకు విషయాన్ని సమకూర్చుకునేవారు.

'స్వామి అండ్ ఫ్రెండ్స్', 'ది ఇంగ్లిష్ టీచర్', 'ది బాచిలర్ ఆఫ్ ఆర్ట్స్' నవలలు ఆర్.కె.నారాయణ్ ట్రయాలజీలు. రచయితకు అంతర్జాతీయ ఖ్యాతినార్జించి పెట్టిన మొట్టమొదటి నవల 'స్వామి అండ్ ఫ్రెండ్స్'. ఆల్బర్ట్ మిషన్ స్కూల్‌లో చదివే పదేళ్ల స్వామినాథన్‌కు స్కూలంటే చాలా బోర్. సోమవారం వచ్చిందంటే మనసంతా అదోలా అయిపోతుంది. అదే స్కూల్‌కు వచ్చి చేరిన ఓ పోలీస్ ఆఫీసర్ కొడుకు రాజం పరిచయంతో స్వామి జీవితం మారిపోతుంది. స్కూలంటే ఆసక్తి ఏర్పడు

## ◆ పురస్కారాలు - సన్మానాలు

*1958లో గైడ్ నవలకుగాను కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు, ఆ నవలను సినిమాగా తీసినప్పుడు కథారచనకుగాను బెస్ట్‌స్టోరీ రైటర్‌గా ఫిల్మ్ ఫేర్ అవార్డు అందుకున్నారు నారాయణ్. 1964లో పద్మభూషణ్ పొందారు. ది హిందూ, ది అట్లాంటిక్ పత్రికలకు నారాయణ్ కాలమ్స్ రాశారు. రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ వారి నుంచి ఎ.సి. బెన్సన్ మెడల్ పొందారు. అమెరికన్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్ సంస్థ గౌరవసభ్యుడిగా ఎంపికయ్యారు. యూనివర్సిటీ ఆఫ్ లీడ్స్, మైసూర్, ఢిల్లీ యూనివర్సిటీలు ఆయనకు డాక్టరేట్లు ఇచ్చాయి. 1989లో రాజ్యసభ సభ్యునిగా నామినేట్ అయ్యారు. పాఠశాల పిల్లల వీపులపై బండెడు పుస్తకాలను చూసి చలించిపోయిన ఆయన వారి వీపుపై బరువు తగ్గించాలని పోరాటం చేశారు. ఫలితంగానే ఈ విషయంపై యశ్‌పాల్ కమిటీని వేసింది ప్రభుత్వం. ఆర్కే నారాయణ్ 2000లో పద్మవిభూషణ్ పురస్కారాన్ని పొందారు.*

తుంది. ఓ క్రికెట్ టీమ్‌ను ఏర్పాటు చేయాలని తీవ్రమైన కృషి చేస్తారు. తన బామ్మతో స్వామి సంభాషణలు నవ్వుతెప్పిస్తాయి. పిల్లల మనస్తత్వం ఎలా ఉంటుందో ఇందులో చక్కగా ఆవిష్కరించారు రచయిత.

రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఇంగ్లండ్‌తో తనకు సంబంధాలు తెగిపోవడంతో పుస్తకాల ప్రచురణకోసం 'ఇండియన్ థాట్ పబ్లికేషన్స్' పేరుతో ఓ ప్రచురణ సంస్థను నెలకొల్పారు నారాయణ్. ప్రస్తుతం దీన్ని చెన్నైలోని ఆయన మనవరాలు చూసుకుంటున్నారు.

### ప్రముఖుల ప్రశంసలు

నారాయణ్ శైలి చాలా సరళం. సులభమైన పదాలతో సామాన్యులకు సైతం అర్థమయ్యే భాష ఆయనది. ఆయన వర్ణనలు చాలా ఉన్నతంగా ఉంటాయి. అలాగే తనపాత్రల మధ్య ఎలాంటి సంక్లిష్ట భావోద్వేగాలు, తాత్త్విక చర్చలు ఉండవు. విషాద సన్నివేశంలోనైనా హాస్యం, వ్యంగ్యం పండించగలడాయన. అందుకే ఆయనను భారతదేశపు చెకోవ్‌గా ఆంగ్లరచయిత గ్రాహం గ్రీన్ అభివర్ణించారు. నికోలాయ్ గొగోల్‌లాగానే ఆర్.కె.నారాయణ్ రచనలు సైతం రియలిజంతో కూడి ఉంటాయన్నాడు న్యూయార్క్‌కు చెందిన ఆంథోనీ వెస్ట్.

నారాయణ్ రాసిన కథలకు సెట్టింగ్ తను సృష్టించిన ఊహాజనితమైన మాల్గుడినే. ఆయన కథల్లో ఓ సామాజిక సందర్భం నేపథ్యంగా ఉన్నప్పటికీ అక్కడ ఆయా పాత్రల రోజువారీ జీవితం గురించే రాస్తారు. నారాయణ్‌ను విలియం ఫాల్కనర్‌తో పోల్చుతారు. ఎందుకంటే అతని 'యొక్నపటావ్‌ఫా' లాగే నారాయణ్ కూడా మాల్గుడికి తన రచనల్లో ఊపిరిపోశాడు. ఆ ఊరు, అందులోని వ్యక్తులు సైతం ఫాల్కనర్ సృష్టించిన ఊరిలాగే వాస్తవికతకు అద్దంపడుతూ, రోజువారీ జీవితాన్ని జనాలు ఎంతో ఆసక్తితో నడుపుతుంటారు. గైడీ మపాసాతో ఆర్.కె.నారాయణ్ శైలిని పోల్చుతుంటారు కొద్దిమంది. కథానిక లక్షణాలను కోల్పోనివ్వకుండానే తన కథను కుదించగలిగిన చక్కటి నేర్పు, ప్రతిభాపాటవాలు ఆయనలో మెండు. సోమర్‌సెట్‌మామ్ సైతం అతను రాసిన 'డార్క్‌రూమ్' నవల చదివి ప్రశంసిస్తూ లేఖ రాశాడు. తన రచనల ద్వారా భారతదేశ పరిస్థితులను ప్రపంచం ముందు పరచిన ఘనత నారాయణ్‌కే దక్కుతుంది. విమర్శకులు అతడి రచనలను నిరపాయకరమైన హాస్యంతో ఆకట్టుకునే రచనలని కితాబులు ఇచ్చారు. అలాగే ఆయన ఎంచుకునే పదాలు, వచనం కూడా చాలా సరళంగా ఉంటుంది. పాండిత్య ప్రకర్ష ఏమాత్రం ఉండదు. ఆయన సోదరుడు ఆర్.కె.లక్ష్మణ్ కార్టూన్ 'కామన్‌మ్యాన్' లాగానే, నారాయణ్ రచనలూ సాధారణ చదువరులకు సులువుగా అర్థమవుతాయి. అలాగే ఆయన రచనలకు సోదరుడితోనే బొమ్మలు వేయించేవారు.

ఎంతోమందిని రచనలతో నవ్వించిన ఆయన తన చివరిదశలో హాస్పిటల్‌కు వెళ్లేంతవరకూ ఏం రాయాలని ఆలోచిస్తూనే వున్నారు. తమ తాతగారిపైన ఓ పుస్తకం రాద్దామనుకున్నారు. కానీ దాన్ని పూర్తి చేయకుండానే అర్థాంతరంగా వెళ్లిపోయారు. 2001 మే 13న చెన్నైలో ఆయన మనల్ని వీడిపోయారు. ఆ మహనీయుడి కలం నుంచి జాలువారిన 'టాకేటివ్ మ్యాన్'కు తెలుగు అనువాదం 'మాటకారి' చదువుదాం పేజీ తిప్పండి.

**– కె.రఘు**

# మాటకారి

మూలం : ఆర్.కె. నారాయణ్ ★ అనువాదం : ఎం.వి. రమణారెడ్డి

Translated to Telugu from the original (TALKATIVE MAN) with permission from the LEGAL HEIRS OF R.K. NARAYAN

మాల్గుడిలోని విలేఖరికి డా.రాన్ పరిచయమయ్యాడు. విదేశీయుడిలా ఉన్న అతడ్ని రైల్వే వెయిటింగ్ రూము నుంచి ఖాళీ చేయించే బాధ్యత నెత్తినేసుకున్నాడు విలేఖరి. చివరికి తన ఇంట్లోనే డా.రాన్‌కు బస ఏర్పాటు చేయాల్సి వచ్చింది. కొన్నాళ్ల తర్వాత డా.రాన్ కోసం ఢిల్లీ నుండి ఒకావిడ వచ్చింది. ఆమె బారినుండి అతడ్ని రక్షించిన విలేఖరికి రాన్ స్వభావం తెలిసొచ్చింది. ఈలోగా రాన్ పెట్టేబేడా సర్దేశాడు. అసలు ఇంతకీ రాన్ ఎలాంటివాడు? ఆ ఢిల్లీ యువతికి, రాన్‌కీ గల సంబంధ మేమిటి? వ్యంగ్య, హాస్య వైభవంతో నడిచే మాటకారి ఆర్కే వర్ధంతి ( మే 13 ) సందర్భంగా చతుర సమర్పణ!



అందరూ నన్ను 'వసపిట్ట' అంటారు. ఆ పేరును పొడి అక్షరాల్లోకి మార్చి, కొందరు ఆప్యాయంగా 'వ.పి.' అనడం గూడా పరిపాటి. సమాచారం కడుపులో దాచుకోలేని స్వభావం వల్ల బహుశా అది నేను స్వయంగా ఆర్జించు కున్న బిరుదై ఉండొచ్చు. నా వీపున నవ్వు కుంటున్నారని తెలిసినా సరే, వాటిని లెక్క లోకి తీసుకోకుండా, అనుభవాలను నలు గురితో పంచుకోవడం నా అలవాటు. నాది నిగ్రహానికి అతీతమైన స్వభావం. నోరు మెదపకుండా ఊరుకుంటే కడుపు ఉబ్బిపోయి ఊపిరాడదు. మన పురా ణాల్లో నారద మహర్షికి మల్లే బహుశా నాగ్గూడా ఏదైనా శాపం ఉందో ఏమో! అంత తెలివి, అంత కార్యసాధన ఉండి గూడా, కనీసం రోజుకొక తంటా పెట్టక పోతే తల చెక్కలవుతుందనే శాపాన్ని ఆసాంతం వీపున మోసుకుంటూ తిరిగిన వాడు ఆ మహర్షి. అందుకు భిన్నంగా శ్రోతలకు సంతోషం కలిగించడం నా ప్రయత్నం. అందులోనూ ముఖ్యంగా నా స్నేహితుడు వర్మకు. అతడు బోర్డులేని హోటలుకు యజమాని. నామీది ఆద రంతో ఒక కుర్చీని నాకోసం ప్రత్యేకంగా కేటాయించాడు గూడా. ఇతరులెవ్వరూ దాన్ని ఆక్రమించకుండా, నేను లేనప్పుడు దాన్ని ఒక మూలన తిరగేసి ఉంచేస్తాడు. వ్యాపార దృష్టితో చూస్తే, అక్కడికి వెళ్లిన ప్పుడు నేను తీసుకునే ఒక కప్పు కాఫీలో మిగిలేది మినహా, నా ద్వారా అతనికి ఆదాయమంటూ లేకున్నా అతని ఆప్యా యత అలాంటిది.

ఆనవాయితీగా నా కుర్చీని వాల్చే స్థలా నికి ఎదురుగా భయంకరమైన ఆకారంలో మహిషాసురుడుండే క్యాలెండర్ తగిలించి వుంది. మెడ చుట్టూ, భుజాల చుట్టూ పెనవేసుకున్న పాములు, విభూతి పులు ముకున్న నొసలు, చెక్కిళ్ళమీద పొదలా నులిదిరిగిన మీసాలపైన ఉబ్బుకొచ్చిన కనుగుడ్డు, నరకడానికి సిద్ధంగా ఎత్తిపట్టు కున్న వంకరటింకర కరవాలం- ఆ బొమ్మ పరమ భయంకరంగా ఉంది. దానివైపు చూసేందుకే నాకు బుద్ధి పుట్టదు. చూస్తే ఆందోళన కలుగుతుంది. అది ఏడేళ్లనాటి క్యాలెండరు. చెత్తకుప్పలోకి చేరే అదను ఎప్పుడో దాటేసింది. పారేయమంటే వర్మ వినిపించుకోడు.

"ముప్ఫైయ్యేళ్ళుగా నేను ఏ క్యాలెండ రునూ పారేయలేదు. నా ఇంట్లో గోడలకు ఇప్పటికీ ఉన్నాయి. కొన్నైతే ఒకే మేకుకు ఒకదానిమీద ఒకటిగా నాలుగైదు వరు సలు తగిలించి ఉంటాయి. అన్నీ మన దేవతల పటాలే. దేవతలను ఎవరైనా పారేసుకుంటారా? " అంటాడు.

అతనితో వాదించి ప్రయోజనముం డదు. అతి చిన్న నౌకరీ నుండి ఇప్పటి స్థాయికి స్వయంకృషితో ఎదిగిన మనిషి కాబట్టి, తన ఆలోచనలు విశిష్ఠమైనవనీ, తన బుర్ర ఎప్పుడూ పొరపాటు చెయ్యదనీ అతనికి అపారమైన నమ్మకం. ఎప్పుడైనా ఒకసారి అతడు ముచ్చటించే జ్ఞాపకాలను నోరెత్తకుండా వినడం తప్ప, 'అదిగాదు, ఇది గాదు' అంటూ అభ్యంతరాలు కలి గించే ప్రయత్నం నేనెప్పుడూ చెయ్యలేదు. ఆ వినడం గూడా ప్రశంసాపూర్వకంగా తల ఆడిస్తూ వింటుంటాను. నా అదృష్టం కొద్దీ, అతనికి ఉబుసుపోక మాట్లాడే అల వాటు లేదు. వినేందుకే పుట్టిన జాతకుడు వర్మ. ఎదుటిమనిషికి అవకాశం కల్పించ కుండా నరుక్కుపోయే వక్తలకు వడ్డించిన విస్తరాకు. అతని బల్లకు ఓవైపుగా కూర్చుని నా కథ నేను చెప్పుకుంటూ పోతూంటే, చిల్లర డబ్బులు ఎంచుకుంటూ గూడా ఒక్కమాటనైనా నిర్లక్ష్యం చెయ్య కుండా గ్రహించగల సామర్థ్యం వర్మది.

★ ★ ★

వర్మను ఆకట్టుకున్న కథల్లో డా. రాన్‌కు సంబంధించింది ముఖ్యమైంది. అనేక వారాలుగా దాన్ని విడతలు విడతలుగా చెప్పుకొస్తున్నాను. 'డా.రాన్' అనేది వాస్తవానికి మన దేశస్తుని పేరేనని తెలుసుకునేందుకు నాకు కొంత సమయం పట్టింది. 'రంగన్' అనే పేరుతో కొన్ని ఇంగ్లీషు అక్షరాలను కత్తిరించి, కుట్టుపనితో విదేశీ పేరుగా ధ్వనించేలా అతికిన కుశలత అందులో దాగుంది. ఏ జర్మనీవాడో, రుమేనియావాడో, హంగేరివాడోనని ఎవరైనా పొరపాటు పడితేపడొచ్చుగానీ, అతడు పుట్టింది మాత్రం దక్షిణ భారతదేశం కొసలో వెలసిన 'మణియూర్' పేరుగల పల్లెటూరులో. వరి పొలాలూ, కొబ్బరితోటల నడుమ, బంగారు వన్నె కలశాలతో అలరారే గాలిగోపురముండే దేవాలయంతోపాటు చుట్టూ కిటకిటలాడే పెంకుటిళ్ళూ, గుడిసెలతో ఆ ఊరుంటుంది. దక్షిణ భారతదేశంలోని వేలాది ఇతర గ్రామాల్లాగే ఉండటంతో చరిత్రకారుల దృష్టికి గానీ, మ్యాపులు తయారుజేసే నిపుణుల దృష్టికి గానీ ఎక్కకుండా తప్పిపోయిందీ కుగ్రామం.

పేరు చివరన పునరావృతమయ్యే ఇంగ్లీషు 'ఎన్'తో రాన్‌గా సంచరించే ఈ మనిషికి ఆ పల్లెటూరే జన్మస్థలమైనా, అతని జుత్తు తేనె రంగులో ఉంటుంది. కళ్ళు ఆకుపచ్చ ప్రతిబింబించే నీలం రంగులో ఉంటాయి. చర్మం దక్షిణాదికి అరుదైన చందనపు రంగులో ఉంటుంది. అతని జాతీయతకు సంబంధించి నా అనుమానం వితండంగా కనిపించినా, చారిత్రిక వాస్తవాల దృష్ట్యా అసంభవం ఏమాత్రం కాదు. ఇంగ్లీషు, ఫ్రెంచ్, పోర్చుగీస్ సైన్యాలు వలసాధిపత్యం కోసం పరస్పరం పెనుగులాడే సందర్భంలో, అవి మణియూర్ ప్రాంతంలో విడిదిచేసివుండటం కద్దు. పెనుగులాటకు మధ్య మధ్యలో విరామం దొరికినప్పుడల్లా ఆ సైనికులు ఇరుగు పొరుగు గ్రామాల్లో సరదాగా కాలం గడిపినట్టు అందరికీ తెలిసిందే.

మొట్టమొదటిసారిగా అతన్ని నేను కలిసింది మా టౌన్‌హాలు రీడింగ్ రూంలో. పత్రికా విలేఖరిగా నిలదొక్కుకోవాలని నాకు నేను తలక్రిందులుగా తపస్సు చేస్తున్న రోజులవి. ఫలానా పత్రికకు ప్రతినిధి అనే నియామకం లేనందున, నన్ను 'భూమండలం విలేఖరి'గా మా గ్రామస్తులు వెక్కిరించేవాళ్ళు. ఎవరు ఏమనుకున్నా నేను మాత్రం నియమం తప్పకుండా నా సైకిల్లోనో, పొరుగింటి సాంబుడి స్కూటర్ అరువు తీసుకునో, తెల్లవారింది మొదలు చీకటి పడేంతవరకు, ఒకచోట కాలు నిలపకుండా, విశ్రాంతి ఆశించకుండా పట్నమంతా తిరుగుతూనే ఉంటాను. పత్రికా విలేఖరిలాగా నోటు బుక్కు చేత్తో పట్టుకుని, జేబులో కొట్టొచ్చినట్టు కనబడే పేనాతో, మున్సిపల్ మీటింగుల్లో నైతేనేమి, మేజిస్ట్రేటు కోర్టులో నైతేనేమి, ఆల్బర్ట్ మిషన్ విద్యాలయాల బహుమతి ప్రదానం వేడుకల్లోనైతేనేమి, ఎక్కడ చూసినా నేనే, ఎప్పుడు చూసినా నేనే. మైళ్ళకు మైళ్ళు తిరిగీ తిరిగి, చివరకు నా ప్రయత్నం రైల్వేస్టేషన్‌లో మెయిల్ బోగి దగ్గర, నా సమాచారాన్ని 'ఆలస్య రుసుము' చెల్లించి తపాలా చేయడంతో ముగుస్తుంది. ఇదంతా అవసరంలేని తొక్కులాటే. ఎందుకంటే నా వార్తల కోసం కాచుకుని, రాలేదని హైరానాపడుతూ ఇటూ అటూ పచార్లు చేసే పత్రికా సంపాదకుడెవడూ నాకు తటస్థించలేదు. లేకపోతే పోనీగాక, నాకై నేను నియమించుకున్న ఉద్యోగంలో నేను పొందే ఆనందం నాకుంది. ఎప్పుడో ఒకప్పుడు,

ఖాళీని భర్తీ చేసేందుకు మరో సమాచారం దొరక్క, నేను పంపిన ముక్కలో నాలుగైదు వాక్యాలు అచ్చులో కనిపిస్తే చాలు, అదే నాకు పదివేలు.

విలేఖరి వృత్తి నాకు జీవనాధారం కాదు. ముందుతరాల కష్టార్జితంతో సంపన్నంగా బతికే కబీర్ వీధి కుటుంబాల్లో నాదీ ఒక కుటుంబం. ఒకరితో ఒకరికి బంధుత్వాలు లేవుగానీ, ఇదే రకం కుటుంబాలు ఇరవైదాకా కబీర్ వీధిలో కాపురమున్నాయి. వీధిలో మొగసాలతో మొదలై, వెనకవైపు ప్రవహించే నదిదాకా లోగిళ్ళతో, లంకంత నివాసాలు అన్ని కుటుంబాలకూ ఉన్నాయి. పంచలో అరుగుమీద కూర్చుని వీధిని గాలించడం, స్వగ్రామంలో కోతలు ఎప్పుడు ముగుస్తాయా అనుకుంటూ ఎదురుజూడటం, అవి ముగియగానే కౌలు డబ్బులు వసూలు చేసుకోవడం మినహా ఇక్కడి పురుషులు చేసేందుకు పనులంటూ లేవు. ఇది అంతరించిపోతున్న జాతి. ఇలాటివే మరో ఇరవై కుటుంబాల దాకా ఎల్లమ్మ వీధిలో ఉన్నాయి. ఎప్పుడో వంద సంవత్సరాలకు పూర్వం, పట్టణ సౌకర్యాల కోసం, ఆల్బర్ట్ మిషన్ పాఠశాలలో పిల్లల చదువుకోసం గ్రామాల్లోనుండి భూస్వాములు ఇక్కడికొచ్చి, ఈ రెండు ప్రదేశాల్లో ఇళ్ళు కట్టుకుని స్థిరపడ్డారు. సకల సౌకర్యాలు సంక్రమించుకున్న వాళ్ళ వారసులకు తినడం, కనడం, శుభకార్యాలు చేసుకోవడం, మధ్యాహ్నం భోజనాలు ముగించుకుని అరుగుమీద నింపాదిగా కునుకు తీయడం, సాయంకాలాల్లో పేకాడటం తప్ప వేరే వ్యాపకంతో అవసరం ఏర్పడలేదు. ఆడవాళ్లకు ఎప్పుడో తప్ప బయటికి అడుగుపెట్టే అవసరం రాదు. వంటగదిలోనో, పట్టుచీరలూ బంగారు నగలూ జాగ్రత్త చేసుకుంటూనో ఇంట్లోనే రోజంతా గడిపేస్తుంటారు.

ఈ తరహా జీవితం నాకు నచ్చలేదు. చురుగ్గా ఉండాలనేది నా అభిమతం. జర్నలిస్టును కావాలని కలలు కనేవాణ్ణి. 'ఎందుకని?' అంటూ అడిగితే నా దగ్గర సమాధానం లేదు. నేను ఇంటిపట్టునుండే సమయం చాలా తక్కువ. బ్రహ్మచారిని కావడం నాకొక వరం. మా వీధి సంప్రదాయానికి భిన్నమైన మరో శాల్తీ నా పొరుగింటి సాంబడు. తల్లి చనిపోగానే అతనికి పుస్తక పఠనం మీద ధ్యాస ఏర్పడింది. అతని తండ్రికి అచ్చులో వున్న సారస్వతం అచ్చిరానిదైనా, ఇబ్బందిలో వున్న ఒక విద్యావేత్తకు ఆర్థికంగా సాయపడ్తూ, కుదువగా ఉంచుకున్న పెద్ద పుస్తక భాండాగారాన్ని తన వారసునికి కానుకగా వదిలేసి వెళ్ళిపోయాడు.

ఒకరోజు, మార్కెట్ గేటు సమీపంలో, ఒక భిక్షగత్తె ఒడిలో శరీరాలు అంటుకుపోయి పుట్టిన కవలలు (సయామీస్ ట్విన్స్) నాకు కనిపించారు. ఫోటోగ్రాఫర్ వృత్తిలో వుండే నా స్నేహితుడు జయరాజును బతిమాలి, వాళ్ళ ఫోటో తీయించాను. దానికి తగిన వ్యాసం రాసి, టౌను హాల్ రీడింగ్‌రూంలో నా కంటబడిన మొట్టమొదటి వార్తాపత్రిక చిరునామాకు పంపించాను. నా పాత్రికేయతకు అది అరంగేట్రం (తొట్టతొలి రంగప్రవేశం). అది మొదలు టౌన్‌హాల్ లైబ్రరీని క్రమం తప్పకుండా సందర్శించడం, నేను పంపిన సమాచారం అచ్చులో వచ్చిందో లేదో పరీక్షించడం నాకు వ్యసనంగా మారింది.

ఆ లైబ్రరీ పేరు 'లాలీ మెమోరియల్ లైబ్రరీ అండ్ రీడింగ్ రూం.' సర్ ఫ్రెడరిక్ లాలీ వీలునామా మూలంగా సంక్రమించిన పెట్టుబడితో ఏర్పాటైన సంస్థ కావడంతో దానికి ఆ పేరొచ్చింది. వెంటిలేటర్ దిగువన, గోడకు దిగేసిన మేకునుండి వేలాడుతూ కనిపించే ఆయన చిత్రపటం

# అస్మదీయుడా.. తస్మదీయుడా?

తిరుపతి వెంకటకవుల పాణిగృహీత - శ్రవణానంద కావ్యాల్లోని లోపాలను తూర్పారపడుతూ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'పాణి-



గృహీతా శ్రవణానంద శృంఖల' అన్న పేరుతో ఓ గ్రంథాన్ని రాసి బాగా పేరుపొందిన రోజులవి. అప్పట్లో మిత్రులు దుగ్గిరాల సూర్యప్రకాశరావుతో పని ఉండి కాకినాడ వెళ్లారు-శ్రీపాద వారు. పని అయిపోయిన తర్వాత సూర్యప్రకాశరావుగారి ప్రోత్సాహంతో పోలవరం జమీందారువారి వద్దకు వెళ్లారు. వారు వెళ్లేటప్పటికి పగలు సుమారు నాలుగు గంటల సమయం. జమీందారు భవంతి అరుగుమీద తిరుపతిశాస్త్రి వారు పచార్లు చేస్తున్నారు. ఏదో ఆలోచించుకుంటూ వారిద్దరూ తిరుపతిశాస్త్రివారికి నమస్కరించారు. ఆయన ఆశీర్వదించి "వారెవరు? " అని సూర్యప్రకాశరావుగారిని అడిగారు.

అప్పుడు వెంటనే ఆయన "అన్నట్టు చెప్పడం మరిచిపోయాను. మీకు 'శృంఖలాలు' తగిలించిన వారే వీరు" అని శ్రీపాదవారిని పరిచయం చేశారు.

"అయితే మా శత్రుకోటిలో వారే అన్నమాట" అన్న తిరుపతిశాస్త్రివారు, అంతలో ఏమనుకున్నారేమో "కాదు కాదు- మా పొరపాట్లు చూపించినవారు మిత్రకోటిలో వారేగాని- శత్రుకోటిలోనివారెలా అవుతారు? " అన్నారు. ఆ మాటలకు చకితులైపోయారు శ్రీపాదవారు.

స్మితం

# యథేచ్ఛగా వాడుకోవచ్చు!

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి పినతల్లి కుమారుడు కళా సూర్యనారాయణ సంస్కృత కావ్యాలు చదివారు కాకరపర్తిలో - శ్రీపాదవారితో కలిసి. వయసులో కొంచెం పెద్ద. ఒక



పర్యాయం శ్రీపాదవారిని చూడ్డానికి పోలమూరు వెళ్లడానికి రాజమండ్రిలో రైలెక్కారు. ఆ రైల్లోనే అక్కడే శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఎక్కారు. కాసేపటికి పరస్పరం పరిచయాలు చేసుకున్నారు. అనపర్తిలో దిగి పోలమూరు వెళుతున్నానన్నారు- సూర్యనారాయణగారు. 'అక్కడ బంధువులెవరైనా ఉన్నారా? ' అని చెళ్ళపిళ్ళవారు ప్రశ్నించారు. 'శ్రీపాదవారు ఉన్నారు' అని చెప్పారు- సూర్యనారాయణగారు. అప్పట్లో శ్రీపాదవారి 'శ్మశాన వాటిక' నవల బాగా వ్యాప్తిలో ఉంది. వెంటనే 'వారి శ్మశానవాటికను నేను చూశానని చెప్పండి' అన్నారు చెళ్ళపిళ్ళ వ్యంగ్యంగా. అదే మాట సోదరుడితో చెప్పారు కళావారు. వెంటనే శ్రీపాదవారు 'నేను శ్మశానవాటికను నిర్మించాను. దాని యెడల శ్రద్ధాసక్తులు ఉన్నవారు ఎవరైనా స్వేచ్ఛగా ఉపయోగించుకోవచ్చునని చెప్పమన్నాడు మీతో అని వారితో చెప్పు. కడియంలో దిగి తప్పకుండా చెళ్ళపిళ్ళ వారితో మరీ చెప్పు' అన్నారు.

అందుకు నిదర్శనం. హాలు నడిమి ప్రదేశాన్ని ఆక్రమించుకున్న పొడవాటి బల్ల మీద రకరకాల వార్తాపత్రికలూ, సంచికలూ మార్చిమార్చి పేర్చబడి ఉంటాయి. వాటిలో ఎక్కువభాగం శ్రేయోభిలాషుల విరాళాలతో సంపాదించినవే. రీడింగ్ రూంకు అలవాటుగా వచ్చే సందర్శకులు ఆ బల్లచుట్టూ బెంచీలమీద ఆసీనులై, ఏ తేదీదో కూడా గమనించకుండా వాటి పేజీల్లో మునిగుంటారు. ముఖద్వారానికి పక్కన, హాలు మొత్తాన్ని నిరంతరాయంగా పర్యవేక్షించేందుకు అనుకూలమైన

> ## కొత్తగాలి...
>
> **తథాగతుడు**
> **బిత్తరపోయాడు**
> **తననెప్పుడు జనం**
> **చేస్తారో నిమజ్జనం అని**
>
> – హర్షవర్ధన్, సికింద్రాబాద్

స్థానంలో, సందర్శకుల మీద కన్నేసి వుంచిన ముసలాయన కూర్చోనుంటాడు. నాకు జ్ఞాపకంలేనంత పురాతన కాలం నుండి ఆయన ఈ లైబ్రేరియన్ ఉద్యోగం చేస్తున్నాడు. ఉదయం తొమ్మిది గంటలకు కచ్చితంగా తలుపులు తెరుస్తాడు. తలుపులు తెరిచింది మొదలు బల్లను వదలకుండా అంటిపెట్టుకునే గబ్బిలాలను పోలిన పాగీలను బయటికి నడిపిస్తూ కచ్చితంగా సాయంత్రం ఐదుగంటలకు తలుపులు మూసేస్తాడు. "అదృష్టంకొద్దీ కమిటీవాళ్ళు కొవ్వొత్తులను మంజూరు చెయ్యక సరిపోయిందిగానీ, చేసుంటే ఈ జలగలు అర్ధరాత్రిదాకా వదిలేవిగావు" అంటుంటాడు ముసలాయన. అతనికి అందరిపట్లా అసహనమే, అందరి మీదా అనుమానమే. ఎందుకో నన్ను సహించడమేగాక, ఇష్టపడతాడని గూడా నా నమ్మకం. అతని కుర్చీ పక్కన చెక్కస్టూలు రూపంలో ఒక అదనపు సీటుగూడా ఉంటుంది. నేను కనిపించగానే ఆ సీటు నాకు కేటాయిస్తాడు. నా ప్రయాసను ప్రశంసిస్తాడు. పట్నం తిరిగి నేను సేకరించిన సమాచారాన్ని మనసుపెట్టి వింటాడు. అదనంగా కొత్త పత్రికలు తెప్పించేందుకు చందాదారులను సమకూర్చే సామర్థ్యం నా నుండి ఆశిస్తాడు. వర్మ, ఖర్చు విషయంగా ఎంత ములాజు లేని మనిషైనా, మద్రాసు నుండి వెలువడే రెండు కొత్త పత్రికలకు అందిస్తున్న చందా నా మూలంగా కుదిరిందే.

ఆరోజు నేను లైబ్రరీలో అడుగెట్టాను. ఆనవాయితీగా నాకు కేటాయించే సీటు ఖాళీగా కనిపించలేదు. ఇరకాటంగా ముఖం పెట్టి లైబ్రేరియన్ నావైపు దీనంగా చూశాడు. సూటూ బూటులో దర్జాగా కనిపించే పరాయిమనిషి నా సీటును ఆక్రమించాడు. బల్ల కిందికి కాళ్ళు పారజాపి, తన కుర్చీలో విలాసంగా చేరగిలబడే అలవాటుకు దాసుడైన లైబ్రేరియన్ ఆ సౌఖ్యాన్ని గాలికి వదిలేసి, బిగుసుకుపోయిన పీనుగులా నిటారుగా కూర్చున్న వాలకం చూస్తే చాలు ఆగంతకుని డాబుసరికి అతడు ఎంత కంగారుపడుతున్నాడో ఇట్టే తెలిసిపోతుంది. నేను అగుపించగానే లైబ్రేరియన్‌కు ప్రాణం లేచొచ్చింది. 'ఈయన మీ కోసమే ఎదురు చూస్తున్నారు' అంటూ బరువును దించుకున్నాడు. ఆ పరిచయాన్ని ఆగంతకుడు గుర్తించి గూడా, నోరు మెదపకుండా గమ్మున కూర్చుండిపోయాడు. నీలిరంగు సూటు, గొంతు కింద వేలాడే టై, నిగనిగలాడే జోళ్ళు, చేతిలో పట్టుకున్న టోపీ-

చూసీచూడకముందే అతడొక వింత మని షిగా నాకు ధ్రువపడింది. అతని ఉనికే నాకు ఏవగింపు కలిగించింది. 'మాట్లాడేం దుకు నోరు లేదా? నాతో పనేమిటో చెప్పు కోవాలా? ముందు నా సీటు ఖాళీ చేస్తావా చెయ్యవా? నిలుచుని మాట్లాడే అలవాటు నాకు సుతరామూ లేదు' అనా లనే ఉద్రేకం పొడుచుకొచ్చినా, నన్ను నేను సంబాళించుకున్నాను. పొడవాటి బల్ల చుట్టూ మూగిన వార్తాపత్రికల వ్యసనప రులు తదేకంగా ఇటువైపే చూస్తున్నారు. సూటూ బూటూ హ్యాటులో ఉండే మనిషి టౌనుహాల్లో దర్శనమివ్వడం వాళ్ళ అనుభ వంలో లేనిది. తన దినసరి కార్యక్రమాన్ని కొనసాగించడం వీలుపడక మరోవైపు లైబ్రే రియన్ గింజుకుంటున్నాడు.

గంభీరంగా ఆగంతకుని ముఖంలోకి చూస్తూ, "నాతో మాట్లాడాలని వచ్చారా? " అన్నాను.

"ఔను" అన్నాడు అతడు జవాబుగా.

"ఐతే బయటికి పోదాం పదండి. చదు వుకునేవాళ్ళకు అంతరాయం కలిగించడం మంచిదిగాదు"

అతడు లేచి వరండాలోకి నన్ను అనుస రించడంతో, ఏదో విజయం సాధించిన భావం నాకు లోలోపల కలిగింది. ఆ ప్రాంగణం మీద అధికారం ఉట్టిపడే చూపుతో పరిసరాలను పరీక్షించి, "మనకు అంగుళం జాగా మిగల్లేదు" అన్నాను. నిలుచున్నప్పుడు ఆపాదమస్తకం అతన్ని పరికిస్తే, కూర్చున్నప్పుడు కనిపించినంత భారీ విగ్రహం కాదనీ, అతడంత పొడగరి కాదనీ తెలిసొచ్చింది.

"అంగుళమైనా ఖాళీ లేదు. ఎక్కడ చూసినా గుంపులే" అన్నాను మరోసారి. తిరుగుబోతులు పచ్చికమీద ఆరేసుకుని పడుకున్నారు. సోమరిపోతులు గుంపులు గుంపులుగా వేరుశనక్కాయలు వొలుచు కుని తింటున్నారు. అక్కడక్కడ వేసున్న సిమెంటు బెంచీలను ఎవరెవరో ఆక్రమిం చుకున్నారు. చుట్టూ కలయజూసి, మాల్గుడి పౌరులపట్ల తనకు కలిగిన అస హనాన్ని దాచుకుంటూ, "కిందికి దిగి వెదు కుదాం. ఈ వేళప్పుడు ఇంతమందికి నిద్ర పట్టడం అసందర్భంగా ఉంది" అన్నాడ తడు.

"పాపం, వాళ్ళకు రాత్రంతా తీరిక దొరి కుండదు" అన్నాను.

అతనికి ఇబ్బంది కలుగుతున్నందుకు ఆనందిస్తూ, దక్షిణం మూలన ఊడలు తన్నుకుని విస్తరించిన మర్రిచెట్టును సూచించి, "అలా వెళ్ళి నీడలో కూర్చుం దామా? " అన్నాను.

అటుగా చూపు సారించి, అతడు నిర్లి ప్తంగా భుజాలు నిక్కరించాడు. మరింత పెద్ద పోరంబోకుల గుంపుకు తోడు, రెండు గాడిదలు శిలాప్రతిమల్లా అక్కడ ని లుచుకునున్నాయి. వాటికి కొద్ది ఎడంగా ఒక వీధికుక్క చుట్టచుట్టుకుని దుమ్ములో పడుకొనింది.

నా సలహా అతనికి మంట పుట్టించి నట్టు గమనించి, "అటువైపు గడ్డి మెత్తగా ఉంటుంది" అంటూ ఉపశమనం కలిగించే ప్రయత్నం చేశాను. 'స్పెన్సర్ ఫర్నిచర్ దుకాణం నుండి కుషన్‌సీట్లు కావాలనుకుం టున్నాడేమో ఇతగాడు' అనుకున్నాను లోలోపల.

"నాకు నేలమీద కూర్చునే అలవాటు లేదు. అది తప్పిపోయి చాలా కాలమైంది" అన్నాడు.

"ఎంత కాలమో? " అతని గతాన్ని కూపీ లాగే ప్రయత్నంతో అడిగాను. నా ప్రశ్నకు బదులివ్వకుండా అతడు, "దగ్గరలో ఏదైనా బార్‌గానీ, రెస్టారెంట్‌గానీ లేదా? రద్దీలేని మూలన కూర్చుని మనం మాట్లాడుకునేం దుకు? " అన్నాడు.

"ఇక్కడ బార్లూ లేవు, మంచి రెస్టారెంట్లూ లేవు. విమానాశ్రయం లేదు. నైట్ క్లబ్బు కూడా లేదు. కొత్త కాలనీలో 'కిస్మత్' అనే క్లబ్బొకటి ఉందిగానీ, అంత బావుండదని వినికిడి. ఇంకా కావాలంటే ఇక్కడ ఏమేం లేవో మీకు పెద్ద జాబితా ఇవ్వగలను. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే, అయ్యా, ఇక్కడ బార్లు లేవు. కావాలంటే కల్లు దుకాణాలు ఉన్నాయి. ముంతలో ఇస్తారు. ముంతతోనే తాగాలి"

"అవసరం లేదు, థ్యాంక్యూ. నేను టీటోటాలర్‌ను. మద్యం, మాంసం, మగువలూ గిట్టనివాణ్ణి. బార్లో నాకు కావలసింది మనం మాట్లాడుకునేందుకు రద్దీలేని ఓ మూల, దానితోపాటు రెండు గ్లాసుల నారింజ రసం."

"ఇక్కడి వాళ్లకు ఆపిల్ పండ్లూ, నారింజ పండ్లూ తెలీనేతెలీదు. మాకు దొరికేది మామిడి, జామ, సీతాఫలం వంటి చౌకరకాలు" అన్నాను మండిపడుతూ.

మా ఊర్లో ఈ బడాయి మనిషి ఉనికే నాకు ఎబ్బెట్టుగా ఉంది. అందుకే మా వెనకబాటుతనాన్ని పదిరెట్లు ఎక్కువచేసి అతనిమీద గిరాటు వేశాను. మార్కెట్‌కు ఉత్తరం కొసలోవుండే పాషా పళ్ళదుకాణం పేరెన్నికగన్న దుకాణం. అక్కడ దొరకని పండ్లరకం లేదు. అతడు ఆపిల్ పండ్లను కులూ లోయనుండీ, ద్రాక్షను హైదరాబాదు నుండీ, ఎండు ఫలాలను అరేబియా నుండీ నేరుగా తెప్పిస్తాడని ప్రతీతి. పండ్లను ఆకర్షణీయంగా పేర్చి పెట్టడంలో అతని పాటవానికి ప్రతి ఏడాది మొదటి బహుమతి ఇస్తున్నారు పురపాలక సంఘం వాళ్ళు.

చివరకు, ఫౌంటెన్ చుట్టూ కట్టిన ప్రహరీగోడ మీద మాకు ఖాళీ దొరికింది. అది వరకు అక్కడ కూర్చున్న ఇద్దరు మనుషులు లేచీ లేవకముందే ఒకే దూకుతో దాన్ని స్వాధీనం చేసుకున్నాను.

గోడమీద కూర్చుంటూ, "మీరు ఇక్కడికొచ్చి ఎన్ని రోజులైంది? " అన్నాను అతనితో. ఇక ఆ గోడమీద కూర్చోక అతనికి తప్పింది గాదు. దుమ్ము ఊదేసి, చేతిగుడ్డ పరిచి, నా పక్కన కూర్చున్నాడు. కదలించినంతసేపు కదిలించాను కాబట్టి, ఇక మాట్లాడే వంతు అతనికే వదిలేస్తూ గమ్మున కూర్చున్నాను. నా ప్రశ్న కోసం ఎదురుజూస్తూ అతడు గూడా నిశ్శబ్దంగా ఉండిపోయాడు. అతని డాంబికానికి నేను కుదేలైపోలేదని తెలిసేట్టుగా కొద్దిసేపు వాతావరణం గురించి మాట్లాడాను. మరి కొంతసేపు ఏవేవో గమ్మత్తు రాజకీయాలు ముచ్చటించాను.

"ఆ ముసలాయన నా గురించి ఏం చెప్పాడో మీకు? " అన్నాను.

"ఈ ఊర్లో ఎవ్వరైనా నాకు సహాయం చెయ్యగలిగితే అది మీరొక్కరే అన్నాడు"

"మీకు కావలసిన సహాయమేమిటో? అంత పలుకుబడి నాకుందని అనుకోడం లేదు"

"అలా అనకండి. ఎవరి శక్తి వాళ్ళకు తెలీదు. మీరు పత్రికా విలేఖరి. చురుగ్గా తిరుగుతుంటారు. ఈ టౌను మొత్తం బాగా తెలిసిన వారు. ఏది తెలుపో ఏది నలుపో మీకు బాగా తెలుసు"

ఈ ప్రశంస నన్ను లొంగదీసుకుంది. "మీరు ఎక్కడి నుండి వస్తున్నారు? " అడిగాను.

"టింబక్టూ అనుకోవచ్చు"

"అహా, ఏం పరాచికం!"

"పరాచికం కాదు, అది ప్రపంచంలో వాస్తవంగా ఉన్న ప్రదేశం."

"ఔను! అలాటి ప్రదేశం నుండి మనుషులెవరైనా వస్తారని నా ఊహకు అందలేదు. మీరే మొదటి మనిషి"

అతడు తొణక్కుండా గంభీరంగా చెప్పు

కుపోయాడు- "ఆఫ్రికా పడమటి తీరంలో అది చాలా ముచ్చటైన ప్రదేశం. మంచి భవిష్యత్తుండే నగరం. ఇప్పుడిప్పుడే అభివృద్ధిలోకి వస్తూ వుంది. రోడ్లమీద మోటారు కార్లూ, రోడ్లకు ఇరువైపులా ఆకాశాన్ని తాకే భవనాలూ- అమెరికన్లు కుప్పలు తెప్పలుగా డబ్బు గుమ్మరిస్తున్నారు"

"దాన్ని వదిలి మరి ఇక్కడికి ఎందుకు రావలసివచ్చింది? "

"ఐక్యరాజ్యసమితి ప్రాజెక్టు మీద"

అదేమిటో అడగదలుచుకోలేదు. 'ప్రాజెక్ట్' అనే పదం వివరణకు అతీతమైంది కావడంతో దాన్ని యథాతథంగా ఆమోదించడం మర్యాద. ఈ పదాన్ని వార్తా పత్రికల్లో చూశాను. విద్యాధికులూ, ఇంజనీర్లూ, కొత్త కొత్త రంగాల్లో దూకిన సాహసికులు అంటుండగా విన్నాను. అది వినవలసిందే తప్ప వివరాల్లోకి పోదగింది కాదు. ఒక్కోసారి నింపాదిగా ఈగలు తోలుకుంటూ కూర్చుని, హెడ్‌క్వార్టర్సుకు నివేదికలు పంపేందుకు మాత్రమే పరిమితమైన పనిని గూడా 'ప్రాజెక్ట్' అని వ్యవహరిస్తుంటారు.

నా మనసులో మాటను పసిగట్టినవాడికిమల్లే అతడు తనకు తానుగా వివరించేందుకు పూనుకున్నాడు.

"నేను మోపెడంత సమాచారం సేకరించి, హెడ్‌క్వార్టర్స్‌కు నివేదికలు పంపించాలి. ఆయువుపట్టులాటి ఒక విషయాన్ని ఆధారం చేసుకుని ఒక పుస్తకం రాస్తున్నాను. దానికోసం నేను సేకరించిన సమాచారాన్నంతా ప్రశాంతంగా కూర్చుని క్రోడీకరించాలి. ఒక క్రమంలో ఏర్పాటు చేసుకోవాలి. అందుకు ఇది చాలా అనుకూలమైన ప్రదేశమని తెలుసుకున్నాను. వచ్చి మూడు రోజులైంది. రైల్వేస్టేషన్‌లో ఆ చిన్న వెయిటింగ్ రూంలో నివసిస్తున్నానంటే నమ్మండి. ఒకటే నల్లులు! రాత్రంతా కూర్చునే గడుపుతున్నాను. దయవుంచి, ఇప్పుడు రైల్వే మంత్రిగా ఎవరున్నారో చెప్పండి. అతనికి ఒక ఉత్తరం తయారు జేసి పంపేందుకు నాకు సహకరించండి"

అతని బడాయికి నా తల తిరిగిపోయింది. అతని హెచ్చులు ఖాతరు చెయ్యకుండా, నెత్తిమీద వెదురుబుట్టతో వేరుశెనక్కాయలు అమ్మడానికి వచ్చిన మనిషిని కేకేసి, అతడు దగ్గరికి రాగానే కొలతల మీదా తూకాల మీదా ఆక్షేపిస్తూ కొద్దిసేపు తగాదా పడి, మరికాస్సేపు ఖరీదు మీద బేరమాడి, ఆ తరువాత కొనుక్కున్న శనక్కాయలను నా పక్కలో గోడమీద పోయించుకున్నాను. నా మిత్రుడు ఖంగు తిన్నాడు.

"మొత్తం మాంసకృత్తులు. గాలి కూడా చొరబడనంత కట్టుదిట్టంగా ప్రకృతి ప్రసాదించిన పరిశుభ్రత. సూక్ష్మాతి సూక్ష్మమైన క్రిమిగూడా ఇందులో చొరబడలేదు. దారిలో నేలమీద పడి కాయొకటి దొరికిందే అనుకోండి. శుభ్రంగా దుమ్ము ఊదేసి, కాయ పగలగొట్టుకుని ఇన్‌ఫెక్షన్ గురించి ఆందోళన పడకుండా తినొచ్చు. ప్రకృతి సిద్ధమైన ఈ ఏర్పాటు అద్భుతంగా లేదూ? " అన్నాను.

గచ్చు ఉపరితలం మీద ఒక కాయను పగలగొట్టి, పప్పులు అరచేతిలోకి రాల్చుకుని, వాటిని అతనివైపు చాచాను.

చిన్నబోయిన టింబక్టోవాసి సాకులు చెప్పి, వాటిని వద్దన్నాడు.

★ ★ ★

రైల్వేస్టేషన్ వెయిటింగ్ రూంనుండి తనను విముక్తి చేయడం అతడు నాకు విధించిన బాధ్యత. స్టేషన్ మాస్టరు బెంబేలెత్తిపోతున్నాడు. ఒకటి ఎప్పుడో పొద్దున పూటా, రెండవది మరెప్పుడో సాయంకాలం పూటా అక్కడ ఆగే ప్యాసింజర్

బండ్ల రాకపోకలకు జెండా ఊపడం, అక్కడ నిలవని ఎక్స్‌ప్రెస్ రైళ్ళకూ, గూడ్స్ బళ్ళకూ పచ్చజెండా చూపడం వంటి చిరు ఉద్యోగం చేసుకునే పొట్టి మానవుడు ఆ స్టేషన్ మాష్టరు. ఊపడం పూర్తికాగానే జెండా చుట్టి, చంకలో దోపుకుని తన ఆఫీసు గదిలోకి వెళ్ళి కూర్చుంటాడు. టెలిగ్రాఫ్‌కాడ చేసే టకటకారావాల అలికిడికి చలించకుండా, తన బల్లమీద మట్టిరంగు కాగితాల రిజిస్టరును పరచుకుని, నమోదు చేయవలసిన అంకెలను ఆయా స్థానాల్లో నింపేస్తాడు. ప్రయాణికులందరూ వెళ్ళిపోయారని నిర్ధారణ చేసుకుని, ప్లాట్‌ఫాం గేటుకు తాళం వేసుకుని, పనికిరాని రైల్వే స్లీపర్లతో దడిగట్టిన చిన్న కుటీరంలోకి విరమిస్తాడు. ఆ దడి పక్కన, విచ్చుకుని పెరిగిన సంకేసుల చెట్టు నీడలో, గంపెడు పిల్లలు మట్టిలో ఆడుకుంటూవుంటారు. ఎక్కడో దూరంగా, కొత్త ఢిల్లీలో కొలువైన రైల్వేబోర్డు దృష్టిలో పడని వేలాది ఉద్యోగుల్లో తనుగూడా ఒకడైనప్పటికీ, అతడు ఆత్మ సంతృప్తితో జీవించే మానవుడు. అతనికి మిగిలిన సర్వీసు కేవలం రెండేండ్లు. ఆ తరువాత ఓ వందమైళ్ళ దూరంలో వుండే స్వగ్రామానికి వెళ్ళిపోతాడు. ఢిల్లీ నుంచి ఈ డాబుసరి ప్రయాణికుడు రాకముందు అతనిది చీకూచింతా లేని జీవితం. మొదటి తరగతి బోగీ నుండి హుందాగా కిందికి దిగిన ఈ ఆగంతకుని నీలికోటు ఆ చిన్న ఉద్యోగికి బెంబేలెత్తించింది.

తలపై బరువులు మోసే ముసలాడికి అతడు లండన్ నుండి దిగిన దొరలాగా కనిపించాడు. దాంతో చిల్లరకు కొదవుండదని చొంగ కార్చుకున్నాడు. రైలుబండి స్టేషన్ వదిలింది. అతని భారీ సూట్‌కేసును అందుకునేందుకు ముందుకు ఉరికాడు బరువులు మోసే ముసలిపోర్టరు.

"వెయిటింగ్ రూం" అన్నాడు ఆగంతకుడు. గతుక్కుమన్నాడు పోర్టరు.

ఆ దృశ్యం చూసి, ఆఫీసుగదిలో తన పని ముగించుకున్న స్టేషన్ మాస్టరు కంగారుగా పరిగెత్తుకొచ్చాడు.

"నువ్వేనా స్టేషన్ మాస్టరువి?" అడిగాడు కొత్తమనిషి.

"ఔనండీ. స్టేషన్ మాస్టరుని నేనే" అన్నాడు కాస్త రొమ్ము విరుచుకుంటూ.

'నాకింకా రెండేళ్ళ సర్వీసు మిగిలుంది. ఆ తరువాత గౌరవప్రదంగా పదవీ విరమణ చేసి, నా స్వగ్రామం చేరుకుంటాను; అక్కడ నాకు మా పూర్వీకులు వదలివెళ్ళిన ఇల్లొకటుంది. పొలం - నాలుగెకరాలే అనుకోండి- పొలం గూడా ఉంది' అనే

**కొత్తగాలి...**

**విజయం ఎప్పుడూ**
**వెన్నంటే ఉంటుంది**
**వెనుతిరగని వారినే**
**అది వరిస్తుంది**

– శ్రేష్ఠి శేషగిరి, సికింద్రాబాద్

సోదిని జోడించడం ఎందుచేతనో మానేశాడు.

"వెయిటింగ్ రూం ఎక్కడ?"

"అదిగో, ఆ కనిపించేదేనండి. మీరు కొంచెం ఆగితే, ఉండేందుకు వీలుగా తయారు చేయిస్తాను"

ఆగంతకుని భారీ సూట్‌కేసు మీద తన ఎత్తు కొన్ని అంగుళాలకు మించకపోయినా, దాన్ని స్వయంగా చేతికి తీసుకున్నాడు స్టేషన్ మాస్టారు. చప్టామీద రాపాడించుకుంటూ వరండాకేసి నడిచాడు.

"దాన్ని ఈడుస్తున్నావ్. నేనే తీసుకొ

స్తాను వదులు" వచ్చిన మనిషి దాన్ని అందుకోబోయాడు.

"ఫరవాలేదండి" అంటూ దానిమీద పట్టు సడలించకుండా స్టేషన్ మాస్టరు వరండా కిందికి చేరుకున్నాడు. ఇంతలో పోర్టర్ వెళ్ళి తాళంచేతులూ, చీపురుకట్టా, ఒక బకెట్, తుడిచేందుకు పాతగుడ్డా తీసు కొచ్చాడు. స్టేషన్ మాస్టరు తలుపు తీసి "ఇప్పుడే లోపలికి రాకండి" అన్నాడు కొత్త మనిషితో. పోర్టర్ సాయంతో కిటికీ రెక్కలు తెరిచి, దుమ్ము దులిపి, కసువు చిమ్మించి, గదిని ఓ మోస్తరు నివాస యోగ్యం చేశాడు.

"తివాచీ, ఒక బల్ల అవసరమని హెడ్ క్వార్టర్సును అడుగుతూనే వున్నాను" అన్నాడు.

రెండు రోజుల తరువాత, ఈ అతిథి దేవునికి ఆ గదిని వదిలివెళ్ళే ఉద్దేశం లేదని స్టేషన్ మాస్టరుకు బోధపడింది. ఉదయం లేచి డా. రాన్ బయటికి వెళి పోతే, చీకటిపడిన తరువాత గానీ తిరిగి రాడు. రెండు రాత్రులకు మించి ఎవరైనా సరే, వెయిటింగ్ రూంలో ఉండేందుకు నిబంధనలు అనుమతించవు. కానీ ఆ విషయం అతనితో చెప్పేందుకు స్టేషన్ మాస్టరు గుండెలు చాల్లేదు. ఉత్తరాలను మెయిల్‌సర్వీసులో ఇచ్చేందుకు నేను అక్క డికి వెళ్ళినప్పుడు స్టేషన్ మాస్టరు నాతో తన గోడును వెళ్లబోసుకున్నాడు.

"వెయిటింగ్ రూంకు సంబంధించిన నిబంధనల మేరకు, రైల్వే చట్టంలో ఏ మాత్రం లొసుగులేదు. ఈ మనిషేమో ఇక్కడ శాశ్వతంగా ఉండిపోయేలా ఉన్నాడు. పీకలమీదికి ఎప్పుడొస్తుందోనని భయపడి చస్తున్నాను. సర్వీసులో ఒక్క మచ్చ లేకుండా ముప్పై సంవత్సరాలుగా ఉద్యోగం చేసుకొస్తున్నాను. డి.టి.ఎస్. గారు తనిఖీకి దిగారంటే- అంతే, నా పని అయిపోతుంది" అంటూ వాపోయాడు.

"ఉండేవాడు.. ఎప్పటి నుండి ఉంటు న్నాడో అతనికెలా తెలుస్తుంది? "

"రిజిస్టరులో రాసుంటుంది గదా"

"రాయకుండా మానేస్తే సరి"

"ముప్పై సంవత్సరాలుగా నా సర్వీసుకు మచ్చలేదు"

"పక్క స్టేషనుకు టికెట్ కొనమని అత నికి చెబుతాను. రైలు కోసం కాచుకుని వున్నట్టుగా కనిపిస్తుంది. రెండు రూపా యలు తగలేసి కొప్పల్‌కు టికెట్ కొనడం పెద్ద ఖర్చు కిందికి రాదు" అంటూ సలహా ఇచ్చాను.

నా చిట్కా మూలంగా స్టేషన్ మాస్ట రుకు ఊరట దొరకలేదు. మచ్చలేని తన ముప్పై సంవత్సరాల సర్వీసుకు ఎదురవు తున్న ఆఖరి ఘడియలే అతని మనసును సంపూర్ణంగా ఆక్రమించాయి.

"అంతగా నువ్వు దిగాలుపడిపోయే అవ సరంలేదు. ఒకటి రెండు రోజులు దాటిస్తే, ఈలోగా అతనికి వేరే వసతి ఏదైనా ఏర్పాటు చేస్తాను. నీ డి.టి.ఎస్ వచ్చే అవ కాశం కనుచూపుమేరలో లేదని నాకు కచ్చి తంగా తెలుసు. ఒకవేళ వస్తే నా పేరు చెప్పు. అంతా సర్దుకుంటుంది"

ఫలానా పత్రికలో, ఫలానా సంపాదక త్వానికో ప్రతినిధిగా చెప్పుకునే అర్హత

**కొత్తగాలి...**

**లంబకోణంగా ఎగిరే**
**క్రీడలో వాడు**
**కుంభకోణంగా ఎదిగే**
**నీడలో వీడు**

– శైలూషి, సికింద్రాబాద్

## స్మితం

# తిట్లలోనూ ఛందస్సే!

బెజవాడలో అబ్బూరి రామకృష్ణారావు ఇంటికి బసవరాజు అప్పారావు వచ్చారు. ఆయన ఇంట్లో లేరు. వారి కుమారుడు చిన్నవాడు వరద రాజేశ్వరరావు ఉన్నాడు. ఆయన అతడిని పలుకరించి, పక్కన కూర్చోబెట్టుకొని 'నీకెవరి మీదన్నా కోపంవస్తే ఏంచేస్తావోయ్? ' అన్నారు.



'కాళ్ళు నరికేస్తాను! కళ్ళు పీకేస్తాను' అన్నాడు వరద.

'నీకన్నా వయసులో చిన్నవాళ్ళ మీద కోపంవస్తే? '

'చెవులు మెలేస్తాను. దవడ వాయిస్తాను'

వెంటనే వరదను రెండు చేతులతోనూ ఎత్తి బుగ్గలు నిమురుతూ 'నువ్వు కవిత్వం రాస్తావోయ్!' అన్నారు అప్పారావు. ఇంతలోకి రామకృష్ణారావు వచ్చారు. వరద అన్న మాటల్ని ఆయనకు వినిపించి 'మీ వాడికి ఇప్పట్నుంచే ఛందస్సు మీద అధికారం వచ్చిందయ్యా!' అన్నారు సంతోషంతో. అంటే వరద చెప్పిన సమాధానాల్లో సీస పద్యపాదాలు వంటివి దొర్లాయన్న మాట. అందుకే అలా సంతోషంతో పలికారు- బసవరాజువారు. ఆయన అన్నట్లుగానే పెద్దయిన తర్వాత వరద కవితా వ్యాసంగం చేశారు.

---

నాకు లేకపోయినా, విలేఖరిననే ఆత్మవిశ్వాసం నాలో మెండు. స్టేషన్ మాస్టరుకు నా వివరాలు అడిగేంత సాహసం లేనందున, నా పేరైనా తెలుసుకోకుండా, కేవలం నన్నొక విలేఖరిగానే స్వీకరిస్తున్నాడని గమనించాను. మారు మాట్లాడకుండా అతడు టెలిగ్రాఫ్ కాడను ఒత్తుకుంటూ కూర్చున్నాడు.

“ఏడు దక్షిణం కొద్ది నిమిషాల్లో వెలుపలి రెక్కమాను చేరుకుంటుంది”

అతడు సీటు నుండి లేచి, వెలుపలి సిగ్నల్ స్టాండ్ వంచేందుకు పోర్టరును పరిగెత్తించాడు. రైలుబండి స్టేషన్‌లో ప్రవేశించి ఆగింది. వారానికొకసారి జరిగే కొప్పల్ సంత నుండి తిరిగొచ్చే గ్రామస్తులు గంపలతో, మూటలతో, సంచులతో, సంతానంతో బోగీల నుండి కిందకి దిగారు. నేను గబగబా అంగలు వేసుకుంటూ మెయిల్ బోగీని అందుకుని ఆలస్య రుసుముతో నా తపాలా అందించాను.

“ఆలస్య రుసుముకు ఇలా నీ డబ్బంతా తగలేయడమెందుకు? హెడ్‌పోస్టాఫీసులో వెయ్యొచ్చు గదా” అన్నాడు తపాలా జవాను.

“నిజమే. కానీ తాజా వార్తల కోసం నేను చివరిదాకా కాచుకునుండాలి. ఏ క్షణంలో ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? ”

నా కవరు మీద ముద్రవేసి అతడు మిగతా తపాలాతో కలిపేసుకున్నాడు. కూతవేసుకుంటూ రైలు కదిలింది. విడుదల చేసేందుకు పోర్టరు ప్లాట్‌ఫాం చివరకు బయలుదేరాడు.

అది అదనుగా తీసుకుని జేబులో నుండి ఐదు రూపాయల నోటు బయటికి తీసి స్టేషన్‌మాస్టరు చేతిలో కుక్కుతూ 'పండగ ఇనాము' అన్నాను. పండుగ ఏదుందో

నాకు తెలీదు గానీ, హిందువుల క్యాలెం డర్లో పండుగ లేని రోజెక్కడుంది? 'మూడువందలా అరవైయైదు రోజులకుగాను మనకు మూడువందలా అరవయ్యారు పండుగలున్నాయి' అంటూ వ్యాఖ్యానించాడు ఓ వితండవాది. వర్తకులతో ఇనాములు పొందడం స్టేషన్ మాస్టరుకు కొత్తగాదు. రవాణా కావలసిన తమ సరుకులు స్టేషన్ ఆవరణలో మగ్గిపోకుండా వాళ్ళు ఇనాములు ఇస్తుంటారు. స్టేషన్ మాస్టరు తృప్తిగా నోటును జేబులో దాచుకున్నాడు.

వెయిటింగ్ రూంవైపు వేలితో చూపిస్తూ, చిన్న స్వరంతో అన్నాను. "ఆ మనిషి తక్కువోడు గాదు. టింబక్టూ నుండి వచ్చాడు"

స్టేషన్ మాస్టరు ముఖం విప్పారింది. "టింబక్టూ ఎక్కడుంది?" ఆసక్తిగా అడిగాడు.

అదెక్కడుందో నాకే తెలీదుగాబట్టి, "ఆఫ్రికాలో ఉందని తెలీదా?" అన్నాను నర్మగర్భంగా.

ఒకవైపు నల్లులతో, మరొకవైపు స్టేషన్ మాస్టరుతో వేగలేక రాన్ సతమతమవుతున్నాడు. ఏ రోజుకారోజు పంపవలసిన తపాలాను మెయిల్‌కు అందించేందుకు అక్కడికి వెళ్ళడమే నాకు ఇరకాటంగా తయారైంది. ఏడు దక్షిణానికి జెండా ఊపిన మరుక్షణం స్టేషన్ మాస్టరు దృష్టి నామీద పడుతుంది. ఈసడింపు కలిగించే మట్టిరంగు కాగితాల సంపుటంలో తాజా సమాచారాన్ని నమోదుచేసి, టెలిగ్రాఫ్ కాడను ఒకటి రెండుసార్లు ఆడించే అవసరాన్ని దాటవేయడం అతనికి కుదరక, పారిపోయేందుకు నాకింత అవకాశం దొరకడం అదృష్టమేగానీ, ఆ పనంతా ఐదు నిమిషాలకు మించకపోవడంతో కన్నుగప్పి పారిపోయేందుకు ప్రయత్నించే నన్ను అతడు తేలిగ్గా పసిగట్టి, చెయ్యి మరీ ఒడిసిపట్టి ఆఫీసు గదిలోకి లాక్కుపోయాడు. ఎందుకు లాక్కుపోతున్నాడో నాకు తెలుసు. వెయిటింగ్ రూం దురాక్రమణదారుని గురించి ఆందోళన పడటమే అతని సోది.

"నా ఇబ్బందిని మీరు అర్థం చేసుకోవాలి. ఆ మనిషిని ఏం చేస్తారో అది మీ ఇష్టం. అతడు దీన్ని ఇల్లుగా మార్చుకునేందుకు వీలుపడదు"

"నాతో చెప్పడమెందుకు?"

"మరి ఎవరితో చెప్పుకోమంటారు?"

"అతనికి నేను భరోసాదారుణ్ణి కాదు. నాకు చెప్పేది.. అతనితోనే నేరుగా ఎందుకు చెప్పలేవు?"

"అంతటి హోదా గల మనిషికి ఎలా చెప్పాలో నాకు పాలుపోవడం లేదు"

"అదే ఇక్కడొచ్చిన తంటా! అంతటి హోదా కలిగిన మనిషికి ఏమని చెప్పాలో నాకూ తెలీటం లేదు. ఆ విద్య నాకెవరూ నేర్పించలేదు"

"దగ్గరికి ఎలా వెళ్ళాలో గూడా నాకు తెలీటంలేదు. పొద్దున్నే బయటికి వెళ్ళిపోతాడా, వచ్చీరాగానే తలుపులు మూసుకుని లోపల గడియ పెట్టుకుంటాడు. ఒకసారి పోర్టరు తలుపు తడితే, అతని మీద కేకలేశాడు. బయటికి వచ్చినప్పుడంటారా, మాట్లాడేందుకు అవకాశమివ్వనంత వేగంగా వెళ్ళిపోతాడు" స్టేషన్‌మాస్టరు లబోదిబోమన్నాడు.

"విదేశాల్లో అది వాళ్ళ జీవిత విధానం. వాళ్ళ వేగమే వేగం. ముందస్తుగా అనుమతి తీసుకుంటే తప్ప, అంతరాయాన్ని సహించరు"

"అలాగా! అది నేనెరుగను" అన్నాడు అమాయకంగా.

మరోరోజు గడిచిపోయింది.

"ఆ పెద్దమనిషి ఈ రోజు పొద్దున్నే నా

మీద విరుచుకుపడ్డాడు. స్టేషన్ బాగోగుల మీద రైల్వేబోర్డుకు ఫిర్యాదు చేస్తానన్నాడు. చేస్తే చేసుకోనీ. నాకేం భయమా? నాది ముప్ఫై సంవత్సరాల మచ్చలేని సర్వీసు. ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు రిటైర్మెంట్ తీసుకోగలను. ఈ మనిషి నేను ఎవరిననుకుంటున్నాడు? ఇక్కడే అతణ్ని అట్టిపెట్టుకోటానికి నేనేమైనా అతనికి పిల్లనిచ్చిన మామనా? ”

“కానే కాదు” నిరభ్యంతరంగా ఏకీభవించాను.

“రైల్వేవాళ్ళు నల్లులనూ దోమలనూ సొంతంగా పోషిస్తున్నట్టు చీటికీ మాటికీ అతడు నా మీద చిందులేస్తాడూ! రైల్వేవాళ్ళంటే కొంతమందికి వింత వింత అభిప్రాయాలు ఉన్నట్టున్నాయి”

నేను టౌన్‌హాలుకు హాజరయ్యే సమయం తెలుసు గాబట్టి, రాన్ అక్కడ నన్ను పట్టేస్తాడు. లైబ్రరీ వెనక గదిలో, మురుగు కంపుగొట్టే పురాతన సంపుటాలను కిందికీ మీదికీ తిరగేసి, మా లైబ్రేరియన్ను ముగ్గులోకి లాగేసుకున్నాడు.

“మిత్రమా, రాత్రంతా ఆ నల్లులు నన్ను తాగేస్తున్నాయి. ఏదో వొక మార్గం చూడకపోతే నేను పడలేను. వెయిటింగ్ రూంలో దోమలూ నల్లులూ లేకుండా చూడటం తన బాధ్యత కాదని ఆ తమాషా మనిషి తప్పుకుంటున్నాడు”

“బహుశా, ప్రయాణికులు అందులో ఎక్కువ కాలం తిష్ఠవేయకుండా చేసేందుకు, అది మా రైల్వేబోర్డు అనుసరించే విధానం అయ్యుండొచ్చు”

“రైల్వేబోర్డుకు ఉత్తరం రాయనా? ”

“ప్రయోజనం ఉండదు. మా రైల్వేలు కష్టమర్లకు అందించే సేవల్లో నల్లులు గూడా ఒక భాగం. నిజానికి వాటిని ఉద్యోగం చేసే నల్లులుగా చెప్పుకోవాలి”

“అలాగా? అది నాకు తెలీలేదు” నా పరాచికం బోధపడక, నేను చెప్పింది నిజమేననుకుని అతడు విస్తుపోయాడు.

“అది సరే, మీరు అక్కడే ఎందుకు ఉంటున్నారు? ”

అది వేసుండవలసిన ప్రశ్నగాదు.

“మరెక్కడుండేది? ”

భారం నెత్తినపడే ప్రమాదం తప్పించుకుందామని, జాలిగా తల ఊపాను. ఐనా తప్పలేదు.

“మీరు వేరే ఏదైనా చూపిస్తే వెయిటింగ్‌రూం వదిలేస్తాను” అన్నాడు.

ఆ ప్రతిపాదనను పట్టించుకోలేదు గానీ, కుతూహలం చంపుకోలేక అడిగాను-

**కొత్తగాలి...**

**మహిళా రిజర్వేషన్ల కోటా అటుంచండి..**
**లాఠీ దెబ్బలలో మహిళలు సరిసమానమయ్యేరు!**

– చోటూ మండా

“మీరు ఇంకెంతకాలం ఇక్కడ ఉంటున్నారు? ” అని.

“నాకే తెలీదు. అనుకున్న పని పూర్తి కావాలి గదా. పరిసరాలను అధ్యయనం చెయ్యాలి. సేకరించిన సమాచారాన్ని సమీక్షించుకోవాలి. దాన్ని ఒక పద్ధతిలో పేర్చుకోవాలి. టౌన్‌హాలు లైబ్రరీ స్టాక్‌రూంలో కొన్ని అపురూపమైన పుస్తకాలు దొరికాయి. పందొమ్మిదవ శతాబ్దం ప్రారంభంలో రైతుల అనుభవాలూ, వాళ్ళకు ఎదురైన సమస్యలూ వాటిల్లో ఉన్నాయి. అది నా అధ్యయనానికి అమూల్యమైన ముడిసరుకు”

ఆ తరువాత రైల్వేస్టేషన్‌కు వెళ్ళగానే

స్టేషన్‌మాస్టరు తగులుకున్నాడు "నాతో ఇక కాదంటే కాదు. ఇది మూడోవారం. మీ స్నేహితుడు ఖాళీ చెయ్యక తప్పదంటే తప్పదు. వెయిటింగ్ రూము అతగాడి అత్తగారిల్లు కాదు"

"ఎందుకుగాదు? "

"ఇప్పటికి వందసార్లు చెప్పున్నాను. రైలుకూ రైలుకూ మధ్య ఎనిమిది గంటలకు మించి రూల్సు ఒప్పుకోవు. స్టేషన్ మాస్టరు సరేనంటే మరో రెండు గంటలు అదనంగా ఉండొచ్చు అంతే. ఇలాగైతే నా ఉద్యోగం ఊడిపోవడం ఖాయం"

"అతన్ని నాతో ముడివేయడమెందుకు? బయటికి గెంటేసెయ్"

"ఆ మాట అనొద్దండి. అంత హోదాగల మనిషిని దురుసుగా పంపించేందుకు నేను ఎంతవాణ్ణి? "

"రూల్స్ రూల్సే. పెద్దోడా చిన్నోడా అనేది వాటికి అనవసరం"

"అంత విలువైన దుస్తులు వేసే మనిషిని ఇదివరకు నేను చూసుండలేదు. వెళ్ళి చెప్పమని పోర్టరును పురమాయించాను. అతడు గదిలోకి తొంగిచూడగానే ఆ మనిషి బయటికొచ్చి, ఏం కావాలన్నాడు. వీడికి దిక్కుతోచక పరిగెత్తుకొచ్చాడు. ఏదో వొకలా, నామీద దయవుంచి, అతన్ని బయటికి పంపే సాయం చెయ్యండి"

"ప్రతిరోజూ పక్క స్టేషన్‌కు ఒక టికెట్ కొట్టి వారమో పదిరోజులో ఉంచుకో. ఆలోగా అతనికి వేరే గది చూపించడమో, వాపసు తిప్పిపంపడమో నా పూచీ" అన్నాను ఆలోచించుకుంటూ.

స్టేషన్‌మాస్టరుకు నమ్మకం కుదరలేదు. "ముప్పై సంవత్సరాల మచ్చలేని సర్వీసు" అంటూ నసిగాడు.

ఇరవై రూపాయలు ముందుకు చాపి, "ప్రతి ఉదయం కుంబానికి టికెట్ కొట్టు. ఏడు ఉత్తరంలోనో మరొకదాంట్లోనో వచ్చాడని చెప్పు. పదిహేడు దక్షిణంలోనో, మరోదాంట్లోనో వెళ్ళిపోతాడని సర్దేసెయ్" అన్నాను.

ఫలితం వెంటనే కనిపించింది. అతడు రాన్ కోసం టికెట్టు కొట్టాడా లేదా అనేది నాకు అనవసరం. రాన్‌కు మరో పదిరోజులు గడువు పొడిగించడం నా ఉద్దేశం.

అప్పటినుండి రాన్‌కోసం గదిని వెదకడం మొదలెట్టాను. అది అసాధ్యమైన ప్రయత్నంగా తేలిపోయింది. తనకు ఎలాటి గది కావాలో అతడు చెప్పడు. అతన్ని వెంటేసుకుని టౌను మొత్తం- తూర్పూ, పడమరా, ఉత్తరం, దక్షిణం- వదిలేయకుండా గాలించాను. సాంబుడి స్కూటర్ తీసుకుంటే వెనకసీటులో కూర్చుంటాడనే నమ్మకం లేక, ఒక ఆటోరిక్షాను కుదిరించుకున్నాను. ఆటోరిక్షాల కోసం జనం ఎగబడుతుండడంతో, దాని కోసం ముందస్తు రిజర్వేషన్ అవసరమైంది. ఆరోజు ఉదయం, ఇతర కార్యక్రమాలన్నీ పక్కకు నెట్టి, 'నల్లీస్ హార్డ్‌వేర్' దుకాణానికి బయలుదేరాను. దాని యజమాని గోపీచంద్ కత్తిలాటి వ్యాపారస్తుడు. దేశవిభజన రోజుల్లో సింధ్ ప్రాంతం నుండి వలసొచ్చాడు.

"స్టాండులో దొరికితే తీసుకెళ్ళండి. రాత్రి బాగా పొద్దుబోయిన తరువాత డబ్బు కట్టేందుకు వచ్చినప్పుడే అవి నాకు కనిపించేది. అంతవరకు ఎక్కడుంటాయో నాకే తెలీదు" అన్నాడు.

"స్టాండులో కనిపిస్తే నీదాకా రావాలా? " అన్నాను చిరాకుగా. నా గొంతులో కోపం గూడా పలికినట్టుంది. నాకు చేతనైన రీతిలో అతనికి సహాయం చేసినవాణ్ణి నేను. ఆటోరిక్షా వ్యాపారం ప్రారంభించినప్పుడు కరపత్రాలు రాయించాను. 'హార్డ్‌వేర్'కు పాగీలను సమకూర్చాను. అమాంబాపతు పథకాలకు చందాదారులను చేర్పిం

చాను. నా సాయం గుర్తుచేసుకుని అతడు సావధానంలోకి ప్రవేశించాడు.

"మీరు కావాలంటే నేను కాదంటానా? మీరు నా మేలుగోరే మనుషులు" అంటూ, వెంటనే కుర్రాణ్ణి కేకేసి, "ఎక్కడున్నా సరే, మునిస్వామిని బండి తీసుకుని ఇక్కడికి రమ్మని చెప్పు" అంటూ ఉత్తర్వులు జారీ చేశాడు.

హార్డ్‌వేర్ అమ్మకాలకు అది గిరాకీలేని రుతువు. అతడు నాకొక అల్యూమినియం స్టూలును వేయించి, రాజకీయాలు తర్కించాడు. అతనికి అలుపొచ్చేదాకా నేను- బజారువెంట ఏదో కొంపలు మునిగినట్టు ఇటూ అటూ ఉరకలేస్తున్న జనాన్ని పర్యవేక్షిస్తూ కూర్చున్నాను. బాగా అలిసిపోయాక, అతడు వార్తాపత్రికలో ముఖం దాచుకుంటూ, మేకులూ ఇనప కమ్మీలూ గొలుసులూ కీలుబందుల సుడిగుండం నడుమన ఉన్న తన సీటులో చేరగిలాడు.

పంపిన దూత తిరిగొచ్చాడు. "మునిస్వామి కనిపించలేదు. అతడు ఎక్కడికో వెళ్ళినట్టున్నాడు" అంటూ ప్రకటించాడు.

"రేపు ఎట్టి పరిస్థితిలోనైనా బండి మీ ఇంటిముందు ఉంటుంది. ఈ రోజు ఒట్టి చేతులతో పంపుతున్నానని మరోలా అనుకోకండి" అన్నాడు గోపీచంద్ వినయంగా. నష్టపరిహారంగా అతడు కుర్రాణ్ణి పక్క కొట్టుకు తరిమి నా కోసం ఏదో పానీయం తెప్పించాడు. మురికి వదలని గ్లాసులో ఆ వచ్చినదాన్ని ముట్టేందుకు సంకోచించినా, అతని తృప్తికోసం తాగినట్టు నటించాను.

మాట ప్రకారం మరుసటిరోజు పొద్దున్నే నా గుమ్మంముందు ఆటోరిక్షా నిలబడింది.

"అహా! నువ్వు ఆటోరిక్షాను గూడా వాడుతున్నావన్నమాట!" అన్నాడు నా పొరుగింటి రాముడు. అడుగుతీసి అడుగేసేందుకు అయాసపడేంత లావెక్కి, అరుగును అరగతీస్తూ స్తంభానికి జారగిలబడి, వీధిలో వచ్చిపోయే జనాన్ని తనిఖీ చెయ్యడం తప్ప, అతనికి వేరే పనిలేదు. పేకాటంటే పడిచస్తాడు గానీ, చేతులు కలిపే ఆటగాళ్ళు తన చుట్టూ మూగితే తప్ప, ఆట కోసం మరోచోటికి కదలలేడు. అతడు మనిషిగా కాకుండా, చెట్టుగానో పుట్టగానో నాకు కనిపిస్తాడు.

"ఆటోరిక్షా ప్రయాణం శరీరానికి వేడి చేస్తుంది. అదీగాక, కీలుకు కీలు ఊడొస్తుంది" అన్నాడు రాముడు.

ఆ వ్యాఖ్యానం ఆటోడ్రైవర్ కరిని చీకాకు పడేలా చేసింది.

"ఓర్పులేని మనుషులు ఏవేవో పుకార్లు పుట్టిస్తుంటారు. దీని బాడీని తయారుజే

## దేవులపల్లి చతురోక్తులు



భావకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి కవితలు, సినీగీతాలతో తెలుగు భారతిని సుసంపన్నం చేశారు. ఆయన చమత్కారాలు విసరడంలోనూ దిట్ట. మచ్చుకు ఆయన చతురోక్తులు కొన్ని..

### కవిత కాదు నాటిక

డి.వి. నరసరాజుగారు నాటక రచయిత. ఆయన నాటకాలన్నీ చమత్కారాలు, వ్యంగ్యంతో నిండి ప్రేక్షకుల్ని కవ్వించాయి. నరసరాజు రాసిన ఒకే ఒకపాట 'మావూరి గంగ'(1975) చిత్రంలో ఉంది. దాని ట్యూనింగ్ సమయంలో దేవులపల్లివారు మరో పాట రాయడానికి ఆ సమయంలో అక్కడికి విచ్చేసివున్నారు. నరసరాజుగారి కుమార్తె కూడా అప్పుడు అక్కడే ఉంది. కృష్ణశాస్త్రివారికి ఆమెను పరిచయం చేస్తూ, 'మా అమ్మాయి కవిత' అన్నారు నరసరాజుగారు. దానికి కృష్ణశాస్త్రిగారు, 'అదెలా సంభవం? నేనొప్పుకోను. న్యాయంగానైతే ఆ పిల్ల పేరు 'నాటిక' అని ఉండాలి' అన్నారు నవ్వుతూ.

సింది మద్రాసు సింప్సన్ కంపెనీవాళ్ళు. మన కీళ్ళకు ఏదిమంచిదో, ఏది చెడ్డదో వాళ్లకు బాగా తెలుసు" అంటూ ఎదిరించాడు.

దాంతో ఆగకుండా అతడు మరింత వివరంగా బోధపరిచే ఉత్సాహంతో రామున్ని సమీపించాడు. ఇది పెరిగి పెద్దది కావడం ఇష్టంలేక అతన్ని వెనక్కు పిలిచి, సీటు మీద కూర్చోమన్నాను. ఇంటికి తాళంవేసి, ఆటోరిక్షాలో కూలబడి, "రైల్వేస్టేషన్" అంటూ ఆజ్ఞాపించాను.

ఇంజను స్టార్ట్‌చేసి, చెవులు దిమ్మెక్కే దాని రొదలో, "ఆ పిప్పళ్ళబస్తా ఏమన్నాడో విన్నారా? " అంటూ మొదలెట్టాడు.

అతడు చొచ్చుకుపోయే అవకాశాన్ని అడ్డుకుంటూ, "వాటిని పట్టించుకునే అవసరం లేదు. మా వీధిలో అలాటి పాతకాలపు ఛాందసులకు కొదువలేదు" అన్నాను.

"కొత్త కాలనీలో మనుషులు మెరుగు. వాళ్లకు నాగరికత తెలుసు"

"ఔను"

నేను ఏకీభవించడం అతన్ని తృప్తిపరిచింది. స్టేషన్‌వరకు ప్రయాణం ప్రశాంతంగా సాగిపోయింది. స్టేషన్ వెలుపల నిరాఘాటంగా విస్తరించిన చెట్టు నీడలో ఆటోరిక్షాను వదిలేసి, రాన్ కోసం స్టేషన్‌లో ప్రవేశించాను. వెయిటింగ్ రూం కుర్చీలో కూర్చుని అతడు కునికిపాట్లు పడుతూ కనిపించాడు.

"రాత్రంతా రెప్ప వాల్చలేదంటే నమ్మండి. ఏమి దోమలూ, ఏమి నల్లులు! ఇదిగాక, వచ్చిపోయే గూడ్సు బండ్ల రొద ఒకటి" అన్నాడు రాన్.

త్వరగా తెమలండి. టౌనులో తిరగాలి. బయట మీ కోసం కాచుకునుంటాను"

ఆ కాచుకునున్న సమయంలో స్టేషన్ మాస్టరు పిల్లిలా పక్కనచేరి, "డి.టి.ఎస్. వస్తున్నాడు" అంటూ గొణిగాడు.

"ఇది పాతపాటే"

"ఆయన తాగుతాడా? " నా చెవిలో గుసగుసగా అడిగాడు.

"నాకెలా తెలుస్తుంది? "

"రాత్రి ఆయన రెచ్చిపోయాడు. చిన్న పొరపాటుకు పోర్టర్‌ను తంతానని బెదిరించాడు"

"పోయేదేముంది? " అన్నాను పరధ్యానంగా.

అంతలో రాన్ బయటికి వచ్చాడు. అడవిలో వేటాడటానికో, కాకపోతే కమెండో ఆపరేషన్‌కో మేము బయలుదేరుతున్నట్టు, ముదురాకు పచ్చచొక్కాను బొడ్డుకింద ప్యాంటులోకి దోపుకుని, ఎండకు వాడే జానెడంచు టోపీని నెత్తిమీద పెట్టుకుని దర్శనమిచ్చాడు.

వాహనాల బీభత్సం మధ్యలో, కిటకిటలాడే పాదచారులను చీల్చుకుంటూ, మార్కెట్ వీధిలో ఆటో వెళుతున్నప్పుడు అతడు విప్పారిన కళ్లతో మనుషులను అడవిమృగాలకు మల్లే చూస్తూ- "ఇలాటి వాహనంలో నేను ఏనాడూ కూర్చోలేదు. కీళ్లు సడలిపోతున్నాయి" అన్నాడు.

"డ్రైవరు కరి చెవిలో ఈ మాటలు పడకుండుగాక" అంటూ దేవునికి మొక్కుకున్నాను.

## కొత్తగాలి...

**తలుపులు తినే బావగారికి**
**అప్పడాలు ఆరగింపా!**
**నగరాలు మింగే మంత్రిగారికి**
**గ్రామాలు పంటి కింద**
**ఆనుతాయా?**

– ఎ. సూర్యప్రకాశ్, నిజామాబాద్

## జట్కావాడి పద్యం!

స్మితం



అబ్బూరి రామకృష్ణారావు మద్రాసులో 'నటాలి' పేరుతో నాటక సంస్థను నడిపే వారు. కన్యాశుల్కం నాటకంలో మధురవాణి పాత్ర ధారిణి కోసం ఆయన అన్వేషిస్తూ- కుమారుడైన వరద రాజేశ్వర రావును రాజమండ్రికి వెళ్ళమన్నారు. బలిజేపల్లి లక్ష్మీకాంత కవితో వెళ్లి ఆ పని పూర్తి చేయమన్నారు. ముందుగా అనుకున్న ప్రకారం బలిజేపల్లివారు, వరద రాజేశ్వరరావు రాజమండ్రి స్టేషన్‌లో కలుసుకున్నారు. అక్కడి నుంచి ఆ నటి ఇంటికి జట్కాలోనే వెళ్ళారు. ఆ జట్కాకు రెండు వైపులా హరిశ్చంద్ర నాటకం పోస్టర్లు ఉన్నాయి. జట్కావాడు చెర్నాకోలాను గాలిలోకి విసురుతున్నాడు. హుషారుగా బండివాడు హరిశ్చంద్ర నాటకంలోని 'తిరమై సంపదలెల్ల వెంటనొకరీతిన్ సాగిరావేరికి...' అన్న పద్యాన్ని అందుకొన్నాడు. లక్ష్మీకాంత కవి సంభ్రమాశ్చర్యాలతో వింటున్నారు. ఆ జట్కావాడికి ఆ నాటక రచయిత తన బండిలోనే ఉన్నారని తెలియదు. అతడు వెనక్కి తిరిగి చూసి 'చూశారా! నిన్న రాత్రి వాడితస్సాదియ్యా- ఏం చదివాడండి సుబ్బారావ్. హాలంతా కళ్ళనీళ్ళేనండీ.. వాడి దుంపతెగా' అంటున్నాడు. లక్ష్మీకాంత కవిగారి కళ్ళు ఆనందాశ్రువులతో చెమ్మగిల్లాయి. ఆయన వరద రాజేశ్వర రావుగారితో 'పద్యంలో రహస్యం అదే- ప్రేక్షకుల్లో కొందరు ఏడుపు ఆపుకోలేకపోయేవారు. వీలైనంత వరకు అందరికీ అర్థమయ్యేలా రాశాను. జట్కావాడు కూడా పద్యం చదివి అర్థం చేసుకున్నాడంటే మనం ధన్యులమైనట్లే. ప్రజల కవిత్వమంటారు అదేం కవిత్వమోయి? ' అన్నారు నవ్వుతూ.

---

"మనం ఎక్కడికి వెళుతున్నాం? " అతడు ఒకటికి పదిసార్లు నన్ను ప్రశ్నించాడు. అతని ప్రశ్న చిరాకు కలిగించడంతో, వినీవినకుండా ఊరుకున్నాను.

తొలి మెట్టుగా అబూ వీధిలో ఒక పాత భవనం ముందు మా ఆటో ఆగినప్పుడు, "ఇది మారుమూల ప్రాంతంలా ఉంది. నాకు సరిపడదు" అన్నాడు రాన్.

"నీ ఉద్దేశంలో మారుమూల ప్రాంతమంటే ఏమిటో నాకు తెలీదు. ఐనా నిన్ను ఇక్కడ ఉండమనడం లేదు. ఆటోలోనే ఉండు, నేను ఇప్పుడే తిరిగొస్తా"

ఆటోకు ఇరువైపులా రంగుల్లో గీయించుకున్న లంఘించే పులి బొమ్మనూ, అందులో కూర్చున్న వింతమనిషినీ పరిశీలిస్తూ, వయోభేదం లేకుండా గుమిగూడిన పాతబస్తీ చిరుగుంపును దాటుకుంటూ, వరండాలోని మెట్లమీదుగా మొదటి అంతస్తులోని చిన్న ఆఫీసుగదికి చేరుకున్నాను. అది అప్పుడప్పుడే పైకొస్తున్న ఒక రియల్ ఎస్టేటు ఏజెంటుది. అతన్నుండి టౌనులో ఖాళీవున్న నివాసాల జాబితాను చేతికి తీసుకుని తిరిగొచ్చి, "మొదట ఉత్తరం కొసకు పద" అన్నాను ఆటో డ్రైవరుతో.

"ఉత్తరం కొసంటే ఎక్కడికని? " ఎదురు ప్రశ్న వేశాడు డ్రైవరు.

"నల్లప్ప తోటకు పైన, ఏటికి అవతల"

"అక్కడా? అక్కడ ఇళ్లే లేవు"

"ఉత్తరం బస్తీ చివర ఇరవయ్యో నెంబరు, పద" అధికారికంగా శాసించాను.

"అక్కడుండేది శ్మశానం. ఇళ్ళే లేవు"

చేతిలో వున్న జాబితాను అతని ముఖం

మీదికి చాపుతూ, "ఈ పట్టీ ఇచ్చిన మని షికి ఈ టౌను నీకంటే బాగా తెలుసు" అన్నాను.

శ్మశానం అనే మాట విని కంగారు పడిన రాన్, "మరోచోట ప్రయత్నిస్తే" అన్నాడు.

"అంతగా జడుసుకోవద్దు. ఇదిగో కరీ, అనవసరంగా మాట్లాడకు. పద"

మమ్మల్ని గమనిస్తున్న మనుషుల్లో ఒక తడు "శ్మశానాన్ని ఇప్పుడు ఇంకా అవతలికి మార్చేశారు" అన్నాడు స్వచ్ఛందంగా.

"ఐనా శవాలు ఆ దారినే వెళతాయి. వేరే దారిలేదు. మొన్నటిరోజు గూడా.." కరి అందుకున్నాడు.

"నోర్మూయ్" గద్దించాను.

"ఏటికి అవతల నేను ఉండలేను" అన్నాడు రాన్.

"నీకూ మూఢనమ్మకాలేనా? "

నిలబడి వున్న ఆటో వెనకసీట్లో కూర్చో నుంటే సమయం దండగ కావడమే గాదు, ఊపిరి తిప్పుకోలేనంత ఉక్క. ఒకవైపు చుట్టూ మూగిన జనం మావైపు నోళ్ళు వెళ్లబెట్టి చూస్తుంటే, ఏవైపు చూసినా కని పించే శవాలమధ్య తను అధ్యయనం సాగించిన అనుభవాలను వెల్లడిస్తూ రాన్, "అటువంటి పరిస్థితుల్లో అలవాటు పడక తప్పదుమరి" అంటూ ముగించాడు.

"డ్రైవర్, ఉత్తరం బస్తీకి నడపమ న్నానా? నువ్వు కదిలేదేమైనా ఉందా? కాలం వృథా చేసుకుంటూ ఇలా వీధిలో ప్రదర్శనలు ఇచ్చేందుకు కాదు మేము పెందలాడే బయలుదేరింది" దబాయిం చాను.

కరి నెమ్మదిగా డ్రైవరు సీటు నుండి కిందికిదిగి నిలుచున్నాడు. ఇదివరకు ఇలాటి తిరస్కారానికి అలవాటుపడని మేమిద్దరం అవాక్కై నడి వీధిలో నిలిచిపో యాము.

"ఇది గాకపోతే మరొకటి. రా వెళ్దాం" అన్నాను రాన్‌తో.

"ఎక్కడికి? " అడిగాడు రాన్.

"నా వెనకాల నడు. చిన్న పిల్లాడికిమల్లే ప్రశ్నలేస్తూ నిలుచోవద్దు" అన్నాను కటు వుగా.

నోరెత్తకుండా అతడు పిల్లిలా అనుసరిం చాడు. చిన్న గుంపుగా స్థానికులు మా వెంట ఊరేగింపులో లాగా వెంబడించారు. తదుపరి ఏం చెయ్యాలో నాకే స్పష్టంగా తెలీదు. మార్కెట్ దగ్గరికి వెళ్లి ఆ డ్రైవరు మీద గోపీచంద్‌కు ఫిర్యాదు చెయ్యడం, మరో వాహనం ఏర్పాటు చెయ్యమని జయరాజు సహాయం అర్థించడం కర్తవ్య మని చూచాయగా తోచింది. జట్కా దొర కొచ్చు గానీ, అందులోకి జొరబడి కాళ్లు ముడుచుకుని రాన్ కూర్చోగలడనే నమ్మకం కుదరలేదు. ఎటూ పాలుపోక జేవురించిన నా ముఖంలోని గంభీరతను గమనించి, పలకరించేందుకు ఎవరూ సాహసించలేదు. ఊరేగింపు వెనకాల అనుసరించి వస్తున్న మా ఆటో, దారి చేసుకునేందుకు హారన్ మోగిస్తూ గుంపును దాటుకుని నా పక్కకు చేరింది.

"ఛార్జీలు ఎవరిస్తారు? " అడిగాడు డ్రైవరు.

"నీకు ఉద్యోగమిచ్చిన గోపీచంద్. నీబోటి డ్రైవరుతో అతడు ఈ టౌనుకు ఎంత లావు సేవచేస్తున్నాడో తెలిపేందుకే నేను కాలినడకన అతని దగ్గరికి వెళుతు న్నాను. కాలినడక ఏనాడూ ఎరుగని ఈ పెద్ద మనిషిని గూడా ఆ పనిమీదే వెంట తీసుకుపోతున్నాను"

వెంట నడుస్తున్న గుంపు నుండి వంత పాడుతూ కేకలు వినిపించాయి. ఒకతడు ముందుకొచ్చి, "పరాయి దేశం నుండి వచ్చిన పెద్దమనిషిని ఇలా ఇబ్బంది పెడు తున్నావంటే... మిమ్మల్ని ఏంజేసినా

పాపం లేదు" అంటూ అరిచాడు.

డ్రైవరుకు అది సూటిగా తగిలినట్టుంది. మెత్తబడి దారికొచ్చాడు.

"అయ్యో, ఒక్క మాటగూడా నేను అన లేదు. వాళ్లకు వాళ్లే దిగిపోయారు"

గుంపు నుండి ఎవరో అన్నారు- "జరిగిం దేదో జరిగిపోయింది. అతన్ని మన్నించి బండ్లో కూర్చోండి"

ఆ అవకాశాన్ని అసరాగా తీసుకుని, అతని సలహాను పాటిస్తున్నట్టు రాన్‌ను బండ్లోకి తోసి, నేనుగూడా ఎక్కి, "ఉత్తరం బస్తీకి" అన్నాను దర్పం ఉట్టిపడేలా.

అర్ధగంట తరువాత నల్లప్పతోటను దాటుకుని, పాడుబడిన కాజ్‌వే మీదుగా ఉత్తరం కొస చేరుకున్నాము. కాజ్‌వేని దాటేప్పుడు చక్రాలు ఎగజిమ్మే నీటి తుంపర్లు ముదురాకుపచ్చ దుస్తులమీద చిందుతూ ఖరాబు చెయ్యడం నాకు తృప్తిని కలిగించింది. రాన్ ముఖం చిట్లించాడే గానీ, నోరెత్తకుండ కూర్చుకున్నాడు.

ఉత్తరకొసలో మాకు దర్శనమిచ్చింది కొన్ని తాటాకు గుడిసెలూ, వాటి వెనక అనాథగా వదిలేసిన ఒక ఫ్యాక్టరీ బిల్డింగు. ఆ బిల్డింగు తలుపులూ, కిటికీలూ దొంగల పాలు కాగా, గోడలు బీటలు వారాయి. దానికి మరింత ఆవలగా, రేకులు కప్పిన నాలుగు కాటేజీలు, బహుశా ఉద్యోగుల కోసం కట్టినవే గావచ్చు, వేరువేరు దశల శిథిలావస్థలో ఉన్నాయి. దారంతా చెట్లతో, పుట్టలతో పూడుకుపోయింది.

రియల్ ఎస్టేట్ ఏజెంటు జాబితాలో ఇది ప్రప్రథమంగా ఉండటం నాకు దిగ్భ్రాంతి కలిగించింది. ఎవరో అందించిన సమాచారాన్ని గుడ్డిగా నమ్మి ఈ ఏజెంటు కుర్రాడు దీన్ని జాబితాలో చేర్చుండాలి. కనుచూపుమేర ప్రాణంతో ఉన్నదేదీ గోచరించలేదు. నీరసంగా ఇకిలించాడు రాన్.

"ఎప్పుడో వొకసారి ఇలాటివి ఎవరికైనా జరుగుతుంటాయి. కరీ, బండిని మళ్లించు. మన జాబితాలో రెండోది..." అంటూ నసిగాను.

ఇంతదూరం గతుకుల్లో బండిని తోలుకొచ్చిన ప్రయాసతో డ్రైవరు చితికిపోయాడు. నా చెవులు దిమ్మెక్కి, కీళ్లు వదులయ్యాయి. టింబక్టో మనిషి కుదేలైపోయాడు. అతని ముదురాకుపచ్చ సఫారీ ముడతలు ముడుతలుగా నలిగి, బండెక్కే ముందున్న బిగువును కోల్పోయింది. చంకల్లో, మూపుల్లో తడి తేలింది. బనియన్ బయటికి కనిపించేలా అతడు చొక్కా గుండీలు అసాంతం విప్పేసి కూర్చున్నాడు. మా సాహసయాత్ర మరికొద్దిసేపు కొనసాగితే అతడు ఒంటిమీది బట్టలన్నీ విప్పేస్తాడని నాకు భయమేసింది.

తిండీతిప్పలు లేకుండా పొద్దున్నే పరగడుపున మొదలెట్టే మా అన్వేషణకు ఇది రెండవరోజు. మా ఆశ నెరవేరుతుందనే నమ్మకం నాలో మిగల్లేదు.

చివరి ప్రయత్నంగా కొత్తకాలనీ 102సి బంగ్లా దగ్గర ఆటో ఆగింది. ఇల్లు కొత్తది. నచ్చుతుందనే ఆశలు రేకెత్తించింది.

గేటు చువ్వల సందుల్లో నుండి తొంగి చూసి, "దీని ఆవరణలో మొక్కలను పోషించడమే తలనొప్పి వ్యవహారం. ఇంత పెద్ద ఇంటిని నేనేం చేసుకోను? " అన్నాడు రాన్.

లోపలికి వెళ్లి చూసేవరకైనా ఆగకుండా తల అడ్డంగా ఊపాడు. ఆ ఇంటి బాధ్యత తీసుకున్న మనిషొకడు పరిగెత్తుకుంటూ సమీపించి, గేటు తెరిచి, "తాళం చేతులు నా వద్దే ఉన్నాయి" అన్నాడు.

"ఇంత పెద్దిల్లు అవసరం లేదు" అన్నాడు రాన్ చలించకుండా.

"పెద్దదీ వద్దు, చిన్నదీ వద్దు. ఉత్తరమూ వద్దు, దక్షిణమూ వద్దు. తూర్పు

## ప్రతిభకు కితాబు అవసరమా?

స్మితం

ఒక పర్యాయం ఒక వర్ధమాన కవి - కవిసమ్రాట్ విశ్వనాథవారి దగ్గరకు వెళ్ళి, తమ కవితా సంపుటిని ఇస్తూ అభిప్రాయాన్ని కోరారు.



ఆయన ఆ పుస్తకాన్ని అటూ ఇటూ తిప్పి చూసి, వెంటనే సహజ ధోరణిలో 'ఈయనకు నిజముగా ప్రతిభయే ఉన్నచో ఎవరి అభిప్రాయముతోడనూ అవసరములేదు. ప్రతిభ లేకున్నచో నావంటివారు ఎంత గొప్పగా అభిప్రాయమిచ్చిననూ ప్రయోజనం లేదు' అని రాసి ఇచ్చారట. ఆ కవికే కాదు- అందరికీ కనువిప్పు కలిగేలా నిర్మొహమాటంగా అభిప్రాయాన్ని చెప్పారు విశ్వనాథవారు. అదీ కవిసమ్రాట్ ముద్ర. ఈ అభిప్రాయం ఆ పుస్తకంలో ముద్రితమైంది కూడా. తమ గురువుగారి స్వభావానికి సంబంధించిన ఈ విషయాన్ని తరచుగా కుందుర్తి ఆంజనేయులు చెబుతుండేవారు.

వద్దు, పడమరా వద్దు. పట్నం లోపలా వద్దు, పట్నం వెలుపలా వద్దు" అన్నాను గేయంలా ఆలపిస్తూ.

దాని దరువు నన్నే ఆశ్చర్యంలో ముంచింది. అతనికి కనిపించకుండా విసుగును దాచుకునేందుకు నేను చేస్తున్న ప్రయత్నం చేదు నమిలినట్టుగా ఉంది.

బండెక్కి కూర్చున్నాం. తిరుగు ప్రయాణంలో ఒక మజిలీ కనిపించి ఆగిపోయాం.

"దిగు మరి. మన విఫల ప్రయత్నాన్ని ఐస్‌క్రీంతో, కాఫీతో సంబరం చేసుకోవాలని నా సరదా. మామూలుగా బోర్డులేని హోటలే నాకు ఇష్టమైంది. అది ఇక్కడికి మైళ్ల దూరంలో ఉంది. అంత దూరంవరకూ ఆగేంత ఓపిక లేదు" అన్నాను.

రాన్ ముఖం విప్పారింది. ఇద్దరం సేద తీర్చుకున్నాం. అద్దె ఇంటి అన్వేషణలో ఎదురైన ఆటుపోట్లను భరించి, హోటల్ వెలుపల ఓపిగ్గా కాచుకుని కూర్చున్న డ్రైవరు కరికి ఇంత ఫలహారం, కాఫీ తీసుకెళ్లేలా ఆదేశించాను. బిల్లు మా ముందుకు రాగానే సఫారీ జేబులో చెయ్యిదోపి వేళ్లతో తడుములాడాడు రాన్. అతన్ని హుందాగా వారిస్తూ, అది బోర్డు లేని హోటల్లోకంటే నాలుగింతలు ఎక్కువని తెలిసిగూడా, నేనే బిల్లును చెల్లించాను. ఖరీదు ఎంతైనా సరే, అతిథులను సహృదయంతో ఆదరించే కబీర్ వీధి సంప్రదాయం నేను సడలించలేదు.

స్టేషన్‌కు చేరుకున్న తరువాత, రాన్‌ను గదిలో దూరనిచ్చి స్టేషన్ మాస్టరు నన్ను పట్టుకున్నాడు.

"రేపు పదిహేడు గంటలకు డి.టి.ఎస్. ఇక్కడ దిగబోతున్నాడు. ఉన్నఫళంగా మీ స్నేహితుడు ఖాళీ చెయ్యకుంటే కుదరదు. నేను అవస్థ పడాలి" అన్నాడు.

నాకు వేరేదారి కనిపించలేదు. రాన్ వెలుపలికి రాగానే, "నీ సామగ్రి ఏమేముంది? " అంటూ అడిగాను.

"పెద్దగా లేదు. ఎందుకని? " అడిగాడు.

"వెంటనే వాటిని సర్దు. తటపటాయించేంత తీరుబడి లేదు. ఏ క్షణంలోనైనా డి.టి.ఎస్. ఇక్కడ దిగిపోవచ్చు. అప్పుడు నీ మకాం చెట్టుకిందికి మారుతుంది. సామాను సర్దుకుని సిద్ధంగా ఉండు. అర్ధగంటలో నేను తిరిగొస్తాను. అంతకు మించి, నీకు వ్యవధి లేదు"

"ఇది దారుణం. ఏడీ ఆ స్టేషన్‌మాస్టరు? ఇంతకూ నన్ను ఎక్కడికి తరలించా

లని నీ ఆలోచన? "

"పెట్టేబేడా వీధిలోకి గిరాటేయించుకోవాలనే మోజుంటే నన్ను అడుగుతూ కూర్చో. లేదంటే చెప్పినట్టు చెయ్. నీ సామాన్లను బయటికి విసిరేసే అధికారం డి.టి.ఎస్.కు ఉందని అర్థం చేసుకో"

చూపులకు చిక్కకుండా స్టేషన్‌మాస్టరు తప్పుకున్నా, ఎక్కడో దాగి మా సంభాషణ వింటూనే ఉంటాడని నాకు తిరుగులేని నమ్మకం.

చివరి మాటగా రాన్‌తో ప్రకటించాను, "నేను వెళుతున్నాను. నీ కోసం, నీ సామాన్లకోసం ఆటోను వాపసు పంపిస్తాను. నీ

> **కొత్తగాలి...**
>
> **రక్షించే బాబా**
> **రక్షణ కోసం**
> **భక్తుల ప్రార్థనలు**
>
> – బద్ది నాగేశ్వరరావు,
> అనకాపల్లి

ప్రశ్నలన్నింటికి జవాబులిచ్చే తీరిక నాకు లేదు. వచ్చే రైలెక్కి మద్రాసు తిరిగెళ్లే ఆలోచన ఉంటే తప్ప, నీకు వేరే దారిలేదు"

"వద్దు, వద్దు, అది నాకు కుదిరేదిగాదు"

★ ★ ★

మోపెడంత సూట్‌కేసుతో, చూపులకు పసందైన బెడ్‌హోల్డర్‌తో, ఇంకా ఏవేవో వింత సామాన్లతో, అతడు నా ఇంటి ముందు దిగడం కబీర్ వీధిలో కలకలం రేపింది. వాళ్లవాళ్ల గుమ్మాల్లో చేరి వీధి జనమంతా కొత్త ఆగంతకుణ్ణి విడ్డూరంగా చూస్తూ నిలుచున్నారు.

ఆధునిక నాగరికత మొలకెత్తకుండా చదునుచేసే మహత్మ్యమేదో మాల్గుడి వాతావరణాన్ని ప్రభావితం చేస్తున్నందున, ఆక్స్‌ఫర్డ్ సూట్లు ఏనాడో చిమటల ఉండల మధ్య భోషాణం పెట్టెల్లో దాక్కున్నాయి. ఒకప్పుడు వాటిల్లో తిరిగే డాక్టర్లు, ప్యాంట్లూ, కాలరు చొక్కాల్లోకి మారిపోయి, పరీక్షగా చూస్తే తప్ప గుర్తించలేనంతగా మారిపోయారు. ఎవరిని చూసినా బొడ్డు కింద ఎర్రంచు ధోవతితో, అచ్ఛాదన లేని ఎగువ సగం శరీరంతో, లేదా ఎగువ భాగానికి పొట్టిచేతుల చొక్కాతో దర్శనమిచ్చే వీధిలో, రానురాను ఆ ప్యాంట్లూ, కాలరు చొక్కాలుగూడా ఇమడలేక దాదాపుగా అంతరించాయి. కొన్ని వారాలదాకా రాన్ చెమటలు కక్కుకుంటూ, ఎగ ఊపిరి పీల్చుకుంటూ తన సూట్‌లోనే తిరిగాడు. ఇంట్లో ఉన్నప్పుడు పైజామా, నడుంచుట్టూ బొందెలతో కట్టిన నిలువెత్తు గౌను ఒంటిమీద ఉంటేతప్ప గది వెలుపలికి వచ్చేవాడు కాదు. అదృష్టంకొద్దీ వైశాల్యానికి కొరతలేనంత పెద్ద ఇంటిని మా పూర్వీకులు నాకు వదిలేసి పోయారని ఇదివరకే చెప్పున్నాను గదా! విశాలమైందీ మరో మనిషి తోడులేనిది కావడంతో, గది వెలుపలికి బట్టలు లేకుండా వచ్చినా దిగుల్లేదు. కానీ ఈ మనిషి ఆ గౌను తొడిగి, కాళ్లకు స్లిప్పర్లు తగిలించుకుని, అరచేతి మందం టవలును మెడకు చుట్టుకునిగానీ తలుపు తెరవడు.

ఈ సంప్రదాయం మా ఇంట్లో కొత్త. నా తల్లిదండ్రుల హయాంనుండి ఇంట్లో కసువు ఊడ్చేందుకు వచ్చే ముసలాయన, గౌనులో కనిపించే ఈ ఆకారం గదిలో నుండి వెలుపలికి రావడం చూసిన మొదటిరోజు, గుడ్లు వెళ్లబెట్టి, చేతిలో నుండి చీపురుకట్టను జారవిడిచి, పెరట్లో బావి నుంచి నీళ్లు చేదుకుంటున్న నా దగ్గరికి పరిగెత్తుకుంటూ వచ్చాడు, "అయ్యా, గదిలో ఎవరో వింతమనిషి" అన్నాడు

ఆందోళనగా.

రాన్ గూడా అంతే ఖంగుతిని, తాబేలు తన మెడను చిప్పలోకి లాక్కుని కనిపించ కుండా చేసినట్టు, గదిలోకి నిష్క్రమించి వాకిలి మూసుకున్నాడు. వచ్చిన ఇబ్బంది ఏమిటంటే, తలుపులు బంధించిన గదిలో నిరవధికంగా ఉండిపోవడం సాధ్యపడేది గాదు. పెరట్లో వున్న పాయిఖానాకు రాక అతడు తప్పించుకోలేడు.

స్నానానికి పోవాలన్నా, కాలకృత్యాలు తీర్చుకునేందుకు పోవాలన్నా విశాలమైన రెండు మండువాలనూ, నడవలనూ దాటు కుని పెరట్లోకి చేరేందుకు మొదట్లో అతడు బేజారయ్యాడు. తరతరాల వాస్తును మార్చేందుకు వీలుగాదని నా వంతుగా అతనికి తెలియజెప్పాను.

'ఎక్కడ మనసుందో అక్కడ మార్గం..' అనే సిద్ధాంతాన్ని ప్రతిరోజూ వల్లిస్తూ, మెల్లిగా అతనికి తర్ఫీదిచ్చాను.

సెప్టిక్‌ట్యాంకు పాయిఖానా గూడా, ఆస్తి నా స్వాధీనంలోకి వచ్చిన తరువాత కట్టించిందే.

"ఇప్పుడు ఎలావుందో ఎప్పటికీ అలానే ఉంటుంది. నువ్వే సర్దుకోక తప్పదు. మార్పులు చేసేందుకు వీలుపడదు. నాకు డబ్బుండొచ్చు, మనుషులుండొచ్చు, తీరు బాటు ఉండొచ్చు- ఈ పనులను మీదేసు కుని సతమతమవడం నాకు ఇష్టముం డదు" మొహమాటం లేకుండా అతనికి చాలాసార్లు వివరించాను.

ఇళ్ళంతా తిప్పి అతనికి చూపించాను. ఫ్లషౌట్ లెట్రిన్ చూసినప్పుడు అన్నాడు- "అసాధ్యం, నాకు అలా కూర్చునే అలవా టులేదు. ఇంగ్లీషు లెట్రిన్ కావాలి"

"అలాగైతే నువ్వు ఇక్కడికి రావడమే పొరపాటు. ఆధునిక శానిటరీ సౌకర్యాలకు మా పట్నమింకా ఎదగలేదు. ఈ ఉన్నదే విప్లవాత్మకమైన ముందంజ. శానిటరీవేర్ దుకాణదారుడు దివాలాతీసి, అమ్ముడు బోని పింగాణీ సామగ్రిని చుట్టూ పేర్చు కుని ఈగలు తోలుకుంటూ కూర్చున్నాడు. మా పెద్దవాళ్ళంతా స్నానపానాలన్నిటికీ పెరట్లో బావితోనూ, ఏటితోనూ సరిపెట్టు కున్నారు. ఎడతెగకుండా పారే ఏటిని ఇంటివెనుక ఉంచుకుని వాటి కోసం ప్రత్యే కమైన ఏర్పాట్లు అవసరమని వాళ్ళు అను కోలేదు. ఇరవైనాలుగ్గంటలూ కడుక్కునే పనే ఉంటుందన్న పిచ్చి ఆలోచన వాళ్ళకు కలిగిందిగాదు. పాశ్చాత్య నాగరికత దాన్ని మన మనసుకు ఎక్కించింది. వేసవిలో కాస్త మందగించినా, ఏడాది పొడవునా ప్రవహించే నది ఉండగా.." ఇలాటి సమ ర్థనీయమైన వాదనలతో అతన్ని నోరెత్త కుండా చేశాను.

"స్నానం చేసేప్పుడు గౌను ఎక్కడుం చాలి? "

"అదా నీ దిగులు? ప్రతి చిన్నదానికి ఆందోళన పడవద్దు. వాటికవే సర్దుకుం టాయి. నీ గౌను వేలాడదీసేందుకు కావా లంటే గోడలో ఒక గుంజను దిగేయి స్తాను"

★ ★ ★

'టింబక్టో అనే పదం వింతగా వినిపి స్తూందిగదూ? ' అనే వాక్యంతో నా వ్యాసం మొదలయింది. 'ఇది కాకమ్మ కథ లోదో, కాశీమజిలీ కథలోదో అనిపిం చొచ్చు. లేదా గుర్తుంచుకోదగినంత ప్రాధా న్యతలేని పదమైగూడా ఉండొచ్చు' - ఈ ధోరణిలో వంద పదాలదాకా సాగించి, ఆ తరువాత నా తీర్మానం ప్రకటించాను. 'ఇకమీదట ఆ పదానికి తగిన ప్రాముఖ్యత ఇచ్చేందుకు మనం సిద్ధపడాలి. ఎందుకం టారా? అది వాస్తవంగా ఉందని ఇప్పుడు నాకు తెలిసొచ్చింది కాబట్టి. మాల్గుడి ఉనికి ఎంత నిజమో దాని ఉనికిగూడా అంతే నిజం. టింబక్టో నుండి వచ్చిన ఒక

మనిషితో నేను స్వయంగా కరచాలనం చేశాను. అది భ్రమో లేక అతడు నిజంగా మనిషో రూఢీ చేసుకునేందుకు అతని డొక్కలో పొడిచిచూసి నిర్ధారించుకున్నానంటే నమ్మండి... అతడు ఐక్యరాజ్యసమితి తరఫున ఒక ప్రాజెక్టు పనిమీద ఇక్కడికొచ్చాడు. అందుకోసం అతడు మాల్గుడిని ఎన్నుకోవడం మాకు గర్వకారణం. అతని మాటలు బట్టి టింబక్టో అనేది భూతలస్వర్గం. దాన్నిగురించి వింటే, పవిత్రమైన మన మాతృభూమిని వదిలేసి, టింబక్టోలో జీవితాంతం ఉండిపోయేందుకు వలసపోవాలన్నంత ఉబలాటం కలుగుతుంది'- అన్న తరువాత నిరంతరం ఫుల్‌సూటులో కనిపించే రాన్ ఆకారాన్ని తగిన పదాలతో వివరించాను.

ఏ జర్నలిస్టు జీవితానికైనా ఉజ్వలమైన ఘడియొకటి ఉండితీరుతుంది. అంతగా కాకపోయినా, ఉజ్వల భవిష్యత్తుకు దోహదంచేసే అపూర్వ సంఘటన జరుగబోయే సూచన తారసపడుతుంది.

ఎవరో తట్టినట్టు వినిపించి, తలుపు తెరిచిచూస్తే, అత్యవసర పరిస్థితుల్లో తప్ప అరుగు నుండి కిందికి దిగని పొరుగింటి రాముడి భారీకాయం ఎదురుగా కనిపించింది. దుండుముక్కలాంటి చేత్తో అతడొక టెలిగ్రాం అందిస్తూ, "నువ్వు ఇంట్లో లేనప్పుడు వచ్చింది. నేనే సంతకంజేసి తీసుకున్నాను" అన్నాడు.

దాన్ని చింపి తెరుస్తూంటే, సంగతి తెలుసుకునేందుకు అతడు అక్కడే నిలుచున్నాడు. వెళ్ళిపోతాడనే ఆశతో "థాంక్స్" అంటూ గొణిగాను. 'ఒరే దుబ్బోడా, తప్పుకోవేరా నా కళ్ళముందునుండి' అనుకున్నాను మనసులో. అది మా ఎడిటర్ నుండి వచ్చిన వర్తమానం కావడంతో, ఏమైవుంటుందా అని ఊహించుకోవడం నా తక్షణ కర్తవ్యం.

'వార్త చాలా ఆసక్తికరంగా ఉంది. కానీ, టింబక్టో మనిషి ఫొటో లేకుండా నిరుపయోగం. వెంటనే ఏర్పాటుచేయ్' అనివుంది.

అది నా జీవితంలో తొలిసారిగా లభించిన ప్రోత్సాహం. సాధారణంగా నేను పంపించే సమాచారానికి వరదలో కొట్టుకుపోయే బెండు గతే పట్టేది. ఒకవేళ అచ్చులో దిగినా, భూతద్దమేసి వెదుక్కోనేంత చిట్టిగా కుదించుకుని కనిపిస్తుంది. దానికి పారితోషికం ఉండదని వేరే చెప్పనవసరం లేదనుకుంటా. ఆ పారితోషికంతో నాకు అవసరం గూడా లేదు. ఎందుకంటే, అనుభవించడం అవసరమనే ఆలోచన లేక, నిరవధికంగా కూడబెట్టడమే కార్యక్రమంగా నా పూర్వీకులు నడుచుకున్నారు గనక.

ఇదిగో, నా చేతిలో ఈ టెలిగ్రాం ఉంది, దానిమీద కలలుగంటూ తేలిపోయే సౌభాగ్యాన్ని ఈ ధుబ్బోడు ఇక్కడే నిలుచుని చెలియలికట్టలా అడ్డుకుంటున్నాడు.

"అంతా క్షేమమేగదా? చెడ్డ వార్త కాదుగదా? " అన్నాడు.

"శుభవార్తే. మా ఎడిటర్ దగ్గరి నుండి వచ్చింది. ఏదో రాయమని పురమాయిస్తున్నాడు. ఇది ఎప్పుడూ ఉండేదే" అంటూ, సహజంగా కనిపించేందుకు ప్రయత్నించి,

## కొత్తగాలి...

**ముద్దుకు**
**ముద్దుకూ**
**చుట్టుకొలత**
**విశాల విశ్వమంత**

– రఘుపాత్రుని శ్రీనివాసరావు, శ్రీకాకుళం

వీపు తిప్పుతూంటే మళ్ళీ అందుకున్నాడు.

"టెలిగ్రాం అంటేనే నాకు దడ. కాకపోతే నేనే విప్పి నీ కోసం వెదికి ఈ వార్తను మోసుకొచ్చేవాణ్ణి"

ఒంటిమీద చొక్కా లేకుండా, శరీరంలో వీలైన ప్రతిచోటా కుదుములు కుదుములుగా మడతబడి ఊగులాడే చర్మంతో, మార్కెట్ రోడ్డువెంట ఈ బొజ్జగణపతి నా కోసం గాలించడం ఊహిస్తేనే వెగటయ్యే సంఘటన.

పకపకా నవ్వుతూ, "నీ అభిమానం అలాటిది" అనేసి, తలుపు మూసేశాను.

విలేకరిగా నా దిగ్విజయాన్ని అప్పటికప్పుడే ప్రపంచానికి చాటించాలో వద్దో తీర్మానించుకునే సందిగ్ధం తొలగకముందే ఆ టెలిగ్రాం మూలంగా నాలో చిగురించిన ఆశలు ఊడలు దించుకున్నాయి. వృత్తిలో మహోజ్వలమైన అంచుకు దగ్గరైన ఆనందంలో ఆ రోజంతా గడిచిపోయింది. సృజనాత్మకమైన రచయితను కావాలనే కోరిక నాకు ఏనాడూ లేదు. 'అవాస్తవిక లోకంలో బతికే కవులూ, రచయితలకన్నా, సమాజానికి అత్యుత్తమైన సేవలు అందించగలిగేది ఒక పత్రికా విలేఖరే' అనేది నా అభిప్రాయం. అవసరం ఎక్కడుంటే అక్కడంతా ప్రత్యక్షమయ్యేవాడు విలేఖరి. అతడు సమాజానికి కంటితో సమానం.

బోర్డులేని హోటల్లో కూర్చుని, తెచ్చిపెట్టిన కాఫీ చల్లబడిపోయిందని గూడా తెలీనంత మత్తుగా ఊహల్లో విహరించే సమయంలో, బిల్లు చెల్లింపులూ చిల్లర మళ్లింపుల నుండి దృష్టి మరల్చకుండా వర్మ, "ఇదిగో అబ్బాయ్, వ.పి. గారి కాఫీ చల్లబడింది. అది తీసేసి వేరే తీసుకురా" అంటూ వేసిన కేకకు నేను ఈ లోకంలో పడ్డాను.

"ఏంలేదు, ఎడిటర్‌గారినుండి టెలిగ్రాం వచ్చింది. చాలా ముఖ్యమైన బాధ్యత. కానీ.. దాని భవిష్యత్తు ఫొటోగ్రాఫర్ మీద ఆధారపడి వుంది" అన్నాను వర్మతో నాలో నేను గొణుక్కున్నట్టు.

"ఎవరిమీదా? " అడిగాడు వర్మ.

"చెప్తాలే, కాస్త ఆగూ" అన్నాను సమాచారాన్ని ఇప్పుడిప్పుడే బయటపెట్టడం దాటేస్తూ.

వెంటనే జరిగిపోవలసిన పని కావడంతోనూ, అది నా భవిష్యత్తును మలుపు తిప్పే అవకాశంగా ఆశలు కలగడంతోనూ, ఆ రోజంతా తల బాదుకుని కార్యాచరణ తేల్చుకున్నాను. అవసరమైతే ఇంటికి తాళంవేసి ఎక్కడికి వెళ్ళేందుకైనా సిద్ధమయ్యాను.

ఫొటో దిగమంటే రాన్ ఏమంటాడోననే సందేహం నన్ను పీడించింది. అతన్ని ఒప్పించడం తేలికైన సాముగా ఉండబోదని అంతరాత్మ చెప్పింది. తీరా అతన్ని అడగ్గానే నా అంతరాత్మ చెప్పిందే నిజమని తేలిపోయింది.

అడిగినప్పుడు అతడు గదిలోనే ఉన్నాడు. అడగ్గానే సంకోచిస్తూ, "ఎందుకూ? " అన్నాడు.

"ఊరికే.. తమాషాకు, నువ్వు ఎన్నెన్నో దేశాలు తిరిగావుగదా, నీ దగ్గర మంచి మంచి ఫొటోలు ఉంటాయని"

నా ప్రతిపాదనను తోసేస్తున్నట్టు గాలిలో చెయ్యి విసిరి, బల్లమీదున్న కాగితాలు చదవడంలో అతడు మరోసారి మునిగిపోయాడు. చెప్పుకోదగిన మనిషి. అతనికి నేనిచ్చింది ఫర్నిచర్ లేని గది. అందులో ఇప్పుడు ఒక బల్ల, కుర్చీ, మడత మంచం కనిపిస్తున్నాయి. ఇంతవరకు అతని గదిలో నేను అడుగే పెట్టలేదు. స్నానానికి బయలుదేరేప్పుడు గూడా అతడు తాళం వేసిగాని కదలడు. కొత్తగా చేరిన వస్తువులను బట్టి నిస్సందేహంగా అతడు అక్కడా ఇక్కడా తిరుగుతుండాలి.

"బల్ల ఎక్కడ దొరికింది? "

"బాడుగకు దొరికింది. మార్కెట్ రోడ్డులో ఆ షాపు కనిపించింది. నాలుగూ పదిహేను రూపాయలంటే పెద్ద బాడుగేం గాదు. ఒకటిన్నర డాలరుకంటే తక్కువే. చాలా చౌక"

నా తల తిరిగిపోయింది. నేనేదో తాత్కాలిక ఆశ్రయంగా అతడ్ని ఇంట్లో ఉంచుకుంటే, అతడు శాశ్వతంగా తిష్ఠ వేసేందుకు పూనుకున్నాడు.

అతడు ఎన్నిరోజులు ఉండబోతాడో తెలుసుకునేందుకు పరోక్షంగా నరుక్కొస్తూ, "మొత్తం రోజులకు ఎంత తీసుకుంటారో? " అన్నాను.

**కొత్తగాలి...**

**విషాన్ని తీసుకొని**
**అమృతాన్ని పంచేది**
**శంకరుడే కాదు**
**చెట్టు కూడా**

– బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్

"ఇతర దేశాలతో పోలిస్తే కారుచౌక. బాడుగ విడతలు విడతలుగా వసూలు చేసుకుంటారు. ఇన్నేరోజులనే పరిమితి లేదు" అన్నాడు దాటేస్తూ.

కిలాడితనంలో నాకంటే ఒక ఆకు ఎక్కువే చదివాడు. లాభంలేదని ఆ సంగతి అలా వదిలేసి, చుట్టూ గోడలకేసి చూస్తూ, "ఫోటోలేవీ లేవు? " అన్నాను.

"ఏ తరహా ఫోటోలూ? అవంటే నాకు గిట్టదు- ఏ తరహావైనా."

"ప్రపంచంలో రకరకాల ప్రదేశాలు సందర్శించావుగదా? ఫొటోలు మంచి మంచివి ఉంటాయనుకున్నాను"

ఫోటో ఇవ్వడని తెలిపోయింది. ఈరోజు జపాన్ కిమోనో తొడిగున్నాడు. పనిలో తలమునకలుగా ఉన్నట్టు ముఖం గంభీరంగా పెట్టుకుని కూర్చొనున్నాడు.

"ఈ నివేదికలు ఇప్పటికిప్పుడు పంపించాలి. ఇప్పటికే చాలా ఆలస్యం జరిగిపోయింది. ప్రయాణాలతోనూ, కుదురుగా కూర్చుని పనిజేసుకునే మకాం దొరక్కపోతేనూ పనిలో ఇలాంటి అంతరాయం ఎవరికైనా తప్పేదిగాదనుకో" అన్నాడు.

అతడు కూర్చుని మాట్లాడుతుంటే, నేను వింటూ నిలుచోవడం నాకే ఎబ్బెట్టుగా ఉంది. అతడు పంపే నివేదికలు ఎలాటివో చూద్దామనే ఆసక్తివల్ల మరికొద్దిసేపు నిలబడ్డాను. టైపులో వున్న కాగితాలు కొన్నీ, చేతిరాతలో వున్న కాగితాలు మరి కొన్ని వేరువేరు దొంతర్లుగా బల్లమీద పేర్చున్నాయి. ఆ నివేదికలు ఎక్కడికి చేరుకుంటాయో? నా సందేహాలు తాత్కాలికంగా పక్కకు నెట్టి బయటికి వచ్చేశాను. నా తక్షణావసరం అతని ఫోటోను సంపాదించడం, దాన్ని గురించి ఇక అతనితో ప్రస్తావించడం మానేయమని నా అంతరాత్మ బోధించింది.

నా మిత్రుడు జయరాజుతో సంప్రదించాను.

"అదెంత పని? పిలుచుకొచ్చి నా కెమెరా ముందు ఒక్కక్షణం నిలబెట్టు. చిటికెలో ఫోటో నీ చేతిలో ఉంటుంది"

"అతడు కెమెరా ముందుకు రాడే. ఎందుకు రాడో నాకు తెలీదు. వచ్చేట్టుంటే స్నేహానికి గుర్తుగా నేను గూడా ఫోటోలో కలిసి దిగకుండాపోతానా? "

"ఇద్దరికైతే పాతిక రూపాయలివ్వాలి"

ఆ మాట వినగానే, అసలు విషయంతో ఏ మాత్రం పొత్తులేని వాదనకు ఉపక్రమించాను.

"అంటే యాభైమంది స్కూలు పిల్లలు

ఫొటో దిగితే, వాళ్ళ తలకాయలు లెక్కేసి తీసుకుంటావా? "

"తప్పదుమరి. వేరే దారేముంది? నాగ్గూడా పొట్ట గడవాలిగదా? చౌకగా ఇంకో ఫొటోగ్రాఫరు దొరికితే నువ్వు అత గాడిని పట్టుకున్నా నాకు అభ్యంతరం లేదు. ఫిలిం దొరకడం లేదు- 35 మి.మీ టర్లదీ లేదు. 120 మి.మీటర్లదీ లేదు. కడి గేందుకు రసాయనాలు దొరకవు. ప్రింటు పేపరు దొరకదు. మా పరిస్థితి దారు ణంగా ఉంది. మన ప్రభుత్వం దిగుమ తుల మీద అనుసరించే విధానం చూస్తే, ఫొటోగ్రాఫర్లను తొక్కెయ్యాలని చూస్తు న్నట్టు అనుమానం కలుగుతోంది. అంతో ఇంతో నా దగ్గర సరుకు ఉందంటే, స్మగ్ల ర్లంటారే.. ఆ జాతికి దండం పెట్టుకో వాలి. నాటుపడవల్లో సరుకు తీసుకుని వాళ్ళు కుంబానికి వస్తారు. నెలకొకసారి అక్కడికెళ్ళి సరుకు తీసుకొస్తున్నాను. పోను ఐదు రూపాయలూ, రాను ఐదురూ పాయలు. అది పాగీలనుండే రాబట్టుకో వాలా? పెళ్ళిఫొటోకు ఫ్రేము వెయ్యమని మన కౌన్సిలర్ వచ్చాడు.

ఫ్రేము కోసం ఏది తీసుకొచ్చినా అభ్యం తరం లేదుగానీ.. ఫొటో కావాలని మాత్రం రావద్దని మొగమాటం లేకుండా చెప్పేశాను. ఇప్పుడు నా వ్యాపారమంతా ఫ్రేములు కట్టడం, సైనుబోర్డులు రాయడం. అదైనా సాఫీగా జరిగితేనా? అదీ అంతే..."

అతడు తనముందు కిక్కిరిసిన ప్రేక్షక సందోహాన్ని ఊహించుకుని- నాసిరకం కొయ్యతో తయారుజేసిన ఫ్రేములనూ, పుచ్చిపోయిన చెక్కను రంగులతో కప్పి పుచ్చే ఫ్రేములనూ, నకిలీ గిల్టు ఫ్రేము లనూ సరఫరాజేసే కంపెనీల మోసాలను ఏకరువు పెట్టి, ఈ అనర్థానికంతా ప్రభుత్వ విధానమే కారణమని ఉపన్యసిం చాడు. తనను తుడిచిపెట్టేందుకు ప్రభుత్వం కత్తిగట్టి కుట్రలు పన్నుతున్న దనే భ్రమ అతనిలో అపారం. మార్కెట్ ప్రవేశద్వారం పరిసరాల్లో, దారిలోకి చొచ్చు కొచ్చిన అతని కొట్టు తాలూకు బెంచిమీద సుఖంగా జారగిలబడి, అతడు వెళ్లగక్కే ఆవేదనకు సుదీర్ఘమైన సమయం కేటా యించడం నాకు పరిపాటే. పబ్లిక్ రస్తాకు అడ్డంగా ఉన్నందున, దాన్ని తొలగించాలని మున్సిపల్ అధికారులు ఎంత ప్రయత్నిం చినా ఫలితం దక్కలేదు. తన కిష్టమైన చోట తన బెంచిని తాను వేసుకునే స్వాతంత్ర్యం కాపాడుకునేందుకు అవసర మైతే సుప్రీంకోర్టునైనా ఆశ్రయించేందుకు వెనుకాడేదిలేదని అతడు గొప్పలు చెప్పని రోజంటూ ఉండదు. అతని ప్రాథమిక హక్కును సవాలుజేస్తే ఓర్చుకోడు.

అతడు బాసికపట్టులో నేలమీద కూర్చుని, ఫ్రేముల్లో మేకులు దిగ్గొడుతూ వెనకగోడకు వీపుజేసి మాట్లాడుతున్నాడు. స్మగ్లర్ల దయతో సంపాదించినట్టు ఇంత దాకా అతడు చెప్పుకొచ్చిన ఫొటోగ్రఫీ సరు కుండే నిగూఢమైన చీకటిగది ఆ గోడ వెన కుండే అరలో ఉంటుంది.

"నాకు ఈ సహాయమొక్కటి చెయ్య లేవా? నీ సహాయమే నా భవిష్యత్తుకు ఆధారం. ఎలాగో ఒకలాగా అతన్ని ఈ దారివెంట తీసుకొస్తాను. అతనికి తెలీ కుండా ఫొటోతీసి, పెద్దది చేసివ్వు. ఎదు రెదురుగా తీసినా ఫరవాలేదు, పక్కల నుండి తీసినా ఫరవాలేదు. ఛాతీవరకు చాలు"

"చచ్చాంపో. నాది పాతకాలం కెమెరా. దానికి మించింది పుట్టలేదనుకో. ఐనా, మూడుకాళ్ళ పీటమీద బిగించేవుంటుందే. అదంతా మోసుకుని నువ్వు చెప్పినట్టు తీసేందుకు వీలుపడదు. ఆc- ఒకపని చేద్దాం. స్మగ్లర్ల ద్వారా మన కౌన్సిలర్ ఇటీ

వలే జపాన్ కెమెరా కొన్నాడు. అతన్ని బతిమాలి దాన్ని తీసుకొస్తాను. దూరం నుండైనా ఫోటో తీసేందుకు అందులో 'జూం' గూడా ఉంది. చేతిలో తేలిగ్గా ఇముడుతుంది" అన్నాడు జయరాజు.

ఈ సాహసకార్యానికి తగిన ఉత్సాహం అతన్లో ప్రవేశించింది. లేచి, చీకటిగది ద్వారంలో నిలబడి, "ఆ కమాను దగ్గర మీరు నిలబడితే, ఇక్కడి నుండి తీసే య్యొచ్చు. ఐతే అతన్ని ఏరోజు తీసుకొ స్తావో, ఏ గంటకు తీసుకొస్తావో నాకు కచ్చితంగా తెలియాలి. నేను ఏమడిగినా కాదనని మిత్రుడివి, ఆ మాత్రం సాయం చెయ్యలేనా? " అన్నాడు.

"నాకు తెలుసు. ఆ నమ్మకముండే స్టార్ స్టూడియోకు వెళ్ళకుండా నీ దగ్గరకు రావడం" అన్నాను.

"ఆ పోరంబోకోడి దగ్గరకా? పొరపా టున గూడా వెళ్ళొద్దు. వాడు శవాలను ఫోటోలు తీసుకునేవాడు. బతికున్నోళ్ళను చేతగాదు"

తలపెట్టిన పనిమీద అతడు దృష్టిని కేంద్రీకరించాడు. సాధకబాధకాలను నిశి తంగా సమీక్షించాడు. మరుసటిరోజు ఉదయం ఆ కమానుకింద నన్ను నిలబెట్టి రిహార్సల్ వేసుకున్నాడు. ఈ రుతువులో మార్కెట్ కమానుకింద ఏటవాలుగా ప్రస రించే వెలుతురు కేవలం ఇరవై నిమిషాలు మాత్రమే ఉంటుంది. పొద్దు పెరిగితే నీడలో మునిగిపోతుంది.

"ఆ వెలుతురు ఉన్నప్పుడే పట్టేయాలి. ఫ్లాష్ వాడితే అతడు జారుకోవచ్చు. ఐదే ఐదు నిమిషాలు, మార్కెట్ వైపు చూస్తూ అతడు ఒక్క క్షణం కదలకుండా నిలుచు నేలా చూస్తే చాలు. ఎవరూ అడ్డంరా కుండా చూసుకునే విషయం నాకు వది లేయ్. మా కుర్రాణ్ణి అక్కడుంచి మను షులు దూరంగా ఆగిపోయేలా చూస్తాను. ఆ కొద్దిసేపు ఆగేందుకు ఎవరూ కాదనరు. అది పెద్దగా రద్దీవుండే సమయంగూడా కాదు. అతడు నేరుగా వెళ్ళిపోకుండా, కాస్త ఆగేలా చూసుకునే బాధ్యత నీదే. ఏదైనా చూపించే సాకుతో ఆపితే బావుంటుంది. 'నేను గూడా ఫోటోలో పడిపోతా'ననే దిగులు వదిలేసెయ్. నిన్ను కనిపించ కుండా చేసి, అతని ఫోటోవరకు పెద్దది చేస్తాను"

అతడు కొట్టునుండి దిగొచ్చి, కమానుకింద తను ఎన్నుకున్న తావులో నన్ను నిలుచోబెట్టాడు. సూటిగా చూడమ న్నాడు. తను కొట్టులోకి గెంతేసి, చీకటి గదిలో మాటేసి, 'వ్యూ ఫైండర్'లో చూసు కున్నాడు. నా పథకంలో అతడంత మమే కమవుతాడని ముందుగా ఊహించలేదు.

నాకు ఇప్పుడు ఆరాటం పెరిగింది. లొసుగుల్లేకుండా ఏర్పాట్లన్నీ కుదిరాయి గానీ, కుట్రను పసిగట్టనీయకుండా కథానా యకుని సహకారం సంపాదించడమే మిగిలున్న సమస్య. ఒక్కసారైతే బురిడీ కొట్టించొచ్చుగానీ, 'రీటేక్' కుదిరేది కాదు. ఆలస్యమైతే ఎడిటర్‌కు ఆసక్తి తగ్గిపోతుం దేమోననే భయం నా మెదడును తొలిచే స్తోంది. కౌన్సిలర్ దగ్గర అరువుతెచ్చిన జపాన్ కెమెరాను ఒకేఒక రోజుకు మించి జయరాజు తన దగ్గర ఉంచుకోలేడు. చాలీచాలని ఈ వ్యవధిలో రాన్‌ను దారి లోకి తెచ్చుకోవాలి. ఉత్కంఠతో నా నరాలు తెగిపోతున్నాయి. అంతరాయం లేకుండా పథకాన్ని రూపొందించుకునేం దుకు మా ఇంట్లో ఓ మూల, ధ్యాన మందిరంగా వ్యవహరించబడే గదిలోకి జారుకున్నాను. రాన్ అటుగా వచ్చే అవకా శమే లేదు.

గదిలో మసక వెలుతురు ఎప్పుడో వెలి గించిన కర్పూరం వాసనలు ఇప్పటికీ వద ల్లేదు. మసిబారిన గోడలకు తగులుకొని

రెండు దేవతల పటాలు వేలాడుతున్నాయి. పెంకుల కప్పులో బిగించిన నీలి రంగు అద్దంగుండా లోపలికి ప్రసరించేదే వెలుతురు. నా పనికి అంతకంటే ఎక్కువ వెలుతురు అవసరం గూడా లేదు. అందులో కాళ్ళు మడతేసి పీటమీద కూర్చుని, నా సమస్య మీద దృష్టిని కేంద్రీకరించాను. పుస్తకం తొడమీద ఉంచుకుని, కార్యక్రమం చిత్తుప్రతిని రేఖామాత్రంగా నమోదు చేసుకున్నాను.

రాన్‌ను కలిసి, మార్కెట్‌లో ఉండే 'స్వామి హస్తకళల కార్ఖానా' తప్పకుండా చూడదగిందని ఊరించాలి. అతన్ని అక్కడికి బయలుదేరదీయాలి. ముందే శ్యామ్‌తో చెప్పి రాన్ కోసం సావనీర్‌తో సిద్ధంగా ఉండేలా చేయాలి. శ్యామ్‌కు అంతర్జాతీయ ప్రముఖులంటే చాలా గౌరవమనీ, వాళ్లను తప్పనిసరిగా ఆహ్వానించి ఆదరిస్తాడనీ, అతని నైపుణ్యాన్ని మెచ్చుకుంటూ ఎంతో మంది గొప్పవాళ్ళు రాసిన ఉత్తరాల భాండాగారాన్ని చూడొచ్చుననీ, నా కోసమైనా రాన్ ఆ కొద్ది సమయం కేటాయించాలనీ బుజ్జగించాలి.

ఉదయం 10.10 గం.లకు కబీర్‌వీధి గుండా కాలినడక. 10.25కు మార్కెట్ కమాను. అక్కడ ఆగి, దాని దిమ్మె మీద దుమ్ముతో పేరుకుపోయిన శిలాఫలకం వైపుకు అతన్ని నెమ్మదిగా జరపాలి. అందులో మలిచిన అక్షరాలను పరిశీలించేలా ప్రోత్సహించాలి. 10.30కి కమాను దాటుకుంటాం.

ఉచ్చులో తేలిగ్గా ఇరుక్కున్నాడు రాన్. తలుపు తట్టి అతని గదిలో దూరాను. తరతరాలుగా వస్తున్న నా పడకకుర్చీలో సుఖంగా పడుకుని అతడు విశ్రాంతి తీసుకుంటూ వాసాలు లెక్కేస్తున్నాడు. కాస్త మందకొడిగా గూడా ఉన్నాడు. కాబట్టి, నా ప్రతిపాదన వినిపించేందుకు అనువైన అదనుగా తోచింది.

## వేషం వెనుక రహస్యం!

మొట్టమొదటిగా ఆచంటి జానకీరామ్, కృష్ణశాస్త్రిని చెన్నైలో కలిశారు. ఆరోజు పాత కోటు వేసుకుని అతిదీనంగా ఉన్న కృష్ణశాస్త్రిని చూసి, పరిస్థితి అర్థంకాకపోయినా దగ్గరకెళ్లి పరిచయం చేసుకున్నారు జానకీరామ్.



మర్నాడు వారిద్దరూ మరో కవిశేఖరుడు మల్లంపల్లి చంద్రశేఖర శాస్త్రిగారింట్లో కలుసుకున్నారు. అయితే నిన్నటి పాతకోటులో లేరాయన. చక్కని మల్లెపువ్వులాంటి తెల్లని లాల్చీతో అచ్చం భావకవిలా వెలిగిపోతున్నాడు. నిన్నటికీ, నేటికీ ఎంత తేడా అని ఆశ్చర్యపోతూ, 'నిన్న మీరు ట్రామ్‌లో వెలసిపోయిన కోటులో..' అని జానకీరామ్ ఆగిపోయారు. దానికి శాస్త్రిగారు, 'అదా.. ఎవరో ఉద్యోగం ఇస్తాం.. రమ్మన్నారు. వారు అన్నంత పని చేస్తారేమోనని జడిసి ఆ కోటు తొడుక్కుని వెళ్లాను. అదృష్టవశాత్తు ఆ ఉద్యోగం రాలేదు' అన్నారు.

"రేపు ఉదయం నా కోసం ఓ అర్ధగంట కేటాయించగలవా? "

"నిరభ్యంతరంగా, ఇంతకూ దేనికోసం? "

"నువ్వు ఇక్కడికొచ్చి ఇన్నాళ్ళైనా మా టౌను మొత్తానికి విశిష్టమైంది, నిజంగా చెప్పాలంటే మా టౌనుకు ఖజానాతో సమానమైన ప్రదేశాన్ని నువ్వు చూడలేదు"

"పనిలో మునిగిపోయి..."

"నాకు తెలుసు, నాకు తెలుసు... ఐనాసరే నువ్వు చూసి తీరవలసిన ప్రదేశం. చూసిన తరువాత నీకే తెలుస్తుంది. మార్కెట్లో వుండే ఒక స్నేహితున్ని పరిచయం కూడా చెయ్యొచ్చునని పిలుస్తున్నాను"

"మార్కెట్టా? చాలా రద్దీగా ఉండదూ?"

"ఎప్పుడూ ఒకేలా ఉండదు. రద్దీ తక్కువగా ఉండే సమయంలోనే తీసుకెళ్తాను. హస్తకళల కార్ఖానా చిన్నదే గాని, దాన్ని నిర్వహించే మనిషి పేరు శ్యామ్. చాలా ఘటికుడు. కళకు అంకితమైన మనిషి. లక్కతో, గంధం చెక్కతో అతడు తయారుచేసే వస్తువులకు దేశదేశాల్లో గిరాకీ. లేపెజ్‌లోనే కాక, ఇతర అంతర్జాతీయ ప్రదర్శనల్లోనూ బహుమతులు సంపాదించాయి. ఆఫ్రికాలో, అమెరికాలో, యూరప్‌లో ఇంకా ఇతర ఖండాల్లో అతనికి డీలర్లు ఉన్నారు. ప్రపంచవ్యాప్తంగా అతనికి గుర్తింపు ఉంది. అతనికి గుర్తింపు లేని ప్రదేశం ఏమైనా ఉందంటే అది మా ఊరొక్కటే. విదేశీయులు అతని కోసం వెదుక్కుంటూ వచ్చి కొనుగోలు చేస్తుంటారు. ఇతర దేశాల నుండి వచ్చే ఏ సందర్శకుడైనా ముందుగా అడిగేది 'శ్యామ్ హస్తకళలు ఎక్కడ?' అని. రేపు ఉదయం పది గంటలకు వెళ్దాం. నడిచి వెళ్లొద్దాం. అతని కార్ఖానా చూసి, ఓ అర్ధగంటలో తిరిగొచ్చి నీ పని చూసుకోవచ్చు"

అనుకున్నది సరిగ్గా అనుకున్నట్లే నెరవేరింది. మార్కెట్ కమానులో నేను ప్రవేశించాను. అతడు అనుసరించాడు. నేను పక్కకు తప్పుకుని, మాసిపోయిన శిలాఫలకాన్ని అతనికి చూపించాను. దాన్ని చూస్తూ నిలుచుని అతడు కదల్లేదు. చీకటి గది అంచున జయరాజు బూచిలా నెమ్మదిగా కదలాడటం గమనించి, రాన్‌తో సంభాషణ కొనసాగించాను.

"దుమ్ముతో పూడిపోయింది. శంకుస్థాపన తేదీ తెలుసుకోవాలని నీకుంటే, దుమ్మును గోకేద్దాం"

"థ్యాంక్స్. అంత అవసరం లేదు"

హస్తకళల కార్ఖానా దిశగా సాగిపోయాం.



★ ★ ★

యథాప్రకారం నా వార్తలు మెయిల్లో పంపేందుకు వెళ్ళగానే, స్టేషన్ మాస్టారు అత్రుతగా నాకేసి పరిగెత్తుకొచ్చాడు.

"ఏడు దక్షిణంలో భారీగా ఉండే ఆడమనిషి దిగింది. వెయిటింగ్ రూములో తిష్ఠ వేసింది. ఆ లండన్ మనిషిలాగే ఈమె గూడా ఖాళీచేసేలా కనిపించడంలేదు. అతన్ని తీసుకెళ్ళినట్టే మీరు ఈమెను



గూడా తీసుకెళ్ళక తప్పేట్టు లేదు" అన్నాడు.

"నాకు ఇదే పనా? ఆమె ఎవరో ఏమో!"

"నాకు మాత్రం ఇదే పనా? ఎవరికి పడితే వాళ్ళకు ఇచ్చేసేందుకు వెయిటింగ్ రూము నా అబ్బ సొత్తు కాదు"

అతని మాట ముగిసేలోపే, అతని ఫిర్యాదుకు కారణమైన శాల్తీ, మా దిశగా వస్తున్నట్టు కనిపించింది.

హఠాత్తుగా చూశా. ఆరడుగుల విగ్రహం, రంగు నలుపు. కత్తిరించిన జుత్తు, జీన్స్ ప్యాంటూ, టీషర్టుల్లో తన్ను కుంటూ ముందుకొచ్చిన పొలిండ్లు, అటు వంటి అవతారం మాల్గుడి పరిసరాలకు ఇదే ప్రథమం.

"విలేఖరివి నువ్వేననుకుంటా?" అడి గింది గుండెలు తీసిన బంటులా. మెయిన్ బోగీ దగ్గర నన్ను గమనించి పసిగట్టిన ట్టుంది. రాన్ ఫొటోతో కలిపి అచ్చైన 'టింబక్టో మనిషి' వ్యాసముండే పత్రిక ముక్కను చేతిసంచి నుండి బయటికి లాగి, దాన్ని రెపరెపలాడిస్తూ నా ముం దుకు తోసి, "ఇది రాసింది నువ్వేనా"

అంది.

"ఔనండీ" ఒప్పుకోక తప్పలేదు.

"నన్ను మోసగించడం ఎవరితరమూ కాదు" అంది.

పొట్టి మాస్టారు చూపులకు చాలనంత మరుగుజ్జుగా మారిపోయి, పళ్ళు ఇకిలిస్తూ నా చాటుకు తప్పుకున్నాడు. నేను గూడా బెదురుకున్నది వాస్తవమేగానీ, ఎదిరించేందుకు అవసరమైన చేవను కోల్పోలేదు.

"అంటే మీ తాత్పర్యం?"

"నా తాత్పర్యమా? డాక్టరుగా చెప్పుకునే ఈ మనిషి ఎక్కడున్నాడో నీకు తెలిసుంటే నన్ను అక్కడికి చేర్చాలని" చలించకుండా జవాబిచ్చింది.

"ఎందుకు?"

"అతనికి నేను పెళ్ళాన్ని కాబట్టి. బహుశా గుడిలో అగ్నిసాక్షిగా వివాహమైన ఒకే ఒక పెళ్ళాన్ని"

ఈ విషయం జీర్ణించుకునేందుకు నా ప్రయత్నంలో నేనుండగా-

"లెక్కలేనంత మంది అతనికి పెళ్ళాలుగా ఉండొచ్చుగానీ, శాస్త్రోక్తంగా పెళ్ళయింది నా ఒక్కదాంతోనే. భార్యల్లో మొదటిదాన్ని గూడా. అంత దిగ్భ్రాంతిలో పడిపోతున్నారు.. ఎందుకని?"

"అబ్బే, అదేం లేదు" అన్నాను ఇరకాటంగా. అంతకుమించి చెప్పగలిగిన సంజాయిషీ నాకు తోచలేదు. ఈ ఆడమనిషి చెప్పేది నిజమైతే, రాన్ స్వరూపం ఆసాంతం కొత్తకోణంలో కనిపిస్తుంది.

స్టేషన్ మాస్టరు విస్తుపోయాడు. చుట్ట చుట్టిన జెండాలను చంకలో ఇరికించుకుని అతడు అక్కడక్కడే తచ్చాడటం మానలేదు. పోర్టరు అతని వెనకాలే ఉన్నాడు. మేం నలుగురం తప్ప ప్లాట్ ఫామ్ మీద మరో ప్రాణి కనిపించలేదు. కొంతసేపు దాకా ఆమె వాళ్ళను నిశ్శబ్దంగా గమనించింది. ఆ తరువాత-

"స్టేషన్ మాస్టరుగారూ, ఇంకా మీ పనేదైనా ఇక్కడ మిగిలిపోయిందా" అంది.

"నిజం చెప్పాలంటే, ... తొమ్మిది ఉత్తరం ఇరవై గంటల దాకా రాదు"

"ఇరవై గంటలేమిటి? కూడికలూ తీసివేతలతో అదో నస" అంటూ స్వగతంగా గొణిగి, "మిగతా నాగరిక ప్రపంచంలాగే మీ రైల్వేవాళ్ళు గూడా ఉదయం, సాయంత్రం అనే పదాలను వాడలేరా?" అంది.

"నిజమే మేడం" గొర్రెలా తలూపుతూ జవాబిచ్చాడు మాస్టారు.

"ఇతడొక్కడేనా ఇక్కడ పోర్టరు?"

మహారాణి చూపులకు తగిలిన పోర్టరు అడుగులు రెండు ముందుకేసి, "ఒక్కడినే అమ్మగారూ" అన్నాడు చేతులు కట్టుకుని. అంతకుమించి రాణిగారి గుర్తింపు కొనసాగకపోవడంతో రెండడుగులు వెనక్కు జరిగాడే గానీ, మాటలు వినిపించనంత దూరం జరగలేదు.

"ఏ స్టేషన్‌లోనైనా ప్లాట్‌ఫామ్ మీద రెండు సిమెంటు బెంచీలుంటాయి. ఇక్కడ అవైనా లేవు. వెయిటింగ్ రూములోకి వెళ్దాం రండి. కనీసం అక్కడ రెండు కుర్చీలైనా ఉన్నాయి. రండి" అంటూ అధికారం కనబరచే ధోరణిలో చెయ్యూపింది. నేను పిల్లిలా అనుసరించాను. ఆమెది ఎదుటి

## కొత్తగాలి...

**చావుదెప్పుడూ దౌర్జన్యమే**
**తన్నుకు పోతుంది వేవేగ**
**జీవితం కోడిపిల్లయితే**
**చావు ఓ డేగ**

– పాయసం సుబ్రహ్మణ్యా మహర్షి, నెల్లూరు

మనిషిని శాసించే ధోరణి. కాసింత ఎడంగా స్టేషన్ మాస్టారు దొంగలాగా అనుసరించాడు.

వెయిటింగ్ రూము వెలుపలికి ఆమె రెండు కుర్చీలను పట్టుకొచ్చింది. ఆమెను వారిస్తూ, "ఇలా ఇవ్వండి" అన్నాను. నా సౌహార్ద్రతను ఆమె పట్టించుకోలేదు.

"అతన్ని చూశారు గదా, అతని సంగతులన్నీ చెప్పండి" అంది.

"అంత వివరంగా నాకు తెలీదు. మాది కేవలం కొన్ని క్షణాల పరిచయం. అంతగా నేను పట్టించుకునేందుకు కారణం ఏమంటే.."

నన్ను పూర్తి చెయ్యనీకుండా అడ్డుకుంటూ ఆమె, "అతడు ఎక్కడున్నాడో తెలుసుకోవడమే నాకు ప్రధానం" అంటూ నిశితంగా చూసింది.

"నా జేబులో మాత్రం లేడు" తేలిగ్గా నవ్వేందుకు ప్రయత్నించాను.

"టౌనుహాలు లైబ్రరీలో మేము కలిసింది పదిహేను నిమిషాలకు మించదు. దేన్ని గురించో లైబ్రరీలో వెదుక్కునేందుకు వచ్చాడు. నా మూలంగా తన పని కుంటుబడేందుకు ససేమిరా అన్నాడు"

"నిజమా? చదువు మీద అంత శ్రద్ధ చూపుతున్నాడు? పోనీలే, ఆ అలవాటైనా నిలుపుకోవడం సంతోషమే" అంటూ ఎగతాళిగా నవ్వింది.

ఆ వెంటనే ఆమె గంభీరంగా మారిపోయి, "ఇప్పుడతడు ఎక్కడ దొరుకుతాడో తెలుసుకోవడం నాకు చాలా అవసరం. చిన్న ఆచూకీ ఇస్తే చాలు, పారితోషికం ఎంతైనా ఇస్తాను" అంది.

నొచ్చుకుంటూ, "పారితోషికాలకు ఆశపడే మనిషిని కాను. వాటిమీద బతికే అవసరం నాకు కలగలేదు" అన్నాను.

వీలైనంత ఎడంగా నిలబడి మా సంభాషణ వింటున్న స్టేషన్ మాస్టారు కలగజేసుకుంటూ, "ఆయన లక్షాధికారి. కబీర్‌వీధి కుటుంబం ఆయనది" అన్నాడు.

"స్టేషన్ మాస్టారుగారూ, మీకు వేరే పనేం లేదా? " అంది ఆమె.

స్టేషన్ మాస్టరు కుంచించుకుపోయి, చూపుకందకుండా మాయమయ్యాడు. అతన్తోపాటు పోర్టరూ అంతర్ధానమయ్యాడు.

"క్షమించండి. నాకు ఆలస్యం అవుతోంది. టింబక్టో అనే మాటను వాడటం మినహా అతన్లో నాకు ఏ ప్రత్యేకతా కనిపించలేదు. ఆ మాట ఆసక్తి కలిగించే వార్తగా ఉపయోగపడుతుందని ఒక జర్నలిస్టుగా ఆలోచించాను. ఆ తరువాత అతడు ఏమైనాడో నాకు తెలీదు. అతని తరువాత మజిలీ గురించి నేను విచారించలేదు. ఇంతకుమించి నా దగ్గర సమాచారం లేదు. దూర ప్రయాణం వెళ్ళే బస్సులను గురించి అతడు వాకబు చేస్తుండగా విన్నాను. ఈ ఊర్లో ఉండివుంటే నాకు కనిపించకుండాపోయే ప్రసక్తే లేదని చెప్పగలను" అన్నాను.

ఆలోచనలకు పగ్గం బిగిస్తూ మళ్ళీ, "మీ సమయం ఇక్కడ వృథా చేసుకోకుండా, మద్రాసులోనో లేదా అలాటి మరో నగరంలోనో వెదికితే మంచిదని నా సలహా" అంటూ లేచి, నేను కూర్చున్న కుర్చీని గదిలోకి చేర్చి, 'గుడ్‌నైట్' చెప్పి బయలుదేరాను. వెంటపడుతుందేమోనని సందేహిస్తూ భుజాల మీదుగా వెనక్కు తిరిగి చూసుకుంటూ గబగబా నడిచాను. నేను నిష్క్రమించడాన్ని నిశ్శబ్దంగా గమనిస్తూ ఆమె కుర్చీలో కూర్చుండిపోయింది.

నాలుగైదుసార్లు తట్టిందాకా రాన్ గది తలుపు తెరవలేదు. ఆ రోజు ఉన్నాడు. తలుపు తీసి, నేనేదో అతని పనికి ఆటంకం కలిగిస్తున్నట్టు ముఖం చిట్లించాడు. అతడు నా యింట్లో అతిథి. సబబైన కారణం లేకపోయినా ఆశ్రయం

ఇచ్చాను. రైల్వేస్టేషన్ వెయిటింగ్ రూములో సుభిక్షంగా వృద్ధిపొందే నల్లుల బారినుండి బయటపడనీ పాపం, అనే జాలి ఆ క్షణంలో కలగడంతో ఈ సహాయం చేశాను. అది గుర్తించుకోకుండా అతడు ఏకాంతాన్ని భగ్నం చేసిన సర్వర్ కుర్రాణ్ని హోటల్ గదిలో దిగిన అతిథి ఎలా చూస్తాడో అలా చూస్తున్నాడు.

"అంతరాయం కలిగించొద్దు- అనే హెచ్చరికబోర్డు తలుపుకు తగిలించివుంటే సరిపోయేదిగదా. నీ ప్రయాణాల్లో మకాం వేసిన ఏదోవొక హోటల్లో అలాటి హెచ్చరిక వుండే బోర్డును ఇచ్చుంటారే? "

> **కొత్తగాలి...**
>
> **నాకు ఎంతో గర్వం**
> **ఆస్తి ఉందని కాదు**
> **అంతస్తు ఉందనీ కాదు**
> **భారతీయుడిగా హోదా ఉందని**
>
> – పట్ల యాదగిరి,
> *గుండాల, నల్గొండజిల్లా*

అతడు గతుక్కుమన్నాడు. "ఏం, అలా అడిగావ్? " అన్నాడు.

"ఏంలేదు పనిలో కూరుకుపోయినట్టు ఉంటేనూ" అన్నాను ఎగతాళిగా. అతడు పనిలో లేడని నాకు తెలుసు. పనీపాటా లేకుండా, అపాత్రదానంగా నేను సమర్పించుకున్న నా తాతలనాటి పడకకుర్చీలో తీరుబడిగా పడుకొనున్నాడని తెలుస్తూనే వుంది. ఐనా తలుపు బిగించి, ఏదో పనిలో ఉన్నట్టు నాటకాలేస్తున్నాడు. బల్ల మీద కాగితాలేవీ లేవు. పడకకుర్చీ పక్కన గానీ, మరోచోటగానీ పుస్తకమేదీ కనిపించలేదు. ఉబుసుపోక, వాసాలు చూస్తూ కూర్చుని, నన్ను.. నల్లులవాత పడకుండా తనని కాపాడిన నన్నే ముఖం చిట్లించి చూస్తాడా? నేను చెప్పబోయే సమాచారం వింటే అతని విదేశీవాలకం, అతని ఆడంబరం కుప్పగూలి, నెత్తురుచుక్క లేకుండా పాలిపోయిన అతని ముఖం చూసి కలుగబోయే సంబరాన్ని ఊహించుకుని నా కోపాన్ని శాంతింపజేశాను.

తలుపు దగ్గర నిలబడి 'నీ కోసం ఎవరో ఆడమనిషి వచ్చింది' అనే ముక్క మాత్రం ప్రకటించి, వెనక్కు తిరిగి, మర్యాదకోసం గదితలుపు మూసి, తిన్నగా పెరట్లోకి నడిచి, స్నానాల గదిలో దూరి గొళ్లెం బిగించాను. తలుపు తెరుచుకుని, దాన్ని అలాగే వదిలేసి, అతడు నా వెన్నంటివచ్చాడని చూసిగూడా, స్నానాలగదిలో వీలైనంత ఆలస్యం చేశాను.

తలుపు తెరవగానే అతడు అక్కడే నిలబడి కనిపించాడు. ఓ వంద ప్రశ్నలు ముఖంలో కనిపిస్తున్నాయి. ముఖం పాలిపోయింది. తొడుక్కున్న కిమోనోలో శరీరం కుంచించుకుపోయింది. వాస్తవంగా అక్కడికి నేను వెళ్లింది స్నానం చేయడానికి గాదు, అతన్ని ఉడికించేందుకే. తల తడుపుకుని బయటికి వచ్చాను. విస్తుపోయినట్టు, 'అయ్యో' అనేసి, గబగబా నడుచుకుంటూ పెరడు దాటుకుని నా గదికి వచ్చాను. అతడు నా వెనకాలే వచ్చాడు. నా బట్టలుగానీ, ఇతర సామగ్రిగానీ ఎప్పుడూ ఒకే గదిలో దొరకవు. ఆ గదిలో కొన్నీ, ఈ గదిలో కొన్నీ ఇంటినిండా చెల్లాచెదురుగా పడివుంటాయి. నాకు ఏది కావాలన్నా వెంటనే దొరకదు. ఒక గదిలో టవలుంటే, మరో గదిలో జేబురుమాలు, ఇంకో గదిలో ట్రౌజరు ఉంటాయి. తడిచిపోయిన తలనుండి కళ్లమీదుగా నీళ్లు ఓడుతూంటే చికాకుగా ఉంది.

"నా టవల్ ఎక్కడ? " అంటూ బిగ్గరగా

వేసిన కేకకు రాన్ తన గదికి పరిగెత్తుకెళ్లి ఉతికిన టవల్‌ను తీసుకొచ్చాడు. నా అధికార ప్రదర్శనకు లోలోపల మురిసిపోతూ, వినిపించీ వినిపించకుండా 'థ్యాంక్స్' చెప్పి, తలా ముఖమూ తుడుచుకున్నాను. అప్పుడు మేము నడవాలో నిలబడివున్నాం.

"ఉతికేయించి రేపు వాపసు పంపిస్తా" అన్నాను.

"ఓహ్! అంత మించిపోయిందేమీ లేదు" అన్నాడు రాన్.

"చాలా మెత్తగానూ, పటిష్ఠంగానూ ఉంది" అంటూ దాన్ని నా చేతుల పొడవునా చాచి, లోగిలిలో ప్రసరిస్తున్న వెలుతురుకు పట్టుకున్నాను. దానిమీద ఎంబ్రాయిడరీ చేసిన 'నెవెల్లీ' అనే అక్షరాలను పైకి వినిపించేలా చదివి, "ఏమిటిది? " అన్నాను.

"రొడేషియాలో ఒక హోటలు జ్ఞాపకార్థం కస్టమర్లకు వాళ్ళిచ్చే కానుక".

ఎత్తుకొచ్చిందై వుంటుదని నా అనుమానం.

"అక్కడ ఎన్ని రోజులు ఉన్నావ్? "

"ప్రాజెక్టు పనిమీద అప్పుడపుడు వెళ్లేవాణ్ణి"

"నల్లవాళ్లకు అక్కడ కష్టంగా ఉంటుందని విన్నాను"

"ఓc, అదంతా అతిశయోక్తి. వాటిని నమ్మే అవసరం లేదు. పైగా ఐక్యరాజ్యసమితి గుర్తింపు కార్డును ఎక్కడా అడ్డుకునే ప్రసక్తి రాదు గనక, ఆ సమస్యే నాకు ఎదురవ్వలేదు"

ఆ ఆడమనిషి గురించి ఏవేవో అడగాలనివున్నా, అతడు అడిగేందుకు తటపటాయిస్తున్నాడని తెలిసి గూడా, రొడేషియా గురించి మరిన్ని వివరాలు అడుగుతూ ఉడికించాలని నా ఉబలాటం. కానీ కంగారుగా, ఇరకాటంగా, వింతైన కిమోనో దుస్తుల్లో కుదేలవుతున్న ఆ మనిషిమీద ఉన్నట్టుండి నాకు జాలి కలిగింది.

"ఆమె ఎవరో తెలుసుకోవాలనుకుంటున్నావా? " అన్నాను సూటిగా.

"ఔనౌను" అన్నాడు ఊపిరి గట్టిగా పీల్చుకుంటూ.

"నాకసలు అర్థమే కావటం లేదు. ఇంతకూ ఎవరావిడ? " అన్నాడు తేరుకుని.

"నీ పోలికలు కనిపించే ఫొటో ఆమె చేతిలో కనిపించిందని స్టేషన్ మాస్టారు అన్నాడు"

"అయ్యో!" అంటూ మూలిగాడు అసంకల్పితంగా.

"వార్తాపత్రికలో వచ్చిన నీ ఫొటోకు అది సరిపోలింది"

"నా ఫొటో వార్తాపత్రికలో ఎలా వచ్చింది? "

"పత్రికలోళ్ళకు ఏవేవో మార్గాలుంటాయి మరి"

"ఆమె ఎలా వుంటుంది? "

"నన్ను అడుగుతున్నావా? ఆడవాళ్లవైపు తదేకంగా చూసి అంచనాలు వేసుకునే అలవాటు నాకు ఎప్పుడో తప్పిపోయింది. అందువల్ల ఆమెను గురించి అంతగా వివరించడం నాకు చేతగాదు. సరే- నేను దుస్తులు మార్చుకుని నీ గదికే వస్తాను. కాస్సేపుండు"

గదిలో గిజగిజలాడుతూ అతడు నా కోసం ఎదురుచూస్తున్నాడు. తీరుబడిగా నేను దుస్తులు మార్చుకుని, దీర్ఘవృత్తాకారంలో ఉండే అద్దం ముందు నిలుచుని- ద్రాక్షతీగ తొలిచిన బంగారు రంగు ఫ్రేములో ఉండే అద్దం ముందు నిలుచుని- అది బహుశా, మా జేజి పెళ్లికూతురు లాంఛనంగా తీసుకొచ్చిందై ఉండొచ్చు. కాకపోతే పైన్నుండి కిందిదాకా ఆ నల్లమచ్చలూ, పొడలూ ఎందుకొస్తాయి? అలాటి అద్దంముందు నిలుచుని, నింపాదిగా తల దువ్వుకున్నాను. ఆ

విధంగా అవసరంలేని స్నానంతో తాజాగా తయారై, చొక్కా ధోవతులు ధరించి, చొక్కా చేతులు రెట్టలమీదికి ముడుచుకుని, ఈ భూలోకంలోని ఏ చక్రవర్తి ఎదురుగా నిలిచేందుకైనా తగినంత దర్జాగా తయారయ్యాను. ఇక అతని గదికేసి బయలుదేరాను.

తలుపు తెరిచి ఉంచేంత ఇంగితం అతనికి అలవడినందుకు సంతోషించాను. కుర్చీలో కూర్చుని అతడు పడే ఆపసోపాలు గమనించాను. నేను కంట పడగానే అతడు కుర్చీనుండి లేచి నిలుచుని, నాకు మరో కుర్చీ చూపించాడు. నేను కూర్చునే దాకా అతడు కాచుకుని నిలుచున్నాడు. ఇప్పుడు అతన్తో మాట్లాడేందుకూ, సమాచారం.వినిపించేందుకూ నాకు మనసైంది.

"తపాలా పంపేందుకు రైల్వేస్టేషన్‌కు వెళ్లినప్పుడు నాకు ఒక ఆడమనిషి కనిపించిందని ఇందాక చెప్పానా.."

ఆ మనిషి ఆకారం తెలుసుకునేందుకు అతడు హైరానా పడుతున్నాడని నాకు తెలుసు.

"మనిషి బాగా ఎత్తా?" అడిగాడు గాలంవేస్తూ.

"ఉండొచ్చేమో" అన్నాను సందిగ్ధంలో పెడుతూ.

"మధ్యస్తంగా ఉండొచ్చా?"

"పొట్టిగా మాత్రం లేదు. దూరంనుండి చూశాను"

"బాగా దూరంలో ఉండిందా?"

నాకు మండుకొచ్చింది.

"కొలబద్ద తీసుకెళ్ళడం మరిచిపోయాను" అంటూ కసిగా చెప్పి, నవ్వులాట అన్నట్టు కనిపించేలా ఇకిలించాను.

అతడు చిన్నబుచ్చుకోవడం చూసి ఉసూరనిపించి, "ఎందుకంత ఇదైపోతున్నావు?" అన్నాను జాలిగా.

"ఎందుకంటే- ఎందుకో నాకే తెలీడం లేదు. రైల్వేస్టేషన్‌కు ఎంతోమంది వస్తుంటారు, పోతుంటారు. వాళ్లతో నాకేం పని?" అన్నాడు.

"అదీ ధైర్యమంటే! అలావుండు. పద మరి, బోర్డులేని హోటల్‌కు వెళ్ళొద్దాం. దాంతో నువ్వు కొంచెం కోలుకోవచ్చు"

నా సలహా అతన్ని మరింత ముడుచుకుపోయేలా చేసింది. ఆ ఆడమనిషి దారిలో ఎదురై ఎక్కడ అటకాయిస్తుందోనని అతని అనుమానం. ఏవేవో తిప్పలు బడి ఒప్పించాను. వెళ్లేందుకు ఎలా సింగారించుకోవాలనే ఆలోచన అతనికి ఒక పట్టాన తెగిందిగాదు.

"బోర్డులేని హోటల్ ప్రత్యేకత నీకు తెలీదు. అక్కడికి నువ్వు చక్రవర్తి దుస్తుల్లో వచ్చినా ఒకటే, లంగోటాలో వచ్చినా ఒకటే. ఆ గుంపులో నిన్ను పట్టించుకునే నాథుడే కనిపించడు. గమనించేవాడూ ఉండడు, అడిగేవాడూ ఉండడు" అంటూ నా సలహా అందించినా, అతడు ఎంతోసేపు వితర్కించి, బూడిద రంగు ఉన్ని ట్రౌజరు, రోజారంగు పొట్టిచొక్కాలో ముస్తాబయ్యేందుకు తీర్మానించుకున్నాడు.

కాలినడకన బోర్డులేని హోటల్ చేరుకున్నాము. నేను మామూలుగా కూర్చునే మహిషాసురుని క్యాలెండర్ ఎదురుగా అదనపు కుర్చీ వేయించి కూర్చున్నాము. కస్టమర్లు ఈ వింతమనిషిని చూసేందుకు ఒక్కక్షణం కేటాయించి, ఎవరి టిఫిన్లలో వాళ్లు, ఎవరి కాఫీల్లో వాళ్లు, ఎవరి కబుర్లలో వాళ్లు మునిగిపోయారు.

దోసె, కాఫీలకు ఆర్డర్ చేశాను. అవి అతనికి అంతగా రుచించినట్టు లేదు. ఏదో అంతర్మథనంలో మునిగివున్నట్టు కనిపించాడు. హోటల్ యజమాని వర్మ మా దగ్గరికొచ్చి, పరిచయపూర్వకంగా 'హలో' అన్నాడు. ఈ వింత మనిషి రాకతో తన హోటల్‌కు అంతర్జాతీయ హోదా కలిగిం

దనే ఊహతో అతడు ఉబ్బిపోయాడు.

"చాలా గొప్ప పండితుడు. పనిమీద ఇక్కడికొచ్చాడు" అంటూ వింతగా ధ్వనించే 'టింబక్టో'ను ఉచ్చరించకుండా పరిచయం చేశాను.

ఏదో వొకవిధంగా ఈ వింతమనిషిని మా సమాజంలో విలీనం చేసి, అతని కిమోనో దుస్తులనూ, ఇంట్లో వేసుకుతిరిగే స్లిప్పర్లనూ మానిపించే ప్రయత్నంలో భాగంగా కొద్దిదూరం అతడు నాతోపాటు నడిచివచ్చేందుకు ప్రోత్సహించాను. మా నడక అంత సజావుగా సాగలేదని వేరుగా చెప్పే అవసరం ఉండదు. దారిలో ఎదురయ్యే ప్రతివొక్కరు మావైపు విచిత్రంగా చూడకుండా అడ్డుకోవడం ఎవరి తరం?

దయ్యంలాగా రైల్వేస్టేషన్‌లో దిగిపోయిన ఆ ఆడమనిషంటే ఉన్న బెదురు రాన్‌ను నాకు సన్నిహితంగా పట్టుకొచ్చింది. బయటపడే రకం కాకపోయినా, సమాచారం కోసం నామీద పూర్తిగా ఆధారపడినట్టు తెలిసిపోయింది. ఏదోవొక శుభవార్త- ఆమె హఠాత్తుగా ఏదో రైలెక్కి వెళ్లిపోయిందనో, అర్ధరాత్రి గూడ్సు బండి కింద తల దూర్చిందనో- తనకు ఊరట కలిగించే ఏదోవొక వార్త, మోసుకురాబోతున్న దూతగా అతనికి నేను కనిపిస్తున్నాను. 'ఏదైనా శుభవార్తా? గూడ్సు బండి క్షేమమేగదా? దానికింద ఏదీ పడలేదనుకుంటా?' అంటూ అడగబోయేంత ఆదుర్దాతో నా రాకకోసం నిరీక్షిస్తున్నాడు. ఇదివరకు గదిలో కూర్చుని తలుపులు బిగించుకునేవాడు ఇప్పుడు గదితలుపు బార్లా తెరిచి.. అతని కనుగప్పి నేను ఇంట్లోకి జారుకోకుండా పహరా కాస్తున్నాడు. ఇంట్లో నేను తిరిగేప్పుడు నా కదలికలను రహస్యంగా గమనిస్తున్నాడు. ఆ గూఢచర్యకు అతడు పడకకుర్చీ వేసుకున్న స్థలం అద్భుతమైన వేదిక. అక్కడ కూర్చుంటే, ఇంట్లో ఏ మనిషి ఎక్కడ తిరిగినా కనిపిస్తుంది. బహుశా మా తాతలూ, తండ్రులూ ఈ కీలకమైన తావునుండే కుటుంబం మీద, ముఖ్యంగా పటాలం పరిమాణంలో వుండే పరిచారకులమీద, ఎప్పుడూ ఒక కన్నేసి ఉంచేవాళ్లనుకుంటా. రాన్ ఆ సదుపాయాన్ని పసిగట్టాడు. నేను వచ్చేప్పుడు వెళ్లేప్పుడూ నవ్వు ముఖంతో పలకరిస్తున్నాడు.

"గుడ్ మార్నింగ్ వ.పి. యథాప్రకారం చక్కర్లకోసం బయలుదేరుతున్నట్టుంది" అంటాడు. ఒక్కోసారి ఏమీ మాట్లాడకుండా, తల ఎగరేసి మందహాసం చేస్తాడు. 'ఏదైనా ఉంటే చెప్పకుండా ఊరుకుంటాడా? తప్పకుండా చెబుతాడు. దాచుకోలేడు' అనే ధీమా వచ్చింది కాబోలు.

మొత్తంమీద మునుపటి బిగువును సడలించుకుని అతడు దారిలో పడినట్టు కనిపించింది. ఆ చనువునూ, తలుపు ఓరగా తెరిచుంచే విధానాన్నీ అవకాశంగా తీసుకుని, అప్పుడప్పుడు అతని గదిలోకి యథేచ్ఛగా వెళ్లి కాస్సేపు పిచ్చాపాటి నడుపుతున్నాను.

పడకకుర్చీలో సుఖంగా నేను కూర్చోనుంటే, అద్దెకు తెచ్చుకున్న చెక్కకుర్చీమీద అతడు అసౌకర్యంగా కదలాడుతూ, బల్లమీది కాగితాలను చదువుకుంటున్నట్టు

---

## కొత్తగాలి...

**పాలదెంత సహృదయత**
**తనలో నీళ్లు కలిసినా**
**భరిస్తుంది ... తనను**
**నీళ్లపాలన్నా సహిస్తుంది**

- ఎస్.కె. నాగేశ్వరరావు,
పెనుగొండ, ప.గో. జిల్లా

---

నటిస్తుంటాడు. వాటిని పక్కకు నెట్టి, కుర్చీ నుండి లేచి, బోనులో తిరుగాడే ఎలుగు బంటికిమల్లే, ఆ చిన్నగదిలో అటూ ఇటూ పచార్లు చేస్తాడు.

కొద్దిసేపు అతన్ని అలా తిరగనిచ్చి పావుగంట మౌనంగా గడిపి, ఆ తరువాత- "ఏదో ఆందోళనగా ఉన్నట్టున్నారు. ఎందుకని? " అన్నాను.

"అబ్బే, అదేం లేదు. తయారుజేస్తున్న నివేదికలో చిన్న సమస్యాస్తే ఆలోచించు కుంటున్నాను"

"ఐతే నా గొడవెందుకూ, నిన్ను ప్రశాంతంగా..."

"అహఁహఁహఁ- అంత తొందరేం లేదు"

అతడు ఏదో చెప్పాలనుకుంటున్నాడు గానీ, మొదలుబెట్టేందుకు వెనకాడుతున్నాడనీ, లేదా ఎలా మొదలెట్టాలో తెలీక తికమక పడుతున్నాడనీ నాకు అనిపించింది.

"రోజంతా ఇక్కడే సుఖంగా కూర్చుని బడలిక తీర్చుకునేందుకు నాకైతే అభ్యంతరం లేదు. ఏదోవొక కొలిక్కి తీసుకొచ్చే బాధ్యత ఉండేది నీ మీదే... అదే, ఆ ఆడ మనిషి విషయంగా" అన్నాను.

"ఆ గొడవ నాకెందుకు? వందలమంది రైల్వేస్టేషన్‌కు వస్తుంటారూ పోతుంటారు" అన్నాడు రాన్.

"నిజమే గానీ, వాళ్ళ దగ్గర నీ ఫొటో ఉండదు. నిన్ను గురించి వాళ్ళు వాకబు చేసేదీ ఉండదు"

అతని ముఖం కందగడ్డలా ఎర్రబడింది. "ఎందుకు నాకీ నరకం? " అంటూ బిగ్గరగా అరిచాడు. అతని గాద్గద్యం నా చెవులకు సంగీతమైంది.

"పైగా, ఆమె నీ పెళ్ళాన్నని ప్రకటిస్తూ కూర్చుంది"

"పచ్చి అబద్ధం" అంటూ పిచ్చిగా కేకేసి, మరింత వేగంగా అతడు పచార్లు కొనసాగించాడు. అలాటి మానసిక దుస్థితిలో అతన్ని ఇదివరకు ఎప్పుడూ చూడలేదు. అతడు నోరు జారడం గూడా వినలేదు. అతడు తన మెదడుకు చుట్టూ బిగించుకున్న చట్రంలోని మరమేకులు ఆ వనితకు సంబంధించిన ఆందోళన మూలంగా వదులైనట్టు కనిపించింది.

"హెక్యూబాకు అతడు ఏమవుతాడు? లేదా, హెక్యూబా అతనికి ఏమవుతుంది? " అన్నాను పరాచికంగా.

"ఆమె పేరు హెక్యూబానా? ఆ పేరుండే మనిషే నాకు తెలీదు"

"ఇది నీ గురించి కాదు. షేక్స్పియర్ నాటకంలోది"

"ఔనౌను, షేక్స్పియర్‌ది గదా! అది నాకు జ్ఞాపకం రాలేదు. చదివి చాలా రోజులైంది. ఆక్స్‌ఫర్డ్‌వాళ్ళు ప్రచురించిన సంపుటాన్ని శీర్షిక మొదలు చివరిదాకా వదలకుండా పూర్తిజేశానంటే నమ్మగలవా? "

"ఐనా బాలకా, ఏ టక్కులాడి ప్రసక్తి వినిపించినా నీ పటుత్వం నీరైపోతుంది"

"నాకు పిచ్చెక్కడం ఖాయం. ఏదోవొకటి చేసి ఆమెను తరిమేసెయ్"

"ఎందుకని? ఏ మనిషైనా వచ్చేందుకూ పోయేందుకూ నివసించేందుకూ స్వేచ్ఛను అంగీకరించే పట్నమిది. ఆమె ఎవరైనా కావచ్చు, దౌర్జన్యంగా గెంటివేసే అధికారం నా చేతుల్లోకి తీసుకోమంటావా? మళ్ళీ ఆమె నాకు కనిపిస్తే..."

"ఆమె ఎలా ఉంటుదన్నావ్? " మధ్యలో అడ్డుకుని అడిగాడు.

నిజంగా ఆమె అతనికి పెళ్ళామే అయ్యుంటే- అడ్డగోలుగా మాట్లాడటం సభ్యతగా ఉండదు గాబట్టి, టూకీగా-

"చెప్పాలంటే, ఆకర్షణీయంగా ఉండనాలి. కొంచెం నలుపైనా, చాలా నిండైన విగ్రహం. కాస్తా భారీగా ఉండొచ్చని నా అనుమానం. బహుశా ఆ నీలం జీన్స్‌లో,

టీషర్టులో, కత్తిరించిన జుత్తులో మరింత భారీగా కనిపించేదేమో! ఆమె దర్పానికి స్టేషన్‌మాస్టారు ఖంగుతిని, అడిగిందే తడవుగా వెయిటింగ్‌రూము తలుపులు తెరిచాడు...."

"నేనడిగితే అంత యాగీ చేసిన మనిషి! చాలా తమాషైన శాల్తీ కదూ? ఆమె తన మొగుడి పేరు అతన్తో చెప్పలేదా?"

"నాకెలా తెలుస్తుంది? నీ ఫొటోను మొట్టమొదటిగా చూసింది అతడేనని మాత్రం తెలుసు"

"ఘోరం!" అంటూ ఇల్లు ఎగిరిపోయేలా కేకేసి, "నువ్వు నన్ను నిలువునా ముంచేశావు" అన్నాడు నిష్ఠూరంగా.

"పొరబడుతున్నావు. అయాచితంగా నీకు నేను అరుదైన సహాయం చేశాను. పేర్లను అచ్చులో చూసుకునేందుకు మోజుపడి నా చుట్టూ తిరిగేవాళ్ళు ఎందరున్నారో తెలుసా?"

"పంపేముందు నాతో సంప్రదించడం నీ కనీస ధర్మం"

"విలేఖర్ల సంప్రదాయానికి అది విరుద్ధం. పత్రికా స్వాతంత్ర్యమంటే అదే. ప్రధానమంత్రైనా సరే, పత్రికలో తన పేరు చూసి నోరెత్తేందుకు వీలుండదు"

"అది సరే.. అందులోకి ఫొటో ఎలా వచ్చింది?"

"నాకెలా తెలుస్తుంది? నువ్వు ఎక్కడెక్కడో తిరుగుతున్నావు.. ఎవడో ఒకడు లాగేసుకుంటాడు"

గంటసేపు ఇలా తర్జన భర్జన జరిగిన తరువాత, ప్రాధేయపూర్వకంగా అతడు, "నమ్మకద్రోహం చెయ్యొద్దు. మొదటి నుండి నామీద సానుభూతి చూపిస్తున్నావు. టీషర్టు, జీన్స్‌లో వచ్చిన ఆ మనిషి ఎవరైనా కానీగాక, ఇప్పుడు ఇక్కడ నేనుండేది ఆమెకు తెలీకుండా నన్ను కాపాడు. "ఆమె ఈ దేశస్తురాలేనా?"

"సమయం రాగానే మొత్తం నీకు చెప్పే

## ధన్యవాదాలు




**డా. ఎం. వి. రమణారెడ్డి**


పుట్టింది 1944 ఏప్రిల్ 4న. పాఠశాల విద్యనభ్యసించింది ప్రొద్దుటూరు మున్సిపల్ స్కూల్‌లో. తర్వాత గుంటూరు మెడికల్ కాలేజీలో ఎం.బి.బి.ఎస్, ఆ తర్వాత లా కూడా చదివాను. 1966లో మిత్రులతో కలిసి 'కవిత' మాసపత్రికకు సంపాదకుడిగా ఉన్నాను. 1969 నుండి 70 వరకు 'ప్రభంజనం' పక్ష పత్రికను స్వయంగా నిర్వహించాను. డా. హార్న్‌గారి 'అవే విత్ ఆల్ పెస్ట్స్'ను 'పురోగమనం'గా, షెరియర్ గారి 'పాపియన్' నవలను 'రెక్కలు చాచిన పంజరం'గా, మిచ్చెల్‌గారి 'గాన్ విత్ ద విండ్' నవలను 'చివరకు మిగిలింది?'గా అనువదించాను. ఇక 'తెలుగు సినిమా స్వర్ణయుగం', 'ఆయుధం పట్టని యోధుడు', 'తెలుగింటికొచ్చిన ద్రౌపది', 'పరిష్కారం' కథల సంపుటి, 'రాయలసీమ కన్నీటి గాథ' మొదలైనవి నేను చేసిన స్వతంత్ర రచనలు. 'టాకేటివ్‌మ్యాన్'ను 'మాటకారి' పేరుతో అనువాదం చేశాను. దీన్ని ప్రచురిస్తున్నందుకు చతురకు ధన్యవాదాలు.


చిరునామా:
**డా.ఎం.వి.రమణారెడ్డి,**
రాయవరం, ఖాదరాబాద్ పోస్ట్,
ప్రొద్దుటూరు-516362,
కడప జిల్లా

స్తాను. ఇప్పుడు కాదు. ఇప్పటికి ఇంత కంటే నన్ను ఏమీ అడగొద్దు"

"ఏది ఏమైనా, ఆమె ఎల్లకాలం వెయిటింగ్‌రూములో ఉండబోదుగదా. ఏదో వొకరోజు ఖాళీ చెయ్యక తప్పదు. కొంత కాలం బయట తిరగడం కాస్తా తగ్గించు" అన్నాను అతనికి ధైర్యం ఎక్కిస్తూ.

"నా వ్యాపకం ముగించుకునేందుకు నేను కోరేది మానసిక శాంతి. ఆ కారణం గానే నువ్వు ఏర్పాటు చేసిన ఈ నివాసం, ఇంకా చెప్పాలంటే నీ ఆశ్రయం నాకు చెప్పలేనంత విలువైంది. నా పుస్తకం పూర్తయ్యేదాకా చీపురుపుల్లెత్తు అంత రాయం కలగ్గూడదు. నా కృషికి సహకరించే మనిషి నా శ్రేయోభిలాషి. ఈ పుస్తకానికి మించి, నా జీవితానికి విలువైంది మరొకటి లేదు. అచ్చయిందనుకో- అదే క్షణంలో సంచలనం సృష్టిస్తుంది. ప్రపంచ దృక్పథాన్నే మౌలికంగా మార్చేస్తుంది. ఈ తరం సిద్ధాంతకర్తలను కుదిపేస్తుంది. నీ అతిథ్యానికీ, నువ్వు కల్పించిన ఆశ్రయానికీ విలువ ఇస్తున్నానంటే కేవలం ఈ దృష్టి తోనే. దీన్ని ప్రచురించేటప్పుడు నీ సహాయానికి తప్పకుండా గుర్తింపు ఉంటుంది"

"అబ్బో, నా పేరుగూడా అచ్చులో వస్తుందన్నమాట! అమోఘం! ఎవరెవరి పేర్లో అచ్చులో వచ్చేలా చూసేదే వృత్తిగా పెట్టుకున్న నాకు, అది మొదటి అనుభవంగా మిగిలిపోతుంది. ఎంత అద్భుతం! ఇంతకూ నా పేరేదో నీకు తెలుసా? వ.పి. అనే అక్షరాలను మించి, నా పూర్తి పేరు నీకు తెలియదు. ఇప్పటికి ఈ చర్చ వాయిదావేసి, బోర్డులేని హోటల్‌కు వెళ్దామా? అక్కడికి నువ్వొచ్చింది ఒకేవొక సారి. ఇప్పుడు నాకు ఆకలిగా ఉందిగూడా"

అతడు తటపటాయించాడు.

"బయటికి కనిపించాలంటే భయంగా ఉందనుకుంటా" అంటూ నిర్ణయం అతనికే వదిలేశాను.

"భయపడే అవసరం నాకేమొచ్చింది? ఈ ప్రపంచమే దుర్మార్గమైన ప్రపంచం. ఇలాటివెన్నో చాలాచోట్ల చూశాను. దేనికైనా నేను జంకేవాణ్ణి కాదు. స్నేహపూర్వకంగా 'క్షేమమా' అని అడిగేంత చనువు చూపితే చాలు. ఏ హోటల్లోనో విమానంలోనో ఉద్యోగం చేసుకునే ఆడమనిషి నిన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యొచ్చు. ప్రపంచమంతా అలా మారిపోయింది. ఇలాటివాటికి బెదురుకునేంత పిరికితనం నాలో లేదు"

"అంటే, నీ అనుభవం అపూర్వమన్న మాట! ఐతే నాతో వచ్చెసెయ్. ఆ మనిషి ఎదురై నిలదీస్తే, ధైర్యం కూడగట్టుకుని, 'దరిద్రపుగొట్టు పిశాచమా, నా ముందు నుంచి తక్షణం ఫో వెళ్లిఫో, నువ్వెవరివో గూడా నాకు తెలీదు అనేసేందుకు ఇబ్బంది లేదుగదా? "

"ప్రస్తుతం నిన్ను షేక్‌స్పియర్ ఆవహించినట్టుంది. నేను గూడా ఒకప్పుడు షేక్‌స్పియర్‌ను చదివి ఆనందించినవాణ్ణే" అన్నాడు.

అతన్లో భీతి తగ్గుతున్నందుకు సంతోషించాను. పెళ్ళాం నుండి అతనికి రక్షణ కల్పించాలని సంకల్పించుకున్నాను.

★ ★ ★

కబీర్ వీధికి దారి తెలుసుకుని ఆమె ఎలా రాగలిగిందో తెలుసుకోవడం ఎన్నటికీ ఛేదించలేని రహస్యం. ఒకరోజు మధ్యాహ్నం హఠాత్తుగా ఆమె నా ఇంటి ముందు నిలబడింది. ఆమె వేషం, వాలకం మా పరిసరాలకు పరిచయమైంది కాకపోవడంతో, వీధికి వీధంతా అరుగుల మీద చేరి విస్తుపోయి చూస్తున్నారు. అసలే భారీకాయం, ఆ తర్వాత ఆమె వేసుకున్న పంజాబీ కుర్తా, కమీజులు ఆమె ఆకారాన్ని రాక్షసంగా మార్చేశాయి. ఏ

ప్రమాణాలు తీసుకున్నా ఆమె పరిమాణం అసాధారణమే. ఆడవాళ్ళు మిలమిల మెరిసే పట్టుచీరలు కట్టి, ధగధగలాడే వజ్రాల సొమ్ములు అలంకరించుకుని నాజూకుగా తిరిగే వీధిలో ఆమె గ్రహాంతర వాసిలా కనిపించింది. జిప్సీలకుమల్లే మెడలో తెల్లపూసల దండొకటి వేసుకుంది. భుజాలమీద గులాబీరంగు వల్లెవాటు కప్పింది. గుండుమొత్తంగా వాటి ప్రభావం చూపరులను నివ్వెరపోయేలా చేసేదేనని ఒప్పుకోక తప్పదు. ఈ భద్రకాళి రూపం గుర్తుకొస్తే చాలు, రాన్ ఠారెత్తుతాడనడంలో ఆశ్చర్యంలేదు.

ఆ సమయంలో అతడు ఇంట్లో లేకపోవడం నా అదృష్టం. పొరపాటున దొర్లుకొచ్చి, అతడు ఆమె చేతుల్లో చిక్కకుంటే చాలని ఇంట్లోకి ఆహ్వానించి ఆమెను కూర్చోబెట్టాను. కిటికీ నుండి ఆమె చూపు వీధిలోకి పడకుండా ఉండేందుకు, వీధివైపుకు వీపుజేసిన కుర్చీని ఆమెకు చూపించాను. ఒకవేళ రాన్ వీధిలోకి అడుగెట్టినా ఆమె కంట్లో పడేందుకు వీలులేని విధంగా కూర్చోబెట్టేందుకు జాగ్రత్తలన్నీ తీసుకున్నాను. ఇటీవల రాన్ ఎక్కడికి వెళుతున్నాడో నాకు అంతు చిక్కడంలేదు. ఏదో పరిశోధన కోసం వెళుతున్నాడని భ్రమపడ్డాను. నా చెవికి సోకిన సమాచారాన్ని బట్టి అతని నిర్వాకం నాకు ఆలస్యంగా తెలిసొచ్చింది. ఆ వివరాలు తరువాత చెబుతాను.

"క్షమించండి. అతిథి మర్యాదలు చేయలేకపోతున్నాను. ఈ ఇల్లు నాకు కేవలం ఒక గూడులాటిది. ఇంకో ప్రాణి ఇందులో లేదు. నేను బయటికివెళ్ళి భోంచేస్తాను" అన్నాను వినయపూర్వకంగా.

నా చిరునామా ఆమెకు ఎలా దొరికిందో ఆచూకీ తీసేందుకు నేను ప్రయత్నించలేదు. స్టేషన్‌మాస్టారు చెప్పుంటాడని నా ఊహ.

"ఆ మనిషిని నాకు పట్టించడం తప్ప మరేదీ నాకు అవసరంలేదు" అంది ఆవిడ.

ఏమని జవాబివ్వాలో తోచకపోవడం తోనూ, ఏ అడుగుల చప్పుడుకు ఆమె వీధివైపు తల తిప్పుతుందోననే ఆదుర్దాతోనూ, మౌనంగా ఉండిపోవడం తెలివైన కర్తవ్యంగా ఎంచుకున్నాను. లోతులు పరిశీలించేందుకే ఆమె ఇక్కడికి వచ్చిందని నాకు తెలుసు.

"స్టేషన్‌మాస్టారు చాలా మంచోడు. అతని సహకారమే లేకపోతే ఆ వెంటనే వచ్చే రెండో రైల్లో వెళ్ళిపోయివుండేదాన్ని. ఆ ఘోరమైన గదిలో ఉండేదాన్నే కాదు. ఆ వెయిటింగ్‌రూంలో ఎన్ని నల్లులో!"

"అక్షరాలా నిజం. వాటి పోరు పడలేక

> ### కొత్తగాలి...
>
> **మీ ఇల్లే**
> **ఓ గ్రంథాలయమా?**
> **మరి మెదడలా**
> **ఖాళీగా ఉందేం?**
>
> – ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
> సికింద్రాబాద్

పారిపోవడం ఎవరికైనా సహజమే" అన్నాను, రాన్ అగచాట్లను గుర్తుకుతెచ్చుకుంటూ. ఆ ఇద్దరిమధ్య ఆ బాధ ఏకైక అనుబంధంగా తోచింది నాకు. 'నల్లి బంధం' అనే సమాసం నా మస్తిష్కంలో ప్రతిధ్వనించింది.

"ఐదు రూపాయలు ఇచ్చాను. ఆ చిన్న మేలుకే అతడు నల్లుల మందు తీసుకొచ్చి గది మొత్తం స్ప్రే చేశాడు. సగానికి సగం తగ్గిపోయాయి. ఇప్పుడంత దుర్భరంగా

లేదు. ఇంటినుండి అతడు భోజనం గూడా ఏర్పాటుచేశాడు"

ఆ తెలివితక్కువ స్టేషన్‌మాస్టారు అంత దూరం ఎందుకు సహకరిస్తున్నాడో నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అతన్ని గట్టిగా వారించడం మంచిదని లోలోపల అనుకున్నాను.

"మీ మీద అతనికి ప్రత్యేక గౌరవం కలిగుంటుంది. కాకపోతే అతడు రూల్స్ ప్రకారం కొన్ని గంటలకు మించి ఏ ఒక్కరినీ వెయిటింగ్‌రూంలో ఉంచుకోడు"

"నిజమే నాతో గూడా అలాటిదేదో అన్నాడు. కానీ ఐదు రూపాయల డబ్బు ఎంతపనైనా చేస్తుంది. తెల్లవారగానే, అది 7 దక్షిణమో, కాకపోతే 6 ఉత్తరమో, ఆ రైలు వెళ్ళిపోగానే అతడు రూల్సు గురించి, మచ్చలేని సర్వీసు గురించీ పాఠం మొదలెట్టకముందే ఐదురూపాయలు ముడుతుంది. గదిని శుభ్రంచేసి, అటుగా ఎవరూ రాకుండా చూస్తున్నందుకు రెండు రూపాయలు పోర్టరుకు గూడా తప్పదనుకోండి. అందువల్ల అక్కడ ఉండగలుగుతున్నాను. కొన్ని ఏళ్ళుగా, మీరు తప్ప రాన్‌ను చూసిన మనిషే ఈ ప్రపంచంలో లేడు. అతన్ని పట్టుకునేందుకు మీరు నాకు సహకరించాలి. చాలా వింతైన మనిషి. ఒక్కోసారి అతని గొంతు పిసికెయ్యాలన్నంత ఆవేశం వస్తుంది. కానీ అతడు కంటబడితే ఏం చేస్తానో తెలీదుగానీ అతని మీద ప్రేమను మాత్రం చంపుకోలేక పోతున్నాననేది వాస్తవం. ఏమైతే అది కానీ, ముందు అతన్ని చూపెట్టండి. ఏంచేయాలో ఆ తరువాత తేల్చుకుందాం"

అక్కసుగా ఆమె పెదిమలు కొరుక్కోవడం చూస్తే, ఆమె గుప్పెట్లో ఈ టక్కరోడు ఇరుక్కున్నప్పుడు ఏమవుతుందో ఊహించుకుని కంపరం పుట్టుకొచ్చింది.

"అతని ఫొటో ఎలా దొరికింది మీకు? ఎప్పుడేగాని అతడు ఫొటోకు దొరికేమనిషే గాదు. మా పెళ్ళి ఫొటోను గూడా మాయంచేయాలని చూశాడుగానీ నేను కాపాడుకున్నాను. స్టేషన్‌లో నా ట్రంకు పెట్టె అడుగున అది నా దగ్గరే ఉంది"

"అలా ఎందుకు చేస్తాడంటారు? "

"ఎందుకంటే మోసగాడు కాబట్టి. ఆనవాళ్ళు వదిలెయ్యడం మోసగాళ్ళకు ఇష్టముండదు. అంతకుమించి వేరే కారణం లేదు" ఏమాత్రం తడబడకుండా ఆమె చెప్పుకొచ్చింది. నా నోటిదురద నిగ్రహానికి అతీతమైందే అయినప్పటికీ, నన్నుగూడా మోసగానిగా జమకడుతుందనే జంకు అడ్డుపడి, ఆ ఫొటోను సంపాదించిన విధానం ఆమెకు వివరించకుండా ఆగిపోయాను.

ఆమె ఉన్నట్టుండి అడిగింది- "అతన్ని గురించి మీకు ఎంతవరకు తెలుసో అదంతా చెప్పండి. ఎంత విరక్తి కలిగినా, అతన్ని గురించి వినాలనే అభిలాష తగ్గలేదు"

నాకు తెలిసిన సమాచారంతో ఆమె అభిలాషను తృప్తిపరిచేంత అవసరం నాకున్నట్టు తోచలేదు. అందువల్ల, కేవలం పొడిమాటలతో అన్నాను, "పత్రికలు చూద్దామని టౌను హాలుకు వెళితే, అక్కడ అతడు కనిపించాడు. ఫుల్ సూటులో కొత్తగా కనిపిస్తే కొద్దిసేపు తదేకంగా చూశాను"

"ఆమె పకపకా నవ్వుతూ, "ఏమిటీ? ఫుల్ సూటా? సూటు! అప్పట్లో అతడు నూటికినూరుపాళ్ళ మదరాసీ. అడ్డపంచె, పొట్టిచేతుల చొక్కా వేసుకునేవాడు" అంది.

"ఇప్పుడతడు ఏ లండన్ కోటీశ్వరునికీ తీసిపోడు"

"సూటు ఏ రంగుది? "

"నీలం రంగులోనో, దానికి దగ్గరలోనో

ఉంటుంది” అన్నాను కాస్త ఆసక్తిగా.

“అంతకంటే వివరంగా చెప్పలేరా? అతన్ని గురించి వినాలని తపించిపోతున్నాను. అతన్ని చూసి ఎన్నేళ్ళయిందో! చూడ్డానికి ఎలా వున్నాడు? ఒళ్ళేమైనా చేశాడా? మీ ఫొటోలో అది కనిపించదు”

“పత్రికల్లో నిలువెత్తు ఫొటోలు అచ్చేయరు. రొమ్ముదాకా ఉండేవో, లేదంటే తపాల బిళ్ళలమీద చూస్తుంటామే, మొండెంలేని తల, ఆ రకంగానో అచ్చేస్తారు. ఆ ఫొటో చూసే మీరు ఇక్కడికి వచ్చినట్టుంది”

“నిలువెత్తు ఫొటో అచ్చయ్యుంటే మీ రైల్వేస్టేషన్‌లో సుమారైన గుంపే దిగుండేది. స్టేషన్ మాస్టారుకు మతిపోయుండేది”

“చాలా పేరున్నవాడికి మల్లే కనిపిస్తున్నాడు!”

“ఆడవాళ్ళకు గాలమేయడమే అతని వృత్తి. అతన్ని వదలకుండా వెంటాడుతున్న ఆడదాన్ని నేనొక్కతినే. అతని కోసం ప్రపంచంలో వున్న ప్రతి పట్టణం గాలించాను. అంతర్జాతీయ పోలీసుల సహాయంగూడా తీసుకున్నాను. విడిచిపెట్టి పోయిన బనియన్లు, డ్రాయర్లు తప్ప వేరే ఆచూకీ దొరకలేదు. చూసేందుకు ఇప్పుడు ఎలా కనిపిస్తున్నాడు? ఒళ్ళేం చేయలేదా? ”

దూసుకుపోయే జెట్ విమానంలో చోదకునిలాగా, నా జవాబుకోసం ఆమె ఎదురుచూస్తూ కాచుకోదని నాకు తెలిసిపోయింది. నోరు మెదపకుండా కూర్చుంటే, ఆగకుండా ఆమే దొర్లించుకుపోతుంది.

“అప్పట్లో అతడు ఎంత ఆకర్షణీయంగా ఉండేవాడో! మీసాలు ఉన్నాయా? ”

“సన్నగా. 1930 ప్రాంతంలో సినిమా హీరో ఉండేవాడే. ‘అడాల్ఫ్ మెంటో’ అని, ఆ మీసకట్టు”

“తల నెరిసుంటుందనుకుంటా... రంగేమైనా వేస్తున్నాడా? ప్రాయం పండిపోయిందని నా ఉద్దేశం కాదనుకోండి-”

మాట్లాడే వంతు ఆమెకే వదిలేస్తూ మౌనంగా కూర్చుండిపోయాను. వసపిట్టగా నేను కష్టపడి సంపాదించుకున్న బిరుదును ఆమెకు పాదాక్రాంతం చేసి, వక్తల ప్రపంచంలో ద్వితీయశ్రేణికి నేను దిగజారుతున్నట్టు అనిపించినా, అతడు ఎక్కడ ఊడిపడతాడోనన్న భయంతో సరిపుచ్చుకున్నాను. ఎదురెదురుగా నిలబడితే వాళ్ల ఉద్రేకాలు ఎలా వుంటాయోనని నా సంకటం. అతనికి ఆశ్రయమిచ్చిన మనిషిగా నా స్థానంగూడా ఇరకాటమవుతుంది. ‘అబద్ధాలు కూసే గాడిదకొడకా’ అంటూ నామీద చీవాట్లు అందుకునేందుకు ఈమె ఏమాత్రం వెనుకాడదు. చెయ్యి చాచినా చాచొచ్చు. అదే జరిగితే కబీర్ వీధిలో కనీవినీ ఎరుగని సంచలనం రేగుతుంది.

ఆమె వెళ్లిపోయేందుకు సిద్ధమవుతున్నట్టుగా కనిపించింది. రాన్‌కు నేను అండదండలు కల్పించిన వదంతులు ఆమె వినే వుండాలి- స్టేషన్‌మాస్టారు నుండే.

అంతలో నాకొక ఆలోచన తట్టింది. ఆమెను కాస్త ఆగమని చెప్పి, “మరోలా అనుకోకండి. క్షణంలో తిరిగొస్తాను. ఏదో

## కొత్తగాలి...

**కడుపుపై**
**కొట్టీ కొట్టీ**
**ఇప్పుడు**
**‘ఆశ’పై**

– *గంపా శ్రీదేవి,*
సింహాచలం

మరిచిపోయిన విషయం ఇప్పుడే గుర్తొచ్చి..." అంటూ బయటికొచ్చాను.

మెట్లుదిగి, అదే వరుసలో నాలుగో నివాసమైన సాంబు ఇంటికి వెళ్లాను. ఎప్పటిలాగే అతడు చదువుకుంటూ తన గదిలో కూర్చొనున్నాడు. "నీ స్కూటర్‌ను వాపసు ఇచ్చేందుకు రాన్ ఇక్కడికి రాగానే అతన్ని ఇక్కడే ఉంచు. ప్రమాదం లేదని నేనొచ్చి చెప్పేదాకా అతన్ని దాచేసెయ్. తన కోసం ఎవరో వచ్చారని చెబితే చాలు, అతనికే తెలుస్తుంది" అని చెప్పి, వీధి మొదట్లో ఉండే కొట్టుకు పరుగెత్తుకెళ్ళి, ఓ డజను అరటి పళ్ళూ, ఒక బిస్కట్ పొట్లం, రెండు పళ్ళరసం సీసాలూ తీసుకుని ఇంటికి తిరిగొచ్చి, వాటిని ఒక పళ్ళెంలో సర్ది ఆమె ఎదురుగా ఉంచాను.

"ఆహా, మనసులో ఏముందో తెలుసుకునేవారిలా ఉన్నారు. ఇంతకంటే అవసరమైనవి ఏమున్నాయి? " అంది.

ఆమె ఆకలితో నకనకలాడుతున్నట్టుంది- ఏకబిగిన మూడు అరటి పళ్ళూ, సగం పొట్లం బిస్కట్లూ దిగమింగి, స్వచ్ఛమైన నారింజరసంగా చెప్పుకోబడే ఆ సీసాల్లోని ద్రవపదార్థంతో వాటిని కడుపులోకి కడిగేసింది. ఆకలి తీరగానే, "మొగుడి కోసం గాలించే పనికంటే విసుగేసేది మరొకటి ఉండబోదు" అంది.

"మనం మాట్లాడుకున్నది ఆ మనిషి గురించేనని మీకు కచ్చితంగా తెలుసా? " అన్నాను.

"సందేహమే లేదు. ఫోటో స్పష్టంగా ఉంది. అడాల్ఫ్ మెంటోలా వేషం వెయ్యనీ, మరొకడిలా గెడ్డం పెంచి నెత్తిన కొమ్ములు మొలిపించుకోనీ, మనిషి మాత్రం ఎప్పటిలాగే ఉండిపోతాడు. కళ్ళూ ముక్కూ అలాగే ఉండిపోతాయి. మోసం చేస్తున్నానని మోసగాడు అనుకోవచ్చుగానీ, అవి మోసం చెయ్యవు. వందల ముఖాలమధ్య అతని పోలికలు నెలలకు నెలలు, ఏళ్ళకు ఏళ్ళు చూసి చూసి అలవాటు పడినదాన్ని, కాబట్టి కచ్చితంగా నాకు తెలిసిపోతుంది"

మాటలు ఆపింది. లోలోపల కుమిలిపోతూ ఒక బెక్కు బెక్కింది. ఇలాటి సందర్భాల్లో ఓదార్చడం ఎలాగో నాకు తెలీక చూపు పక్కకు తిప్పుకున్నాను. ఏంచెయ్యాలో తోచక నాకు ఇరకాటమైంది. సందర్భానికి తగిన విధంగా ఆమెకేసి చూడడం ఆపేసి కిటికీనుండి వీధిలోకి చూస్తూ కూర్చున్నాను- సాంబుడిని దాటుకొని ఆ మనిషి హఠాత్తుగా ఊడిపడకుండా ఉండాలని కోరుకుంటూ. సాంబుడు తన పుస్తకంలో మునిగిపోయి, అతన్ని ఆపడం మరిచిపోయినా ఆశ్చర్యపడే అవసరముండదు- పుస్తకం పురుగులకు ఎక్కడలేని మతిమరుపు.

ఈ ఆలోచన రాగానే భయంతో ఆమెవైపు చూసాను. మాటిమాటికి ఆమె తన చేతి పర్సును తడుముకుంటూ చిన్న చేతిగుడ్డ బయటికి తీసి కళ్ళు తుడుచుకోవడం గమనించి, రాన్ ఇచ్చిన 'నెవెల్లి' టవలును అందిస్తే బావుంటుందా అనిపించింది. ఆమె రోజంతా ఇక్కడే ఉండిపోతుందేమో? - నా ఇల్లు ఆ వెయిటింగ్‌రూముకంటే సౌకర్యంగా ఉంటుంది.

ముక్కు చీదుకుని, బరువెక్కిన గొంతుతో ఆమె తిరిగి మొదలెట్టింది.

"ఇలా చేస్తాడని, అప్పట్లో నాకు తెలిసుంటే... అంటూ మొదలెట్టింది.

మద్రాసు ఎగ్మోర్‌లో సెయింట్ ఎవాన్స్‌లో నేను విద్యార్థిని. దానికి దగ్గర్లోవుండే చిన్న సందులోనే మా ఇల్లు. అమ్మానాన్నలతో ఉండేదాన్ని. మా నాన్నది వడ్రంగి కార్ఖానా. మీరు రాన్ అంటున్నారే, ఆ మనిషి సైకిల్ మీద వచ్చేవాడు. పుస్తకాలు అద్దెకిచ్చే కిరణా లైబ్రరీలో అతని

ఉద్యోగం. చాలావరకు అందులో దొరికేవి సినిమా పుస్తకాలే. వాటిని ఖాతాదార్ల ఇంట్లో ఇచ్చి, తరువాత పుస్తకాలనూ, అద్దెనూ వసూలు చేసుకెళ్ళడం అతని పని. అతడు గూడా విద్యార్థి. లయోలా కాలేజీలో చదివేవాడు. కేవలం సంపాదనకే కాకుండా, ఈ వ్యాపకం అతనికి సరదాగా గూడా ఉండేది. ఆ లైబ్రరీలో సినిమా పత్రికలే కాకుండా, యువతను అకర్షించే వేరే పుస్తకాలు గూడా కొన్ని ఉండేవి. సంపాదనతోపాటు, రకరకాల పుస్తకాలను చదివే అవకాశం అందులో ఉందిగనక, ఈ వ్యాపకం అతనికి

**కొత్తగాలి...**

**ఉరికేది**
**జలపాతమేనా?**
**వయసు**
**కులుకూనూ!**

– బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

నచ్చింది.

విజ్ఞానాత్మకమైన పుస్తకాలు, నేషనల్ జియోగ్రఫీ వంటివి చదవడం అతనికి అలవాటు. నా పరిజ్ఞానాన్ని పెంచుకునేందుకు ఉపయోగపడే పుస్తకాలూ, వ్యాసాలూ సిఫార్సు చేసి నాతో చదివించేవాడు. వసూళ్ళు పూర్తిజేసుకుని తిరిగెళ్ళేప్పుడు మా ఇల్లే అతని ఆఖరు మజిలీ. మేము కోరుకునే చౌకబారు సాహిత్యానికి తోడు, తను సిఫార్సు చేసే పుస్తకాలను గూడా అతడు తీసుకొచ్చేవాడు. పుస్తకాల పంపిణీకి తోడు అతని యజమాని మా కార్ఖానాలో బెంచీలూ, స్టూల్లూ, అల్మేరాలూ ఖరీదు చేసేందుకు గూడా అతన్నే పంపేవాడు. కార్ఖానా ఉండేది మా పెరట్లోనే. పెద్దదేం కాదుగానీ, మా నాన్న చాలా మంది పనివాళ్ళను పిలుచుకుని పెద్దఎత్తున సామగ్రి తయారుజేస్తాడు. చుట్టుపక్కలుండే కొట్లన్నిటికి చెక్కసామాగ్రిని సరఫరా చేస్తాడు.

మా ఇంటిముందు ఆవరణలో ఒక మామిడి చెట్టుంది. దానికిందుండే అరుగు అతనికీ నాకూ అనుకూలంగా ఉండేది. నాకు ఉపయోగంగా ఉంటుందని తోచిన సమాచారాన్ని అతడు బయటికి చదువుతూ వివరిస్తూంటే, వింటూ అతనికి దగ్గరగా కూర్చునేదాన్ని. యవ్వనంలో వుండే ఆడామగా దగ్గర దగ్గరగా కూర్చుంటే ఏమవుతుందో మీకు తెలుసు. ఓహ్, నిగ్రహించుకోవడం అసాధ్యమా అసాధ్యమా..."

అదే క్షణంలో వరండా మెట్లెక్కుతూ సాంబుడు కనిపించాడు. "ఒక్కక్షణం, ఇప్పుడే వస్తాను" అంటూ సెలవు తీసుకుని బయటికి వచ్చాను.

"అతడు వచ్చాడు. వచ్చిగూడా అర్ధగంట కావచ్చింది. తొక్కులాడుతున్నాడు. ఏం చెయ్యమంటావ్? "

"నిచ్చెనేసి అటకమీదికి తన్నెయ్. ఆ పాటున నిచ్చెన తీసేసెయ్. చచ్చినట్టు పడుంటాడు. చాలా సేపటిదాకా అతడు కనిపించకుండా ఉండటం అతనికే క్షేమం. కీలుకు కీలు ఊడదీసేందుకు ఇక్కడ ఓ మనిషి కాచుకుని కూర్చోనుంది. ఆ కథంతా ఆనక చెబుతాను. ఆమె ఇప్పుడిప్పుడే కదిలేలా లేదుగానీ, నా తిప్పలు నేను పడి తొందరగా పంపిస్తాను. ఆc- కొంచెం ఆగు. ఆ గాడిదకొడుకు కిటికీల్లోనుండి వీధిలోకి తొంగిచూడకుండా చూడు"

చెబితే కాదనని మిత్రుడు పొరుగింటి సాంబుడు. ఒక చూపు కిటికీవైపు చూసి, తన దారిన వెళ్ళిపోయాడు.

ఆమె దగ్గరికి తిరిగొచ్చి అన్నాను-

"క్షమించండి. సమాచారం కోసం తప్పనిస రిగా వెళ్ళవలసిన సమావేశం. ఒకటి కాల బడింది నాకు. ఒక మిత్రుడు కాచుకుని కూర్చొనున్నాడు. మీరు స్టేషన్‌కు వెళ్ళండి. నేను తపాలా పంపేందుకు వచ్చినప్పుడు మీ గదికే వస్తాను. తపాల పంపిన తరు వాత నాకు వేరే పనేముండదు. ఆకలిగా గూడ ఉన్నట్టుంది. మీరు కాస్త ఎంగిలి పడి విశ్రాంతి తీసుకోండి. నేను తప్పనిస రిగా వస్తాను"

★ ★ ★

ప్లాట్‌ఫామ్ మీదుండే చెట్టు నీడన రెండు కుర్చీలు వేసేందుకు ఆమె ఆదే శించి, జీవిత చరిత్రలోని తరువాతి భాగం పూర్తిజేసింది. ఆమె ఏమడిగినా కాదన కుండా సరఫరా చేస్తూ అటు స్టేషన్‌మా స్టారూ, ఇటు పోర్టరూ విధేయత ప్రకటిస్తు న్నారు. ఒక కోర్టుకేసు, తాజా పురపాలక సమావేశాల తాలూకు సమాచారాన్ని బాధ్యతాయుతంగా తపాలా పంపించి నేను తీరుబడిగా కూర్చున్నాను. స్టేషను నిర్మానుష్యమైంది. స్టేషన్‌కు చెందిన ఊర కుక్క మాత్రం పొట్టలోకి తల ముడుచు కుని దూరంగా పడుకోనుంది. బాగా విశ్రాంతి తీసుకుని కోలుకున్నదానికి మల్లే ఆమె కులాసాగా కనిపించింది. ఇప్పుడు ఆమె చీరకట్టులోకి మారింది. ఉదయం కనిపించిన పంజాబీ దుస్తుల్లోకంటే, చీరక ట్టులో ఆమె శరీరం మరింత భారీగా తోచింది.

కొండలమీదినుండి ఆహ్లాదంగా పిల్లగాలి వీస్తూవుంది. చెట్టుమీద ఏవేవో పిట్టలు ముచ్చటగా కేరింతలు కొడుతున్నాయి

"ఏ కాలంనాడో ఖైదీలను కుక్కేందుకు ఉపయోగించిందయ్యుంటుంది ఈ వెయి టింగ్‌రూము. నా ఆజన్మ శత్రువైనా ఇందులో ఉండాలని కోరుకోను. పగలంతా ఈ చెట్టే నాకు ఆశ్రయం. వచ్చిపోయే ప్రయాణికులను చూసుకుంటూ కూర్చుం టాను. రాత్రిగూడా ఇక్కడే పడుకోవాలని అనిపిస్తుంది గాని, ఈ ప్రపంచం ఆడవాళ్ల రక్షణ విషయంలో ఇంకా అంత నాగరికం కాలేదు" అంది ఆవిడ.

'నీ దగ్గర కొచ్చే దమ్ములు ఎవరికుం టాయి?' అందామని నోటిదాకా వచ్చింది గానీ, నిగ్రహించుకున్నాను.

నా అభిప్రాయం అంచనా వేసినదానికి మల్లే ఆమె చెప్పుకుపోయింది- "ఎప్పటికీ చిన్న పిస్తోలు నా దగ్గర ఉండనేవుం టుంది. లైసెన్సు ఉండేదే. ఢిల్లీలో హోంగార్డు ఆఫీసరును గాబట్టి ఇచ్చారు. ఇంతవరకు ఈగనైనా కాల్చిన పాపాన పోలేదనుకోండి. మద్రాసు పోలీసులు నిర్వహించిన రైఫిల్ షూటింగులో శిక్షణ తీసుకున్నాను. అందువల్ల, తుపాకీ మడ మేదో గొట్టమేదో నాకు తెలుసు" అంటూ నవ్వింది.

బహుశా ఈ ఉదయం ఆమె గుండెల్లో కూర్చొనుండిన బరువు దిగిపోయిందేమో, ఇప్పుడు సరదాగా మాట్లాడటం మొదలె ట్టింది.

స్టేషన్‌మాస్టారు భాషలో చెప్పాలంటే, 21వ గంటదాకా ఏ రైలూ వచ్చేదుండదు. అది 11 ఉత్తరం అనుకుంటా. నిండుమని షిలా నిదానంగా దాటుకునే గూడ్సుబండి. ఒకటే గడబిడ. అది అవతలి రెక్కమాను దాటిందాకా నాకు కునుకే పట్టదు. రైల్వేభాష నాకు ఎంతబాగా అబ్బిందో చూశారా! కొద్దిసేపు ఇలా తేలికపాటి సంభాషణ సాగిన తరువాత, ఆమె స్టేషన్ మాస్టారునూ పోర్టరునూ చూస్తూ, "ఇప్ప టికి ఇంకేమొద్దు మాస్టారూ. రాత్రికి నా కోసం చెయ్యి కాల్చుకోవద్దని మీ ఆవిడతో చెప్పండి పంపగలిగితే ఒక గ్లాసెడు మజ్జిగ పంపండి చాలు"

"తప్పకుండా మేడం. సరుకుల కోసం

నేను బజారుకు వెళుతున్నాను. గంటదాకా రాలేను" అన్నాడు స్టేషన్‌మాస్టారు.

"అంటే పదిహేడున్నర గంటలదాకా రారు? "

"అంతసేపు పట్టదు, పోర్టరు ముని ఇక్కడే ఉంటాడు. అర్జంటు సమాచారముంటే ఏం చెయ్యాలో అతనికి తెలుసు. చాలా అనుభవముంది"

ఆ మాటకు పోర్టరు పొంగిపోయాడు. అంతటితో ఇద్దరూ ఆ పరిసరాల నుండి నిష్క్రమించారు.

"మీకు విసుగెత్తించడం నా ఉద్దేశం కాదు" ఈమె ప్రారంభించింది.

> ## కొత్తగాలి...
>
> **భారీ యాక్షన్**
> **హాలీవుడ్‌లోనే కాదు**
> **మరి, మన**
> **అసెంబ్లీలో కూడా!**
>
> *– వాడపర్తి వెంకటరమణ,*
> విశాఖపట్నం

"ఐనా, చెప్పుకునే అవసరముంది. పొద్దు కుంకే సమయంలో మా ఇంటివద్ద కలుసుకోవడమే కాకుండా, నేను స్కూలుకు వెళ్ళేప్పుడూ వచ్చేప్పుడూ దారిలో కాచుకుని నన్ను సైకిల్ మీద తీసుకెళ్ళేవాడు. అతన్తో కాఫీ హోటల్లోనో, ఐస్‌క్రీం పార్లర్‌లోనో పొద్దుబుచ్చేందుకు తరగతులు ఎగ్గొట్టడం నాకు పెద్ద కష్టంగా ఉండేదిగాదు. నన్ను సంతోషపెట్టేందుకు అతడు ఖర్చుకు వెనుకాడేవాడు కాదు. అతడు ఏవేవో సంగతులు అవలీలగా చెప్పేస్తూంటే నాకు ముచ్చటేసేది. బయట కలుసుకోవడం ఎక్కువకాగానే, మామిడిచెట్టు అరుగుమీద కలుసుకోవడం తగ్గిపోయింది. ఒకరోజు మ్యూజియంకు తీసుకెళ్ళాడు. అక్కడుండే ప్రతి వస్తువు గురించి నాకు అర్థమయ్యేలా వివరిస్తూ పరిచయం చేశాడు. అతని గొంతు వినాలని నాకు పడిచచ్చేంత మోజుగా ఉండేది. పదకొండో శతాబ్దం ఇత్తడి వస్తువుల గురించో, ఆటవికులూ, దేశద్రిమ్మరుల జీవితం గురించో, నగలుగా వాళ్ళు వేసుకునే గవ్వల హారాల ప్రత్యేకత గురించో అతడు చెబుతూంటే, నరాలు మీటినంత తుళ్ళిపాటు కలిగేది. చెత్తదురిగి నిలబెట్టిన జంతుకళేబరాలు చూపించి, ఆ జంతువుల అలవాట్లూ స్వభావాలూ వినిపిస్తూంటే- అంతెందుకు, అతడు ఏది చెప్పినా నా చెవులకు విందులాగే ఉండేది. అతని మాటల్లో ఏది నిజమో, ఏది కాదో వితర్కించే విచక్షణే నాకు ఉండేదిగాదు. అతని కంఠస్వరం నా మనసుకు మత్తెక్కించేది. నిదానంగా మ్యూజియం మాకు సంకేతస్థలంగా మారింది. ఎందుకంటే, అక్కడినుండి నేను మూడో కంటికి తెలీకుండా ఇంటికి చేరుకోవచ్చు.

అప్పుడప్పుడు బస్సెక్కి మేము సముద్రం ఒడ్డుకు షికారు వెళ్ళేవాళ్ళం. ఆ తడిగాలినీ, ఇసుకనూ, నురగనూ తనివితీరా అనుభవించేవాళ్ళం. నా చెయ్యి పట్టుకుని అతడు మోకాటిలోతు నీళ్ళల్లోకి లాక్కెళ్ళేవాడు. ఆ మధురానుభూతి ఇంటినీ, అమ్మానాన్నలనూ గుర్తుకు రానిచ్చేది కాదు. ఎప్పుడైనా ఒకసారి మౌంట్‌రోడ్డు ఎల్ఫిన్‌స్టోన్‌లో మ్యాట్నీకి వెళ్ళేవాళ్ళం. ఎగ్మోర్‌లో పడుండడం నాకు పంజరంలో ఇరుక్కున్నట్టుగా అనిపించేది. ఆ కుర్రవాడి మూలంగా విశాలమైన ప్రపంచం నా కళ్ళముందు నిలిచింది.

అప్పటికింకా నా వయసు పద్దెనిమిదికి చేరుకోలేదు. ఏదైనా పీకలమీదికి రాకుండా నన్ను నేను కాపాడుకునే చాకచక్యం ఆ చిన్న వయసులోనే నాకు పట్టుబడింది.

ఇంత ఆలస్యం ఎందుకయిందని మా నాన్న నిలదీస్తే, ఏదో అదనపు తరగతి జరిగిందనో, ఉపాధ్యాయులతో వినోద యాత్ర ఉండిందనో, తోటి విద్యార్థులతో ఉమ్మడి అధ్యయనం చేశాననో కప్పిపుచ్చే దాన్ని. పని ఒత్తిడివల్ల రోజంతా వడ్రంగులతో సతమతమై అలసిపోయిన మా నాన్నకు అంతకుమించి ఆరాతీసే తీరిక ఉండేదిగాదు. అదృష్టంకొద్దీ ఎప్పుడూ నేను పరీక్షలు తప్పలేదు. ఆయనకు కావలసింది అంతే.

ఐతే, మా అమ్మ అంత అమాయకురాలు కాదు. స్కూలుకు బయలుదేరే ముందు నాతో రహస్యంగా, 'ఇదిగో, నీ స్కూలు విడిచే గంట ఇంటికి స్పష్టంగా వినిపిస్తుంది. పదినిమిషాల్లో నువ్వు ఇంటికి చేరలేదో, మీ నాన్నకు చెప్పేస్తాను. ఆయనకు తిక్కరేగితే ఏంచేస్తాడో నీకు బాగా తెలుసు. బాడిసె తీసుకుని నీ చర్మం చెక్కేస్తాడు' అంటూ బెదిరించేది.

అతన్తో షికార్లు కట్టేసి, బడి కాగానే ఇంటికి చేరుకోక నాకు తప్పలేదు. సైకిల్లో అతడు మా ఇంటికి పుస్తకాలు ఇచ్చేందుకు రాగానే మా అమ్మ కలుగజేసుకుని, 'ఇవి చదివేంత తీరిక మాకు లేదు. ఇక తీసుకు రావద్దు' అంటూ వీడ్కోలు పలికింది. 'అరె, ఇప్పుడేమైందండీ, ఉన్నట్టుండి ఎందుకు వద్దంటున్నారు?' అంటూ అతడు మొరబెడితే, 'అది అంతే. ఇంకేమీ అడగొద్దు. నీ దారి నువ్వు చూసుకో' అంటూ మా అమ్మ తుంచేయడం నాకు వినిపిస్తూనేవుంది. అతడు తటపటాయిస్తూ, 'మామగారు చదువుతారేమో' అనగానే మా అమ్మ ఎగిరిపడుతూ, 'మామ! ఆయన నీకు మామా? ఫో బయటికి' అంటూ కసిరింది. అది విని, అతడు నాపట్ల చూపుతున్న ఆదరణ మరువలేక, జాలిపడి నేను రంగంలో దిగాను. 'ఎందుకమ్మా అంత కఠినంగా చీదరించడం?' అన్నానో లేదో, నా చెంప చెళ్ళున మోగింది. ఏడ్చుకుంటూ ఇంట్లోకి తప్పుకున్నాను.

ఇంట్లో నా హోదా బందీ కిందికి మారిపోయింది. బడికి వెళ్ళడం, అయిపోగానే ఇంటికి తిరిగిరావడం- అది గూడా మా ముదుసలి పనిమనిషినితోడిచ్చి- అది నాకు మిగిలిన స్వాతంత్ర్యం. ఆ రోజుల్లో మా అమ్మ నాకు భయంకరంగా కనిపించేది. ముక్తసరిగా జవాబివ్వడం మినహా ఆమెతో మాట్లడటం మానేశాను. అతడు గుర్తుకొచ్చినప్పుడల్లా నా గుండె పగిలిపోయేది. కత్తిగట్టిన ప్రపంచాన్ని తలపోసుకుంటూ అతడు సైకిల్ బారుమీదికి వంగిపోయి దిగాలుగా ఉండేవాడు. అతని కబుర్లతో కలిగే ప్రపంచజ్ఞానం, అతని తోడు వల్ల కలిగే వెచ్చదనం- ఇంకా చెప్పాలంటే, నా మెడమీద అతడు పెదవులు తాకించే స్పర్శ, ఎవరూ చూడనప్పుడు గుండెలకు హత్తుకునే కౌగిలింత- నాకు కరువయ్యాయి.

కలుసుకోకుండా మా వాళ్ళు కట్టుదిట్టం చేసినా, మామధ్య సంబంధాలు మాత్రం తెగిపోలేదు. పనిమనిషి సాయంతో చీటీలు నడిచేవి. అతడు లైబ్రరీలో ఉన్నప్పుడు వెళ్ళి నా చీటీ అందించి జవాబు తీసుకొచ్చేది మా ముసలిది. ఆ మేరకు నేను లేదా మేమిద్దరం, నా తల్లిదండ్రుల శాసనాన్ని గౌరవించేవాళ్ళం. నా ఫైనల్ పరీక్షలు దగ్గర పడ్డాయి. చదువును భగ్నం చేసుకోవడం నాకు ఇష్టముండేది కాదు. అందువల్ల ఇంట్లో క్రమశిక్షణ గల అమ్మాయిగా నడుచుకునేదాన్ని. అమ్మా నాన్నా తృప్తిపడ్డారు. నన్ను దయతో ముంచెత్తారు. నామీద వాళ్ళకు నమ్మకం ఏర్పడింది. నేను గూడా చదువు మీద బాగా దృష్టిపెట్టి, మార్చిలో జరిగిన పరీ

క్షలు బాగా రాశాను. అతన్ని కలుసుకోవాలని అప్పుడప్పుడు తహతహలాడినా మేలో ఫలితాలు మెల్లడయ్యేదాకా మా నాటకం ఇలాగే కొనసాగించాలని మా ఒప్పందం.

ఎప్పుడోవొకసారి, మా అమ్మానాన్నా ఇంట్లో లేనప్పుడు, మాకు కలుసుకునే అవకాశం దొరికేది. మద్రాసుకు యాభైమైళ్ళల్లో వుండే ఆవడి మా అమ్మ పుట్టిల్లు. అమ్మ అక్కడికి వెళ్ళాలంటే, మానాన్న తోడుగా వుండి తీసుకెళ్తాడు. ఉదయం బయలుదేరి సాయంత్రం రైలుకు తిరిగొస్తారు. ఆ పగలంతా నాకు స్వేచ్ఛ. 'గడప దాటి వెళ్ళొద్దు. ఇంటిని జాగ్రత్తగా చూసుకో. నువ్వు గూడా జాగ్రత్త' అంటూ హెచ్చరించి వెళ్ళేవాళ్ళు. ఇంట్లోకి మనుషులు చొరబడకుండా చూసేందుకని, ముసలి పనిమనిషిని కాపలాగా ఉంచేవాళ్ళు. ఇంట్లో చొరబడే మనుషులంటే మా అమ్మ ఉద్దేశంలో అతడే. లంచంతో మా ముసలిదాన్ని మంచి చేసుకుని, ఇల్లు చూచుకునే బాధ్యత ఆవిడకు వదిలేసి, నేను కిరాయి లైబ్రరీకి రెక్కలు కట్టుకుని ఎగిరిపోయేదాన్ని. అది నాకు మధురాతి మధురమైన సందర్భం.

అతడు పని కట్టేసి, నన్ను వెంటదీసుకుని బయలుదేరేవాడు. వీలైనంత దూరంగా వుండే ప్రదేశం మా గమ్యం. అడయార్‌లోని ఎలియట్ బీచిని ఎంచుకునేవాళ్ళం. ఎగ్మోర్‌లో నివసించే జనానికి అది పరాయి గ్రహంతో సమానం.

సముద్ర స్నానానికి వచ్చినవాళ్ళు బట్టలు మార్చుకునేందుకు ఆ బీచిలో రెండుమూడు చోట్ల బంకులు ఏర్పాటు చేసుకున్నారు. చాటుమాటు ప్రేమికులకు వాటికి మించిన చోటు మరెక్కడా దొరకదు. పొద్దు కుంకేవరకు మాకు అక్కడే గడిచిపోయేది. ఆ ఘడియలే ఘడియలు- మా ఆనందానికి అవధులు ఉండేవిగాదు. ఐనా హద్దులు మీరకుండా నా జాగ్రత్తలు నేను పాటించేదాన్ని. హత్తుకోవడం, ముద్దిచ్చుకోవడం, ఒకరి వొడిలో ఒకరం పడుకోవడం- అదే మాకు ఎక్కడలేని సంతోషం కలిగించేది.

భవిష్యత్తును గురించి అక్కడే పథకాలు వేసుకునేవాళ్ళం. ఒకటిగాదు, రెండుగాదు- ఎన్నెన్నో, పొడవాటి వేటపడవలు జంటగా కట్టేసి, బెస్తలు వలలతో బయలుదేరడం వినోదిస్తూ బంకులో గంటలు గంటలు కూర్చుండిపోయేవాళ్ళం. ఎప్పుడో వొకసారి, వాళ్ళల్లో ఎవరో వొకరు, మా దగ్గరకొచ్చి, బంకులోకి తొంగిచూసి, ముసిముసిగా నవ్వుకుంటూ మాపాటికి మమ్మల్ని వదిలేసి వెళ్ళేవాళ్ళు. ఒక్కోసారి సిగరెట్ పెట్టెకోసం వేధిస్తూ, రూపాయ ఇచ్చిందాకా వదిలేవాళ్ళు కాదు.

ఒకరినొకరం ఒరుసుకుంటూ, ఒకరినొకరం చూసుకుంటూ, నీలి ఆకాశాన్నీ, నీలి సముద్రాన్నీ సొంతం చేసుకుంటూ, ఒడ్డును తాకే అలల సంగీతాన్ని, పక్షుల విన్యాసాల్నీ ఆనందిస్తూ- గంటలకు గంటలు గడిచిపోయేవి. ఒడిలో పడుకుని అతడు, 'జీవితమంతా ఇక్కడే ఉండిపోదాం. ఇంటికెళ్ళి మనం పొముకునేదేముంది? బతికినంతకాలం ఇక్కడే ఉండిపోదాం' అనేవాడు.

కానీ, ఆరుగంటలయినట్టు చాటిస్తూ శాంథోమ్ చర్చిగంటలు వినిపించగానే ఇంటికి పరుగులు తీయక తప్పేదిగాదు. మా నాన్న తిరిగొచ్చే రైలు ఏడుగంటలకు ఎగ్మోర్ స్టేషన్ చేరుకుంటుంది. పట్టాల వెంట నడుచుకుంటూ ఆయన పదిహేను నిమిషాల్లో ఇంటికి చేరుకుంటాడు. మా ముసలి పనిమనిషి నాకు కొండంత అండగా నిలిచేది. మా ప్రయాణంలో ఉత్కంఠను ఆమె పరోక్షంగా అనుభవించేది గాబోలు. మా నాన్న అపనమ్మకంగా

ఆరాతీస్తూ, 'అంతా సవ్యంగానే ఉంది గదా?' అని అడగ్గానే, 'పొరపాటే లేదు, పాపం బిడ్డ, రోజంతా పుస్తకం చదువుకుంటూ ఇంట్లో నుండి లేవనేలేదు' అంటూ కప్పిపుచ్చేది. 'పుస్తకమా? ఏ పుస్తకం?' కిరాణా లైబ్రరీ పుస్తకమేమోనని అనుమానం. 'అకౌంట్స్‌లో కరెస్పాండెన్స్ కోర్సు చేద్దామని శాంత దగ్గర పుస్తకం తెచ్చుకున్నాను నాన్నా' అనేదాన్ని. ఆ జవాబుకు ఆయన సంతోషంగా ఊపిరి పీల్చుకునేవాడు. చదువుమీద నా శ్రద్ధను మెచ్చుకుంటూ, 'నిన్నగాక మొన్న మెట్రిక్యులేషన్ పరీక్షకోసం రాత్రీ పగలూ కష్టపడ్డావు. ఇంతలోనే మరీ అంతగా చదివితే ఆరోగ్యం పాడవుతుంది జాగ్రత్త' అని హెచ్చరించేవాడు.

దొంగచాటు బతుకు మాకు నచ్చలేదు. నాకైతే రోతగా, నీచంగా కనిపించేది. పరీక్షా ఫలితాలు వెలువడి, పాసయ్యానని తెలియగానే ఒక నిర్ణయానికి వచ్చేశాను. మరోసారి మా అమ్మానాన్న ఆవడికి వెళ్ళగానే నా ప్రియుడు తన స్నేహితులను అడిగి అరువు తీసుకొన్న పాత కారొకటి పెరటిదారిన తీసుకొచ్చి నన్ను లేపుకుపోయాడు. కాపలాగా వున్న ముసలమ్మ చేతిలో పదిరూపాయలుంచి ఆశీర్వదించమని అడిగాడు. మార్చుకునేందుకు రెండు మూడు జతల బట్టలు మూట గట్టుకుని బయలుదేరాను. వెళుతూంటే మా ముసలమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి. నా భుజంమీద చెయ్యేసి, వణికే గొంతుతో, 'భగవంతుడు నీకు బోలెడు సంతానం ఇస్తాడు' అంటూ దీవించింది. అదొక్కటే ఆమెకు తెలిసిన ఆశీర్వాదం.

దారిలో పూలంగడి దగ్గర కారాపి, సన్న జాజులూ చేమంతులూ కట్టిన దండలు రెండు తీసుకుని, నగరం శివార్లలో వుండే గుడి దగ్గరికి తీసుకెళ్ళాడు. ఆ రోజంతా అతనికి పెళ్ళి ఏర్పాట్లతోనే సరిపోయినట్టుంది. పూజారి వచ్చి దేవుని విగ్రహం చుట్టూవుండే నూనెదీపాలు వెలిగించాడు. మాతో పూలదండలు మార్పించాడు. దేవుడికి దండం పెట్టుకోమన్నాడు. కర్పూరం వెలిగించి హారతి ఇచ్చాడు. తనే ఇద్దరు స్నేహితులను పిలుచుకొచ్చి, దేవునితో పాటు వాళ్ళనుగూడా సాక్షులుగా నిలబెట్టాడు. చుట్టూ చేరిన వాళ్ళందరికీ పండ్లను పంచిపెట్టాడు. అగ్నిహోత్రం వెలిగించి మాతో ప్రదక్షిణలు చేయించాడు. గంట వాయించి, పెళ్ళికొడుకు చేతికి పసు

## రాసుకోవాలా? వద్దా?

ఆది 1945లో మక్త్యాలలో నవ్యసాహిత్యపరిషత్తు సభ. విశ్వనాథవారూ వచ్చారు. అప్పటికే రామాయణ కల్పవృక్షంలో ఓ భాగం రాశారాయన. దేవులపల్లి గంటన్నరపాటు తన ఉపన్యాసంలో ప్రజల పక్షాన సాహిత్యం రావా



లని ఆవేశంగా మాట్లాడారు. 'దేశ ప్రజలు విదేశీ పాలన కింద దారిద్ర్యంలో మగ్గిపోతున్నారు. వారి బాధల గురించి కవులు రాసి తీరాలి' అని గట్టి ఉపన్యాసం ఇచ్చారు. అది అక్కడున్న సనాతనులను సైతం తీవ్రంగా కదిలించింది. అదంతా విన్న తర్వాత విశ్వనాథవారు, 'నువ్విలాంటి ఉపన్యాసాలు నేనుండగా ఎప్పుడూ ఇవ్వకు. నన్నేం చేయమన్నావ్? రామాయణ కల్పతరువు ఇంకా పూర్తికాలేదు. ఇలాంటివి రాసుకోమన్నావా? మానేస్తే బాగుణ్ణనే భావం కలిగేలా చెప్పావు. నేనేం చేయను?' అన్నారు. దాంతో అక్కడున్నవారంతా నవ్వారు.

పుతాడు ఇచ్చి, దాన్ని నా మెడలో కట్టిం చాడు. రుసుముగా యాభైరూపాయలు తీసుకుని, రసీదుకు రబ్బరుసీలు వేసి మాకు అందించాడు. ఇక అప్పటినుండి మేము మొగుడూ పెళ్ళాలం"

నన్ను మించిన వాగ్ధాటి ఆ మహాతల్లిది. పెళ్ళికి వచ్చిన అతిథికి మంటపంలో అడుగైనా పెట్టేందుకు అవకాశం ఇవ్వకుండా, ప్రవేశద్వారం దగ్గరే ఆపి, తన సాహస యాత్రను కథగా వినిపించడం మొదలెట్టిన 'ఏన్షియెంట్ మారినర్' లాగా ఆమె నన్ను తన గుప్పెట్లో ఇరికించుకుంది. హతాశుడైన అతిథి, తలుపుగుండా పెళ్ళి బాజాలను విని, 'నేను పెళ్ళికి వెళ్ళాలి. ఇప్పటికే ఆలస్యమైంది' అంటూ మొరపెట్టుకున్నా వదలకుండా, అతన్ని కంటిసైగతో అడ్డుకుంటూ, 'అప్పుడు నేను శక్తిమంతమైన విల్లుతో ఆ అల్బాట్రోస్‌కు సూటిగా బాణం వదిలాను' అంటూ తిరిగి మొదలెట్టిన మారినర్‌ను అడ్డుకోవడం చేతగాక ఆ అతిథి రొమ్ములు బాదుకుని రోదించాడట.

నేను అంతదూరం వెళ్ళకపోయినా, 'ఇక వెళ్ళాలనుకుంటా, కాలేజీ వార్షికోత్సవం జరుగుతోంది. దాని రిపోర్టు పంపించాలి' అన్నాను ఆమెను అడ్డుకుంటూ.

నా అభ్యంతరాన్ని ఖాతరు చెయ్యకుండా, ఆమెకు పనిజేస్తున్నది నాలుకేగాని చెవులు కాదన్నట్టు, కథలో తరువాతి భాగాన్ని కొనసాగించింది. పాత జ్ఞాపకాలు ఆమెను మరో లోకంలోకి తీసుకెళ్ళినట్టుంది.

"మాకు పూనమల్లి హైరోడ్డులో చిన్న ఇల్లు దొరికింది. వంటగది, స్నానాలగది, పడకగది- ఇల్లు చిన్నదైనా వసతులన్నీ ఉన్నాయి. మా కాపురం కలతలు లేకుండా గడిచింది. ఇద్దరం ఉద్యోగం చేసేవాళ్ళం. తన పాత లైబ్రరీలో అతడు చేరిపోయాడు. ఇప్పుడు అది మరింత పెద్దదిగా పెరిగింది. అతని స్థాయిని పెంచి చాలా బాధ్యతలు అప్పగించారు. నేనొక ట్రావెల్ ఏజెన్సీలో రిసెప్షనిస్టుగా కుదురుకున్నాను. పొద్దున్నే టిఫిన్ చేసి, మధ్యాహ్నం భోజనానికి ఒంటిరకం వంట ఏదైనా పొట్లం కట్టుకుని, తొమ్మిదింటికి బయటపడితే, సాయంత్రం బాగా పొద్దుపోయిగానీ ఇంటికి తిరిగొచ్చేందుకు కుదిరేదిగాదు. నేను తెల్లవారుజామున లేచి ఆ రోజుకు సరిపడా వంట వండేస్తాను. ఇంటికి అతడు తిరిగొచ్చే సమయం ఒకటైతే, నేను తిరిగొచ్చే సమయం మరొకటి. బాగా అలసిపోయి వచ్చేవాళ్ళం. వంట చేసుకునేందుకు ఓపిక ఉండేదిగాదు. ఉదయం వండినదే తిని పడుకునేవాళ్ళం.

అప్పుడప్పుడు నేను పుట్టింటికి వెళ్ళేదాన్ని. విరోధాలు పక్కకు నెట్టి ఇప్పుడు మా అమ్మానాన్నా కలుపుగోలుగా మారిపోయారు. కానీ కట్నం లేకుండా, పెళ్ళి ఖర్చు లేకుండా, అల్లుడు తేరగా దొరకడం లాభమేనని తెలుసుకున్నారో ఏమో"

నేను కుర్చీలో ఇబ్బందిగా కదిలి లేచేందుకు ప్రయత్నిస్తే, ఆమె చేతి సైగతో కూర్చోమని ఆజ్ఞాపించింది.

"మరికాస్సేపు ఓపిక పట్టండి. పూర్తిగా చెప్పాలంటే చాలా పెద్ద కథేగానీ, వీలైనంత టూకీగా చెప్పేస్తా. మరోసారి

---

## కొత్తగాలి...

**కానుక.. లంచం..**
**డొనేషన్.. మామూలూ..**
**పేరేదైతేనేం?**
**మింగడమేగా పరమావధి**

– నేమాన సుభాష్ చంద్రబోస్,
శ్రీకాకుళం

మనం కలుసుకునే అవకాశం వస్తుందో రాదో. మిమ్మల్ని ఆపింది నా కథంతా వినిపించాలనే తపనతోనే. అతడు మళ్ళీ మీకు కనిపిస్తాడని నా నమ్మకం. అందు వల్ల నీ కథానాయకుని గురించి మీకు పూర్తిగా తెలిసుంటే మంచిది"

"అబ్బే, నా కథానాయకుడేం కాదు. మళ్ళీ కనిపిస్తాడని గూడా అనుకోను" అన్నాను ఆక్షేపిస్తూ.

"దయవుంచి నన్ను అడ్డుకోకండి. అడ్డు తగలకుండా సాగనిస్తే తొందరగా ముగుస్తుంది. లేకపోతే క్రమం తప్పుతుంది. అప్పుడు నేను ముందుకూ వెనక్కూ తారాడుకోవాలి. ఇప్పటికే ఒక ముఖ్యమైన ఘట్టం వదిలేసినట్టున్నాను. మాకు పెళ్ళి జరిగిన రోజు, మా నాన్న ఆవడి నుండి తిరిగిరాగానే- నేను ఇంట్లో కనిపించకపోయేసరికి ఏం చేశాడో చెప్పలేదుగదా? " ఏన్షియెంట్ మారినర్ ధోరణిలో ఆదేశించి, ముందుకు సాగిపోయింది.

"నేను కనిపించకపోయేసరికి ఆయనకు పూర్తిగా తిక్కరేగింది. తప్పు తనమీద పడకుండా ముసలావిడ కట్టుకథ చెప్పింది. హఠాత్తుగా ఒక కారొచ్చి ఇంటిముందు ఆగిందనీ, దాన్నుండి ఇద్దరు యువకులు కిందికి దిగి, నన్ను బలవంతంగా కార్లో వేసుకుని ఎత్తుకుపోయారనీ, తను పెద్దగా కేకలేస్తూ వెంటబడినా కారు ఆగకుండా వేగంగా వెళ్లిపోయిందనీ చెప్పింది. అది వినగానే మా నాన్న ఎగ్మోర్ పోలీసుస్టేషన్‌కు వెళ్ళి, నన్నెవరో కిడ్నాప్ చేసినట్టు రాతపూర్వకంగా ఫిర్యాదు చేశాడు. ఇన్‌స్పెక్టర్ నటేష్ మా నాన్నకు సన్నిహితుడు. విరిగిపోయిన కుర్చీలనూ, బల్లలనూ బాగు చేసేపని మా నాన్నకే అప్పగిస్తుంటాడు. అతడు ధీమాగా మా నాన్నతో, 'నాకు వది లేసెయ్. నీ కూతురును నీకు అప్పగిస్తాను. ఈ కాలం కుర్రాళ్లకు సినిమాలను అనుకరించాలని సరదా' అన్నాడట.

అతడు పోలీసు సిబ్బందిని మూలమూలలకు పంపించాడు. మేము అడయార్ అవతల, ఒక మారుమూల బెస్తకాలనీలో తలదాచుకుంటున్నాం. రహస్యంగా ఉన్నా చాలా ఆనందంగా ఉండేది. ఇద్దరు పోలీసులను వెంటతీసుకుని ఇన్‌స్పెక్టర్ నటేష్ అక్కడికొచ్చాడు. ఆ రోజు సముద్రం ఒడ్డున కూర్చుని, కావ్యాల్లో చెబుతుంటారు చూడండి, అలా అన్యోన్యంగా భోజనం చేస్తూవున్నాం. ఇన్‌స్పెక్టర్ నటేష్ నా భర్తను లాక్కెళ్లి చేతులకు బేడీలు తొడుగుతూంటే నాకు ఏడుపొచ్చింది. 'ఏడవద్దమ్మా, నీకేం గాదు' అన్నాడు నాతో.

పద్దెనిమిదేళ్లు నిండని మైనర్ బాలికను బలవంతంగా ఎత్తుకుపోయినట్టు అతని మీద కేసు నమోదు చేశారు. కిరాణా లైబ్రరీకి ఖాతాదారుడుగా ఉండే ఒక లాయరు, నా భర్తకు బాగా పరిచయమున్న మనిషి, ఆ దశలో కలుగజేసుకున్నాడు. 'అంతా బూటకం. ఆ కుర్రాణ్ణి గట్టున పడెయ్యాలి. ముందు బెయిలుమీద బయటికి తీసుకొస్తా' అంటూ సాయపడేందుకు ముందుకొచ్చాడు. మూడోరోజుకంతా నా భర్త విడుదలై, ఎప్పటికిమల్లే లైబ్రరీ ఉద్యోగంలో చేరిపోయాడు.

కేసు వాయిదాలమీద వాయిదాలు పడుతూంటే, మేజిస్ట్రేటు కోర్టు చుట్టూ తిరగడం అతనికీ నాకూ నరకంగా ఉండేది. 'ఇదీ ఒక పెళ్లేనా? ' అంటూ చుట్టపక్కాల మూతి విరుపులూ, మా అమ్మ సాధింపులూ భరించక తప్పలేదు నాకు. అందరూ వెలివేసినట్టు చూసేవాళ్లు. దానికితోడు, అతడు నన్ను బలవంతంగా ఎత్తుకెళ్లి పెళ్లికి ఒప్పుకునేలా హింసించినట్టు తయారుజేసిన పత్రాలమీద సంతకం చెయ్యమని మా నాన్నవకీలు ఊపిరి సలుపనివ్వకుండా ఒత్తిడి చేస్తున్నాడు. నేను

మైనరును కాబట్టి మా వివాహం చెల్లదని అతడు నమ్మించాడు.

ఆ మొత్తం సంఘటనలో అది చెప్పలేనంత విషాదకరమైన అంకం. నన్ను నేను క్షమించుకోలేనంత తప్పు జరిగిపోయింది. మా ముసలిది చెప్పిన కట్టుకథ ఆధారంగా మొత్తం కేసును అల్లుకొచ్చారు. వీధి మొదట్లో ఉండే కొట్టునుండి రెండు అరటిపళ్లు తీసుకుని నేను ఇంటికి తిరిగొస్తున్నప్పుడు, హఠాత్తుగా ఒక కారు నా పక్కలో ఆగి, తలుపుతీసి నన్ను వెనక సీట్లోకి బలవంతంగా లాక్కుని పారిపోయారని ఆ కథనం. ఆ తరువాత ఎక్కడో గుర్తుతెలియని ప్రదేశానికి ఎత్తుకెళ్లి, గదిలో బంధించి, పెళ్లికి ఒప్పుకునేదాకా హింసలు పెట్టి, దండలు మార్చుకునేలా చేశారని. మా అమ్మానాన్నా, ఆ లాయరూ నా గొంతుమీద కూర్చుని సంతకం చేయించుకున్నారు. సాక్షిగా ముసలమ్మతో బొటనవేలి ముద్ర వేయించుకున్నారు. అదంతా అబద్ధమని ఎంత మొత్తుకున్నా వినలేదు. 'అతనికి చెరుపేం జరగదు. క్షమాభిక్ష కింద వదిలేసేలా మన లాయరు చేస్తాడు. ఆ పోకిరి వెధవకు గుణపాఠం నేర్పించేందుకే ఇదంతా. అంతకుమించి మరేంలేదు' అనే సంజాయిషీతో నన్ను లొంగదీసుకున్నారు.

నా భర్తలాయరు ఏవేవో తిప్పలుబడి, నేను పుట్టిన తేదీనీ, గంటనూ గవర్నమెంటు మెటర్నిటీ ఆస్పత్రి నుండి సంపాదించాడు. 1968 మే 18వ తేదీ మధ్యాహ్నం 2.30 గంటలకూ మా పెళ్లి జరిగిందని నిరూపించాడు. 18 సంవత్సరాలకు ముందు, నేను పుట్టింది అదే తేదీ ఉదయం 11.30 గంటలకు. అంటే నా వయసు 18 సంవత్సరాలా మూడు గంటలు. తన క్రాస్ పరీక్షతో సాక్షులను తకబికలు చేసి, ఎత్తుకెళ్ళారనే అభియోగం గూడా అబద్ధమని తేల్చేశాడు. మా వివాహాన్ని ఆమోదిస్తూ కోర్టు తీర్మానించింది.

కేసు ముగుస్తూనే నేను నా భర్తను కలుసుకుని, ముందు చెప్పాను చూడు, అక్కడ కాపురం మొదలెట్టాం. కొంతకాలానికి విరోధాలు మాసిపోయి మా అమ్మానాన్నా దగ్గరయ్యారు. వాళ్ళతో సఖ్యతగా ఉండేందుకు అల్లుడు సుతరామూ ఒప్పుకోలేదు. అత్తగారింటికి వచ్చేందుకే కాదు, అత్తామామల ముఖం చూసేందుకు గూడా ఇష్టపడలేదు. ఐతే, నేను పుట్టింటికి వెళ్ళేందుకు మాత్రం అడ్డుచెప్పడు. మేముండే ఇంటికి వాళ్ళొస్తే, పలకరించకుండా తప్పుకుంటాడు. వచ్చినప్పుడల్లా వాళ్ళు మాకోసం ఏవో పిండివంటలు తీసుకొస్తారు. నేను ఎంత బతిమాలినా అతడు వాటిని ముట్టుకోడు. అతని నడవడిక ఇదివరకటిలా లేదని గమనించాను. మనిషి మొండిగా కఠినంగా మారిపోయాడు. ఎంతోకాలం కష్టాలను ఈది ఈది, ఆఖరుకు అతని వ్యక్తిత్వమే మారిపోయింది. ఆ కేసు గురించో, ఆ విచారణ గురించో అతడంతగా పట్టించుకున్నాడని అనుకోను. ప్రమాణం చేసి నేనిచ్చిన వాంగ్మూలం అతని విశ్వాసాన్ని తునాతునకలు చేసిందని నా అనుమానం. లాయరు నా వాంగ్మూలాన్ని కోర్టులో బిగ్గరగా చదివి వినిపిస్తూ, బాహాటంగా నా సమ్మతిని పలికించిన సందర్భంలో అతని ముఖంలో కనిపించిన భావోద్రేకాన్ని నా జీవితంలో మరిచిపోలేను. ఇప్పుడు మా సంసారంలో వన్నెతగ్గి, యాభయ్యోపడికి చేరిన ముసలి దంపతుల సంసారంలాగా మారిపోయింది. పనితో అలసిపోయి అలా ఉంటున్నాడేమోనని ఉత్సాహం కలిగించేందుకు ఎంత ప్రయత్నించినా- ఫలితం అరకొరగా ఉండేది"

'తప్పనిసరిగా వెళ్ళవలసిన కార్యమొక

టుంది నాకు' అంటూ గొణిగినా ఆ ఢిల్లీ వనిత ఆగింది గాదు.

'అప్పుడు నేను శక్తిమంతమైన విల్లుతో ఆ అల్బట్రోస్‌కు సూటిగా బాణం వదిలాను' అంటుందేమో అనుకున్నాను.

అలాకాకుండా ఆమె, "ఒకరోజు సాయంత్రం అతడు ఇంటికి రాలేదు. అదీ ఆ ముగింపు" అంటూ ఆపింది. ఆ మాట చెప్పేటప్పుడు ఆమె గొంతు కంపించింది. బెత్తెడంత రుమాలు కోసం తన పర్సులో తడిమింది.

ఆమెను అలా వదిలేసివెళ్ళే సందర్భం కాదది. ఒకవేళ నేను వదిలేసినా ఆమె ఉద్వేగం ఆగేదిగాదు. ఆకాశంలో అప్పుడప్పుడే మొలుస్తున్న నక్షత్రాలకు చెప్పుకుంటుంది. ప్లాట్‌ఫామ్ మీద గుడ్డిగా వెలుగుతున్న లాంతరుకు చెప్పుకుంటుంది. గడబిడ చేసుకుంటూ ప్రవేశించే గూడ్సు బండి స్టేషన్‌దాటి వెళ్ళిపోయిన తరువాత గూడా ఆపకుండా ఆమె చెబుతూనే కూర్చుంటుంది.

ఊపిరి పీల్చుకునేందుకు ఆమె ఒకేవొక క్షణం ఆగిపోయిన అవకాశాన్ని పురస్కరించుకుని, "నేను వెళ్ళితీరాల్సిన పెళ్ళొకటుంది. కాలేజీ సమావేశం ఎలాగూ తప్పిపోయిందనుకోండి..." అంటూ నసిగినా ఆమె ఆపలేదు.

"మా ట్రావెల్ ఏజెన్సీలో పనిజేసే ఒక ఉద్యోగికి అతడు కువైట్ విమానాశ్రయంలో కనిపించాడు. అక్కడుండే తోటి ఉద్యోగస్తుల సాయంతో ఆచూకీ తెలుసుకునేందుకు ప్రయత్నించాను. ఆధారం దొరకలేదు. అతడిప్పుడు ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో ఆ భగవంతునికే తెలుసు. నా వరకు చెప్పాలంటే- అతన్ని శాశ్వతంగా పోగొట్టుకున్నాను"

★ ★ ★

ఆ మరుసటిరోజే ఆమె ఢిల్లీ వెళ్ళిపోయింది. ఎన్నో ఏళ్ళుగా, ప్రతిరోజూ వందల సంఖ్యలో వస్తుండే జనాలనూ పోతుండే జనాలను లౌకికదృష్టి మాత్రంగా చూసే స్టేషన్ మాస్టారు, ఆ రోజు, ఆత్మీయత దాచుకోలేక, రైలు ప్లాట్‌ఫామ్ వదిలేప్పుడు కంటినిండా నీళ్ళు పెట్టుకున్నాడు.

"గొప్ప మనసుండే మనిషి. ఇక్కడ ఎన్నిరోజులున్నా కాదనేవాణ్ణి కాదు. ఇన్‌స్పెక్టర్ తనిఖీకి వచ్చినా నా పాట్లు నేను పడి, ఆమెకు ఇబ్బంది కలగకుండా చేసేవాణ్ణి" అన్నాడు.

ఆమెను సాగనంపేందుకు స్టేషన్‌మాస్టారు భార్యాపిల్లలు గూడా అక్కడికొచ్చారు. ఆ చిన్న కప్పుకింద అతడు ఎంత విచ్చలవిడిగా సంతానాన్ని వృద్ధి చేసుకున్నాడో నాకు మొట్టమొదటిసారిగా తెలిసొచ్చింది. ఢిల్లీ వనిత వీళ్లందరికీ, పోర్టర్‌తో సహా, చిన్నాచితకా కానుకలిచ్చి తృప్తిపరిచిందేమోనని సందేహం కలిగింది.

కూతేసి తీరా బండి కదిలే సమయంలో ఆమె తన విజిటింగ్ కార్డును బయటికి తీసి, "చాలా ముఖ్యమైంది. ఈ వీడ్కోలు వేడుకలో మరిచేపోయాను. ఇప్పటికే పది నిమిషాలదాకా.." అంటూ నా చేతికి అందించింది.

దాన్ని అందుకుంటూ నేను, "ఏ చిన్న ఆధారం దొరికినా ఏదో వొక మార్గంలో మీకు సమాచారం అందిస్తాను" అంటూ మాటిచ్చాను.

★ ★ ★

చెమటలు కక్కుకుంటూ ఏకాకిగా కూర్చోనున్న రాన్‌ను చూడగానే నాకు జాలేసింది. "ఓహో! లే, సంతోషంగా గెంతులేసే సమయం ఊడిపడింది" అన్నాను మితిమీరిన ఉత్సాహంతో.

"ఏమిటిది? " అన్నాడు రాన్ నిరాసక్తంగా. నేనేదో పరాచికాలు ఆడుతున్నానని అతని అనుమానం.

"ఏడు ఉత్తరంలో ఆమె ఢిల్లీ వెళ్ళిపోయింది" అన్నాను.

"నమ్మమంటావా? "

"నీ మీద ఒట్టు. వెళ్ళిపోయి గంటయింది. సాగనంపిన సంఘటన నా కళ్ళల్లో ఇంకా మెదులుతూనే వుంది. ఆమె వెళుతూంటే మేమందరం కన్నీళ్ళు పెట్టుకున్నాం"

"అలాగా? ఆమె ఎక్కడికి వెళ్ళుంటుంది? "

"చెప్పానుగా ఢిల్లీకని. పక్క స్టేషనుకు మాత్రం కాదు. చాలా దూరంగా వుండే ఢిల్లీకి."

పడక కుర్చీనుండి అతడు ఎగిరి గంతేసి నిలుచున్నాడు.

"అలా బోర్డులేని హోటల్‌ను ఒకసారి చూసుకుని, ఆ తరువాత అలా విహారం వెళ్లొద్దాం"

"ఎంతదాకా? " అన్నాడు అతడు కదలకుండా.

"ఏటిదాకా"

"ఏరు పెరట్లోనే ఉందిగదా"

"ఇప్పుడది పనికిరాదు. ఎల్లమ్మవీధి దాటిన తరువాత నల్లప్పతోట వస్తుందే, అక్కడ బావుంటుంది"

తటపటాయించాడు. నచ్చజెప్పాను. చివరకు అంగీకరిస్తూ, "ఏ దుస్తుల్లో రమ్మంటావు? " అన్నాడు.

"అడ్డపంచె కట్టుకుని, అరచొక్కా వేసుకో"

ఇటీవలే అతడు ఖాదీ భాండార్‌లో చేనేత బట్టలు తీసుకున్నాడు.

"ఖద్దరు తొడిగితేనే గౌరవం. నువ్వు జాతీయవాదివని, మహాత్మాగాంధీ అనుచరుడివని అనుకుంటారు" అన్నాను.

"ఆయనది చాలా గొప్ప వ్యక్తిత్వం" అంటూ ప్రశంసించాడు రాన్ అసందర్భంగా.

"అయితే అయిందిలేగాని, నువ్వు తొందరగా తెములు. మనం బయలుదేరుదాం"

"అడ్డపంచె నాకు అలవాటులేదు. నడిస్తే కాళ్ళకు అడ్డమొస్తుంది. పైకి కట్టుకుంటే మోకాళ్ళమీద జారిపోతుంది. నడుముల మీద గూడా నిలవదు"

"సరే, నీకు ఏది ఇష్టమైతే అదే వేసుకో. నేను బయట ఎదురుచూస్తుంటాను"

అతని కోసం ఎదురుజూస్తూ పంచలో అరుగుమీద కూర్చున్నాను. కాస్త డాబు తగ్గించి అతడు కేవలం చొక్కా ట్రౌజర్‌లో బయటికొచ్చాడు. ఐనా బజారువెంట వెళుతూంటే జనం మాకేసి వింతగా చూడటం తగ్గలేదు. 'రోజంతా ఈ వింతజంతువు నీ వెంట ఎందుకు పడుతోంది? ' అని నన్ను అడుగుతున్నట్టుగా ఉన్నాయి వాళ్ళ చూపులు.

"వాళ్లు అలా చూస్తూవుంటే నాకు ఇరకాటంగా ఉంటుంది" రాన్ అన్నాడు.

"చూస్తే నీదేం పోతుంది? అలవాటుపడాలి వాటికి. టింబక్టోలో ఏమనుకుంటారో తెలీదుగానీ, ఇక్కడ అలా చూడాలనే కోరుకుంటారు. అది వాళ్ళ సరదా. ఖర్చు లేకుండా వాళ్ళకు సంతోషం కలిగిస్తే తప్పేముంది? "

అతడు జవాబివ్వలేదు. ఎవరివైపూ చూస్తున్నట్టు కాకుండా దూరంగా దిగం

## కొత్తగాలి...

**నల్లమేఘం చల్లనైతే**
**కురుస్తుంది వర్షం**
**నల్లధనం తెల్లనైతే**
**తెస్తుంది మనకు హర్షం**

***– అంబటి వెంకట శివారెడ్డి,***
యర్రగుంట్ల, కడప జిల్లా

తాల్లో చూపులు నిలిపాడు.

"నువ్వుగూడా అలాగే చూస్తే వాళ్లేమను కోరు. చూడకపోతే నష్టపోయేది మనమే. ఎంత సంతోషం కోల్పోతాం, ఎంత లోక జ్ఞానం కోల్పోతాం!" అన్నాను. దీనికి గూడా అతడు జవాబివ్వలేదు. బహూశా నేను ఎగతాళి చేస్తున్నా ననుకున్నాడేమో. 'వీడొక తలతిక్క జర్నలిస్టు' అనుకొనుం డచ్చు.

ఇసుక మైదానంలో కలిసి ఎల్లమ్మవీధి అంతర్ధానమయ్యే కొసకు చేరుకున్నాం. దానికి ఆవల ఏరు కొద్దిపాటు మలుపు తిరుగుతుంది. పిల్లలూ, పెద్దలూ, విద్యార్థులూ, వృద్ధులూ- చిరకాల స్నేహితులు, ఇసుకమీద గుంపులు గుంపులుగా కూర్చొనున్నారు. యువకుల గుంపులు వాడిగా వేడిగా వాదోపదాల్లో మునిగున్నాయి. ఇక తన సరుకును ఎలుగెత్తి ప్రకటిస్తూ వేరు శెనగకాయల తట్టతో గుంపుగుంపునూ తాకుతున్న వ్యాపారి సరేసరి. దిగుడు మెట్లమీద కొంతమంది బట్టలు ఉతుక్కుంటున్నారు. కొంతమంది నదిలో దిగి స్నానం చేస్తున్నారు. ఒడ్డున కొంతమంది బాసికపట్టులో కూర్చుని సంధ్యావందనం చేస్తున్నారు. నల్లప్పతోటను ఆనుకుని జనంలేని తావు కనిపించింది. అటూ ఇటూ తిరిగే ఎడ్లబండ్లూ, ఇంటిముఖం పట్టిన పశువులూ తప్ప అక్కడ మనుషులు లేరు. రాన్ ఇబ్బందిపడకుండా కూర్చునేందుకు పెద్ద బండరాయిని చూపించి, నేను ఇసుకలో కూర్చున్నాను. దూరంనుండి మార్కెట్ రొద మంద్రంగా వినిపిస్తూ వుంది. గూటికి చేరుకునే పక్షులు కిలకిలా రావాలు చేస్తున్నాయి. నులివెచ్చని సాయంకాలం చెట్ల కొసకొమ్మలమీద నీరెండ ఏటవాలుగా పడి ఆహ్లాదం కలిగిస్తోంది. కేరింతలు కొడుతూ ఇసుకలో పరిగెత్తే పిల్లలను చూస్తూ అతడు ఉన్నట్టుంది.

"పిల్లలకూ ఇసుకకూ ఉన్న అనుబంధం గమనించావా? ఇది ప్రపంచవ్యాప్తంగా కనిపించే అనుబంధం- దేశం ఏదైనా కావచ్చు, ఖండం ఏదైనా కావచ్చు"

అతని కంఠంలో పలికే మృదుత్వం నాకు నచ్చింది.

"ఇదే మానవాళినంతా ఏకం చేస్తున్న అనుబంధం. మనిషికీ మనిషికీ తేడా లేదని నిరూపిస్తుంది- ఇసుకా, పిల్లలూ " అంటూ ఆపేసి, నేలమీదినుండి సాధారణంగా చూపుల్లో పడని ఏదో గడ్డిమొక్కను తుంచి, ఆ రెమ్మను వేళ్ళతో పట్టుకున్నాడు. పాలిపోయినట్టుండే ఆకులూ, గుండుసూది తలకాయంతుండే తెల్లని పువ్వులూ- ఇసుక మైదానంలో దాన్ని గమనించడమే కష్టం. దాన్ని చూస్తూ అతని కళ్లు ఇదివరకెన్నడూ కనిపించని మెరుపుతో ప్రకాశించాయి.

"రేపో మాపో మన గ్రహాన్ని సంపూర్ణంగా ఆక్రమించే గడ్డి ఇది" అన్నాడు ఆత్మవిశ్వాసం ధ్వనించేలా.

"రకరకాల పేర్లతో ఇది ఎక్కడపడితే అక్కడ, ప్రపంచ దేశాల్లో ప్రతిచోటా, విస్తరించుకుంటూ పోతోంది. కొన్నిచోట్ల దీన్ని 'కాంగ్రెస్ కలుపు' అంటారు. వాళ్ల ఉద్దేశంలో ఉండేది ఏ కాంగ్రెసో నాకు తెలీదు. కొన్నిచోట్ల 'మీర్జాకంప' అంటారు. ఇంకా కొన్నిచోట్ల 'దొరకుచ్చు', 'ఊడో పువ్వు' పేర్లతో పిలుస్తారు. ఏ పేరుతో పిలిచినా ఇది చొరబాటుదారే. గ్రహశకలాల రాపిడితో రాలిన పొడినుండి పుట్టుకొచ్చిందని అనుమానం. ఇది లేని ప్రదేశమే ప్రపంచంలో నాకు కనిపించలేదు. నిర్మూలించేందుకు సాధ్యంగాని చీడ. అడ్డూ ఆపూ లేకుండా దీని సామ్రాజ్యం విస్తరిస్తూవుంది. ఏమేరకు విస్తరిస్తోందో అధ్యయనం చేసి, హెడ్ క్వార్టర్స్‌కు నివే

దిక పంపించాను"

'ఏ హెడ్ క్వార్టర్సు?' అనే ప్రశ్నను నాలోనే అణచుకున్నాను. 'ప్రాజెక్టు' అనే పదంలాగే, ఇది గూడా అయోమయమైన పడికట్టు పదం.

ఏదో ఉత్సాహం ఊదుకొచ్చినట్టు అతడు మళ్ళీ అందుకున్నాడు. "దీన్ని అంతంజేసే కలుపుమందును ఇంతవరకు ఎవరూ కని పెట్టలేకపోయారు. మందు మొదటి దఫా కొట్టగానే చనిపోయినట్టే కనిపిస్తుంది. ఐతే, రెండవ తరం మొక్క ఆ మందును లెక్కచెయ్యదు. ఉగాండాలో మేము దీన్ని పరిశోధించాం. ఇది నెరుసుకునే ఉధృతిని కంప్యూటర్ సహాయంతో అంచనా వేశాను. ఈ దామాషాలో పెరిగితే, క్రీ.శ. 3000ల నాటికి భూమండలమంతా దీంతో నిండిపోతుంది. ఏ ఇతర జాతి మొక్కనూ ఇది పెరగనివ్వదు. ఇతర మొక్కలూ ఉండవు. ఇది ఆహారంగా పనికొచ్చేది కాదు. పైగా విషపూరితం. అందువల్ల, మనిషికి ఆహారమే దొరకదు. చూశారో లేదో, పశువులు దీన్ని ముట్టనైనా ముట్టవు. అదీగాక ఇది భూగర్భంలో వుండే నీటిని మొత్తం పీల్చేసి ఆవిరిగా మారుస్తుంది. దీన్ని గురించి నేను సేకరించిన సమాచారం బోలెడుంది. నా పుస్తకం అచ్చయితే అది పెద్ద సంచలనమవుతుంది"

"ఇంతకూ, నువ్వు అధ్యయనం చేసిన రంగమేదో?" ఆపుకోలేక అడిగాను.

అతడు నానుండి ప్రశ్నల కోసం ఎదురు చూస్తున్నాడని అనిపించింది గూడా. పాపం, నిరాశపరచడమెందుకు? అతని మీద జాలేసింది. కనికరం చూపించాలని కోరిక కలిగింది. విచిత్రమైన వేషంతో, వితండమైన ప్రవర్తనతో ముచ్చటగొలిపిస్తూ, నాకు కోరినంత వినోదం అందిస్తున్న మనిషికి ఆ రవ్వంతసేపు తల అప్పగించేందుకు గింజుకోవడం

త్వరలో

కాశీవిశ్వనాథ్

సరికొత్త హాస్య నవల

ఈరాక నీకోసమే

చతురలో..

న్యాయమా?

నా ప్రశ్న అతనికి ఆనందం కలిగించింది. "ఈ రంగాన్ని 'ఫ్యూచరాలజీ' అనుకోవచ్చు. మనకుండే వనరులు, మనకుండే ప్రమాదాలు- అవి మనుషుల ద్వారా కావచ్చు, సాధనాల ద్వారా కావచ్చు- వాటిని మొత్తంగా అంచనా వేసే రకరకాల అధ్యయనాలకు గుత్తగా వాడే పదమిది. అన్ని రకాల శాస్త్రాలూ ఇందులో విలీనమై ఉంటాయి. శాస్త్రీయంగా అధ్యయనం చేసి, క్రీ.శ. 3000 నాటికి మానవుని జీవన పరిస్థితులు ఎలా ఉంటాయో అంచనా వేసుకుంటేనే అప్పటిదాకా మానవజాతి నిలుస్తుందో నిలవదో తెలుసుకోగలుగుతాం"

ఆపుకోలేక పగలబడి నవ్వుతూ, "నా

**కొత్తగాలి...**

**చేతికి పూచిన**
**పూవు**
**సెల్‌ఫోన్**

– జి. శ్రీశైలం,
పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

అభిప్రాయం వరకు చెప్పమంటే- పది శతాబ్దాల తరువాత జరగబోయేదాన్ని గురించి తల బాదుకోమంటే నేను బాదుకోను. అప్పటికి మనలో ఏ వొక్కరం, ఎంత సుదీర్ఘంగా జీవించగల మనిషైనా సరే, ప్రాణంతో ఉండం. అందుకని-" అన్నాను.

"అంత తేలిగ్గా చెప్పొద్దు. జీవశాస్త్రం, వైద్యరంగాలు ఇటీవలికాలంలో సాధించిన పురోగమనం చూస్తే, చావనేదే లేకుండా జీవించే అవకాశం మనుషులకు వస్తుందో ఏమో"

"చిరంజీవిగా బతకాలనే అభిలాష నీకుందేమో గానీ, నాకు లేదు"

"దానికోసం నువ్వు పరితపిస్తున్నావా లేదా అన్నదిగాదు ఇక్కడ సమస్య. ఆ దిశగా మానవజాతి మన ప్రమేయం లేకుండానే ముందుకు అడుగేస్తోంది. అందువల్ల ఈ ఆటుపోట్లనూ, వాటి సంకేతాలను బేరీజు వేసుకుని ఇప్పటి నాగరికత ఏమేరకు నిలుస్తుందో అంచనా వేసుకోవడం తప్పనిసరి"

"నేను కాలేజీలో చదువుకునే రోజుల్లో ప్రతి తొమ్మిది సెకండ్లకు కనీసం ఒక్కసారైనా 'ఉద్రేకాలు', 'సంకేతాలు', 'ధోరణులు' అనే పదాలను ఉపయోగించకుండా మాట్లాడలేని మా సైకాలజీ ప్రొఫెసర్‌ను గుర్తుకు తెస్తున్నావు" అన్నాను.

★ ★ ★

ఆ తరువాత, ఈ బడాయిమనిషి గాలి తీసేందుకు నేను పూనుకున్నానంటే, దానికి కారణం ఇదీ-

మా లైబ్రేరియన్ ముసలాడికి ఒక మనవరాలుంది. దాదాపుగా ప్రతి రోజూ మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతంలో అతనికోసం ఒక ఫ్లాస్కులో కాఫీ, ఇత్తడి గిన్నెలో ఏదో టిఫినూ తీసుకొస్తుంది. ఉదయం లైబ్రరీకి వచ్చే ముందుగా ఆ ముసలాయన అన్నం తినేసి వస్తుంటాడు. గంటలు గడిచేకొద్దీ, టిఫిన్ అందే సమయందాకా అనులోమ నిష్పత్తిలో అతడు కుర్చీమీద నీరసించిపోతుంటాడు. లైబ్రరీకి వచ్చేవాళ్లెవరైనా ఆ సమయంలో ఏదైనా అడిగితే మండిపడి, 'ఇక్కడ కూలబడి ఈ దుమ్ము పట్టిన పుస్తకాలకు కాపలా కాయమని నా బతుక్కు రాసిపెట్టుంది. అది చాలక మళ్లీ ఆ పుస్తకం కనిపించలేదంటే? అది లేదు గాబట్టి కనిపించదు. అంతకంటే చెప్పేందుకేం లేదు. వెళ్లి నీ సీట్లో కూర్చో. గాలి తగలకుండా నాకు అడ్డంగా

నిలుచోకు' అంటూ కసురుకుంటాడు. ఆ అమ్మాయి రాక ఏకొంచెం ఆలస్యమైనా అతని వాలకం అలా మారిపోతుంది. ఐతే, సర్వసాధారణంగా ఆమె ఆలస్యం జరుగనివ్వదు.

ఆ అమ్మాయి కంటపడగానే అతని ధోరణి మెత్తబడుతుంది. ఆమెను ఆప్యాయంగా ఆహ్వానిస్తూ, 'రా బుజ్జీ, రా. ఈ రోజు నాకోసం ఏం తీసుకొచ్చావమ్మా?' అంటాడు చిరునవ్వుతో. ఆ పిల్ల కనిపిస్తే చాలు, అతనికి ఎక్కడా లేని ఆనందం. కుర్చీ నుండి లేచి, 'నేను తిరిగొచ్చేదాకా ఇక్కడ కూర్చోమ్మా' అంటాడు. కాఫీ ఫ్లాస్కూ, టిఫిను గిన్నె పెట్టుకొచ్చిన ప్లాస్టిక్ సంచిని అందుకుని, లైబ్రరీ వెనకుండే గదిలోకి తీసుకుపోతాడు. ఆ గదికి కుళాయి వసతివుండే స్నానాలగది అనుబంధంగా ఉంది. అతని సీటులో కూర్చున్న అమ్మాయి కుళాయినుండి నీళ్ళు దూకే శబ్దాన్ని గమనిస్తూ వుంటుంది. మొదటిసారి వినిపించినప్పుడు తాత చేతులు కడుక్కుని తినేందుకు ఉపక్రమిస్తున్నాడనీ, రెండోసారి వినిపించినప్పుడు తినడం పూర్తిజేసి చెయ్యి కడుగుతున్నాడనీ ఆమెకు తెలుసు. అతడు తిరిగొచ్చిన వెంటనే కుర్చీనుండి లేచి, సీటు అప్పగిస్తుంది. ఆ కాలనియమంలో ఆవగింజంత తేడా సంభవించదు. అనుకున్న సమయానికి ఆ ముసలాడు గళ్ళగళ్ళ తుండుగుడ్డతో మూతి తుడుచుకుంటూ, ఆకలిని ఓడించిన సంతృప్తితో తిరిగొస్తూ కనిపిస్తాడు.

'ఇంటి దగ్గర అంతా కులాసేగదా?' అని అడిగి, 'కులాసాగాక ఏముంటుంది? ఉండేందుకు వీల్లేదు...' అంటూ తానే సమాధానం చెప్పుకుంటాడు.

'పంచదార అయిపోయింది. అమ్మమ్మ పక్కింట్లో బదులుకు తీసుకొచ్చింది'

'సాయంత్రం ఇంటికి వచ్చేప్పుడు తీసుకొస్తానని మీ అమ్మమ్మకు చెప్పు బుజ్జీ'

ఆ అమ్మాయికి దగ్గర దగ్గర పదిహేనేళ్ళుంటాయి. ఐనా ముసలాయన 'బుజ్జీ' అనే పిలుస్తాడు. ఆ పిల్ల రాక, ఆ పిల్ల మాట, ఆ పిల్లను గురించిన ఆలోచన ఆ ముసలాడికి మహాప్రీతి. ఆమె ఆల్బర్ట్ మిషన్ కాలేజీలో ఇంటర్ చేస్తోంది. మంచి పొడగరి. అందగత్తె కాకపోయినా, తరుణ యవ్వనంలో గాడిదగూడా ముద్దొస్తుంది.

ఆ అమ్మాయి సీటులో కూర్చొనున్న ఒకానొక మధ్యాహ్నం రాన్ లైబ్రరీలో ప్రవేశించాడు. ఆ సమయంలో నేను పత్రికలుండే బల్ల దగ్గర కూర్చుని ఏదో సమాచారం కోసం- ఏ సమాచారమో ఇప్పుడు గుర్తులేదు- పత్రికలు తిరగేస్తున్నాను. నేను హాలు చివర్లో ఉన్నందువల్ల అతడు నన్ను చూడలేదు. కానీ అమాయకంగా గడ్డి మేస్తున్న జింకపిల్ల మీద లంఘించేందుకు సిద్ధమైన చిరుతకు మల్లే అతడు సర్వేంద్రియాలూ సన్నద్ధం చేసుకుని లైబ్రేరియన్ బల్లను సమీపించడం నాకు కనిపించింది.

'ఏమిది? ఈ టౌనుహాలు లైబ్రరీలో ఇంత గొప్ప ఖజానా ఎలా వచ్చింది? ఆ ముసలాడు చచ్చిపోయి, నా అదృష్టంకొద్దీ ఈమెకు ఆ ఉద్యోగం రాలేదుగదా?' అనుకుంటున్నాడని నాకనిపించింది. ఆ పిల్లమీద మోజులు వెదజల్లే చూపులు విసిరేస్తూ, పాశ్చాత్య సంప్రదాయంలో ఆడవాళ్ళను గౌరవించే పద్ధతి పాటిస్తూ ముందుకు వంగి, ఆ చంటిదాన్ని ఆకర్షించే నడవడిక ప్రదర్శించాడు.

'ఒరేయ్, ఆగరా దుర్మార్గుడా. అంతటితో ఆపేసి ఆ అమ్మాయిని వదిలెయ్. నిన్ను ఎంత నీచంగా పిలవాలో నాకు తెలీడం లేదు. ఆ అమ్మాయిది నీ కూతురు

వయసు. నువ్వొక కామపిశాచివి. మనుమరాలినైనా వదిలేవాడివి కాదని నాకు తెలుసు. ఆ పిల్ల జోలికి పోకుండా తప్పుకో' అంటూ హాలంతా గజగజలాడేలా అరవాలనిపించింది.

ఆ అమ్మాయి ఏదో చెప్పింది. ఇద్దరూ గొల్లున నవ్వుకున్నారు. తిండి తొందరగా ముగించుకుని ముసలాడు వెంటనే రావాలని కోరుకున్నాను. కానీ తిన్న తరువాత ఓ పదిహేను నిమిషాలు పడకకుర్చీలో కునుకుతీసే అలవాటుంది ఆ ముసలాడికి. సాధారణంగా అది లైబ్రరీలో పెద్ద రద్దీ లేని సమయం కావడంతో, ఆ కొద్దిసేపు అతడు మనవరాలిమీద బాధ్యత వదిలేస్తాడు. ఆ సమయమే రాన్‌కు కలిసొచ్చే ముహూర్తమైంది. వెంటనే అడ్డుకోవడం మంచిదనిపించి, నేను పత్రిక మడతేసి బల్లమీదుంచి, లైబ్రేరియన్ సీటువైపు నడిచాను.

నేను రావడం చూసి, ఆ అమ్మాయి బిగ్గరగా, "మామయ్యా, ఈయన టింబక్టో నుండి వచ్చాడట. అలాటి నగరమే ఉన్నట్టు నాకు తెలీదు. అది ఎక్కడుంటుంది? " అంది.

"అతన్నే అడుగు" అన్నాను భౌగోళిక సమస్యలో తలదూర్చడం ఇష్టంలేక.

సందర్భాన్ని సొమ్ము జేసుకునేందుకు రాన్ సిద్ధమయ్యాడు. ఆమె కూర్చున్న బల్లవైపు రెండడుగులేసి, "ఒక తెల్లకాగితం ముక్క ఇలా ఇవ్వు, చూపిస్తా" అన్నాడు.

నాజూకుగా, స్టైలిష్‌గా ఉండే బంగారు కలంతో కాగితం మీద ఏదో మ్యాపు గీసి, "ఇదీ ఇప్పుడు మనముండే ప్రదేశం. టింబక్టో ఎక్కడ ఉందంటే-"

ఆ అమ్మాయి అతనికి దగ్గరగా వంగింది. అంటే, ఆ పిల్లమీద అతడు మత్తు చల్లేస్తున్నాడని నాకు అర్థమైంది. ఎందుకంటే, ఏ తలనూనె వాసనా, ఏ ఆఫ్టర్‌షేవ్ లోషన్ వాసనా అడవాళ్ళను అతనికి దాసోహం చేశాయని నా అనుమానమో, ఆ వాసనలను ఆ అమ్మాయి ఆస్వాదిస్తున్నట్టు కనిపించింది. ఆ విద్యలో ఆరితేరిన రాన్, ఆ బలహీనతను పసిగట్టిన మరుక్షణం, చనువును పూర్తిస్థాయికి పెంచేశాడు. హార్మోనియం మీద వేళ్ళను ఆడించినట్టు, తన చూపుడువేలినీ నడిమి వేలినీ ఆ కాగితంమీద విలాసంగా ఆడిస్తూ, ఏవేవో ప్రదేశాలను చూపిస్తూ, టింబక్టో చరిత్రనూ, దాని వాతావరణాన్నీ, వైభవాన్నీ, ఇంకా ఇతర విషయాలనూ కూలంకషంగా వివరించడం మొదలెట్టాడు. మధ్య మధ్యలో అమెకు దగ్గరగా వంగుతూ, ఏదో రహస్యం చెప్పినంత మెల్లిగా, 'అర్థమైంది గదా? ' అంటూ అడుగుతున్నాడు. నా ఆందోళనంతా అతడు చాలా దూరం వెళ్ళాడని. లేదా మరోలా చెప్పాలంటే, ఆ అమ్మాయి మీదికి మరీ దగ్గరగా వంగుతున్నాడని. అంతలో ముసలాయన ప్లాస్టిక్ సంచి చేత్తో పట్టుకుని, తృప్తి కనిపించే ముఖంతో తన సీటును సమీపించాడు. అతిథివైపు ఆప్యాయంగా చూశాడు. ఫుల్‌సూటు మానేసి రాన్ నూలుప్యాంటూ, నూలుషర్టులోకి వేషం మార్చుకున్న తరువాత, ఆ ముసలాడు మొదటిరోజు చూసినప్పుడు జడుసుకున్నట్టుగా జడుసుకోవడంలేదు. మనవరాలు లేచి ప్రక్కకు తప్పుకోగా అతడు సీట్లో కూర్చుంటూ, "కనిపించి చాలారోజులైంది. కులాసాగా ఉన్నారు గదా? " అన్నాడు రాన్‌తో.

"థ్యాంక్స్" అంటూ నడుంవంచి కృతజ్ఞత తెలిపాడు రాన్. ఒకమారు ఆ అమ్మాయిని మెప్పించేందుకూ, చనువు పెంచుకునేందుకూ, చంకలో ఇరికించుకునేందుకూ మదనకామరాజు కథల్లో నాయకుడిలానూ, మరోమారు ఆ అమ్మాయికి దగ్గర కావా

# వాళ్లు.. వీళ్లు.. పారిజాతాలు!

పువ్వులా సున్నితంగా పుట్టింట్లో పెరిగిన నీలూకు తన ప్రమేయం లేకుండానే హఠాత్తుగా పెళ్లయిపోయింది. సున్నిత హృదయురాలైన ఆమె అత్తగారింట్లో ఎలాంటి అనుభవాలు చవిచూసింది? సుందర సుకుమార పారిజాతాల్లాంటి ఆడపిల్లలు కుటుంబ పరువు- ప్రతిష్ఠల పేరుతో అత్తారిళ్లలో ఎదుర్కొంటున్న అమానవీయ పరిస్థితుల్ని ఆర్ద్రంగా, కవితాత్మకంగా వెల్లడించిన సుప్రసిద్ధ రచయిత్రి చంద్రలత వాళ్లు.. వీళ్లు.. పారిజాతాలు! మీకోసం..

చతుర
జూన్ నెల
కానుక



లంటే ఎవరి సహకారం తప్పనిసరో ఆ ముసలాడి మెప్పుకోసం అంతర్జాతీయ విద్యావేత్త స్థాయిలోనూ అతడు ప్రదర్శించిన బహుముఖ కళానైపుణ్యం నూటికి నూరుపాళ్ళా విజయం సాధించిందని అంగీకరించక తప్పదు.

రాన్ గురించి నాకు అందుతున్న వదంతులు అంత రుచించేవిగా లేవు. బోర్డులేని హోటల్లో గుండూరావు కనిపించి, నా దగ్గరకొచ్చి చెవి దగ్గర "నీకో విషయం చెప్పాలి" అన్నాడు. అతడు మున్సిపాలిటీలో ఉద్యానవనాల శాఖకు అధికారి. టౌనుహాలుకు చుట్టూ పార్కు పేరుతో పిలవబడే ప్రదేశాన్ని సంరక్షించేదీ, కలెక్టరేట్‌లోనూ పోలీసు ప్రధాన కార్యాలయంలోనూ చావలేక బతుకుతున్న పచ్చిక తివాచీని పోషించేదీ, స్వాతంత్ర్య దినోత్సవం, గాంధీజయంతి వంటి జాతీయ పర్వదినాల్లో ఫౌంటెన్ను చూసుకునేదీ ఈయనే.

మమ్మల్ని గమనించిన వర్మ, "ఏదైనా రహస్యమా? " అన్నాడు.

"అంతగా తెలుసుకోవలసింది కాదు" అన్నాడు ముసిముసి నవ్వులతో గుండూరావు.

పనిమీదికి ధ్యాస మళ్లించి అంతటితో వర్మ మమ్మల్ని వదిలేశాడు.

కాఫీ పూర్తిజేసి నేను బయటికి రాగానే, వీధిలో నా కోసం ఎదురుజూస్తూ గుండూరావ్ నిలుచోనున్నాడు.

"నీ ఇంట్లో ఉంటున్నాడే ఒకతను, ఎవరా మనిషి? "

"నీకెందుకో? " అతడు కూపీలాగుతున్న విధానానికి మండిపోయి అడిగాను.

"మెంపిరోడ్డు చివర్లో క్రిస్టియన్ల సమాధులున్నాయి, తెలుసుగదా"

"వాటితో నాకు ఎలాంటి అవసరం లేకపోయినా, ఉన్నాయనిమాత్రం తెలుసు"

"అక్కడా పొదలను తీసేసి శుభ్రం జేసే పని నా నెత్తిన పడింది. కలెక్టరు పిలిచి అప్పగించాడు. ఆ సమాధులను గురించి పట్టించుకునే అవసరం ఆయనకు ఎందుకొచ్చిందో నాకు తెలీదు. అది నా డ్యూటీ కాకపోయినా, కలెక్టర్ను కాదనలేంగదా?"

"నిజమేగదా. కానీ, నువ్వు నాతో చెప్పాలనుకున్నది వేరే విషయం"

"ఔనౌను. నీ ఇంట్లో వున్నాడే, ఆ మనిషి గురించి. ఎప్పుడు చూసినా అతడు అక్కడే కనిపిస్తాడు. ఆ చిట్టచివరుండే బెంచీలో కూర్చోనుంటాడు. ఎవరో అమ్మాయితో కలిసి ఆ అమ్మాయి ఎవరో నాకు తెలుసుగానీ, నీతో ఎందుకులే చెప్పడం. ఆ శ్మశానం ఇక్కడికి ఐదుమైళ్ళు ఉంటుంది. రోజూ అంతదూరం సైకిలు తొక్కలేక నా చావు నేను చస్తున్నాను. పోకుండా మానేద్దామా అంటే, వాటిని కాపలా కాసే మునలాడు ఉండేదేమో అక్కడే రేకుల షెడ్డులోనైనా, ఇలావుండే పుల్లను అలా జరపడు. పని జరగకపోతే కలెక్టరు కేకలేసేది నా మీద. ఆ కలెక్టరుకు ఈ సమాధులతో ఏ అవసరమొచ్చిందో నాకైతే ఇప్పటికీ అంతుబట్టదు"

"నాగ్గాడా అంతుబట్టదు గానీ, ఆ మనిషిని గురించి చెప్పేదేమైనా వుంటే చెప్పు"

"ఆ ఆ, అక్కడికేవస్తున్నా, వాళ్ళు అంత దూరం ఎందుకొస్తున్నారా, ఎలా వస్తున్నారా అనుకున్నాను. అప్పుడు గేటు దగ్గర స్టాండ్‌వేసిన స్కూటర్ కనిపించింది. ఆ అమ్మాయిని వెనకసీట్లో కూర్చోబెట్టుకుని ఇటీవల ప్రతిరోజూ తీసుకొస్తున్నాడు. అలాటివి నాకు గిట్టదనుకో- ఆడామగా అనుకుని కూర్చుంటే, వాళ్ళవైపు నేను చూడలేను. చూడాలంటే నాకెందుకో పెద్ద ఇబ్బందిగా ఉంటుంది"

ఒకరోజు మేజిస్ట్రేటు కోర్టు వరండాలో మెట్రో థియేటరు మేనేజరు నటరాజు కనిపించి, "మీరు మా థియేటర్‌మీద శీతకన్ను వేశారు. మేము చేసిన పాపమేమిటో? సీట్లమీద కుషన్ అమర్చి నైలాన్ తొడిగించాము. ఏదో వొక సమయంలో కాస్త తీరిక చేసుకుని అలా వచ్చి, కొత్తగా ఏర్పాటు జేసిన సౌకర్యం గురించి నాలుగు ముక్కలు రాస్తే ఏంపోతుంది? ఇప్పుడు కరాటేవీరుడు హీరోగా నటించిన సినిమా నడుస్తోంది. హౌస్‌ఫుల్.. ఏ ఆటకు చూసినా హౌస్‌ఫుల్ అంటే నమ్మండి. మొన్నటిరోజు, మీ ఇంట్లో ఉన్నాడే, ఆయన రెండు సీట్లు రిజర్వు చేయించుకున్నాడు. సీట్ల ఏర్పాటును పెద్దగా మెచ్చుకున్నాడు. ఎన్నోదేశాలు తిరిగిన మనిషిగదా"

ఇక మార్కెట్ గేటు దగ్గరున్న జయరాజు సరేసరి. పట్నంలో ప్రాణం పోసుకునే పుకార్ల ప్రవాహానికంతా అతని కొట్టు జలాశయంతో సమానం. ఏయే మనుషులు ఏమేం చేస్తున్నారనే సమాచారం వాగులై, వరదలై, నదులూ ఉపనదుల ద్వారా అతని కొట్టుకు ప్రవహిస్తుంది. ఎక్కడ ఏం జరగబోతోందో తెలుసుకునేందుకని అతని కొట్టు దగ్గర కాస్సేపు మకాం వేయడం నాకు అలవాటు.

"నీ అతిథి చాలా చలాకీగా తయారయ్యాడు. రోజూ కెనెడీ దగ్గర సైకిలు అద్దెకు తీసుకునే మనిషి, ఉన్నట్టుండి మానేసి అతని నోట్లో దుమ్ము కొట్టాడు. ఎందుకో తెలుసా? సాంబు స్కూటర్ అతనికి ఉచితంగా దొరికింది. ఆ పెద్దమనిషికి స్కూటర్‌తో అవసరం ఎందుకొచ్చిందో తెలుసా?"

"వెనక సీట్లో ఎవరినో తోడుజేసుకునేందుకేనా?"

"ఆ తోడు ఎవరనుకువున్నావు? "

"తెలుసు ఊహించాను"

"అదీ సమాచారం. అబ్బో, అ అమ్మాయిమీద ఎంత శ్రద్ధ చూపిస్తున్నాడో" అన్నాడు జయరాజు అపహాస్యంగా. తప్పెటతో పుకార్లను చాటింపేసే అతని ఉత్సాహానికి కోరినంత మేత దొరికింది.

"దినసరి కార్యక్రమం చెప్పమంటావా? 10.30కి టౌనుహాలు ప్రహరీగోడకు వెనగ్గా స్కూటర్‌తో సిద్ధంగా ఉంటాడు. 10.35కు సాంబు స్కూటర్ వెనకసీట్లో ఆ అమ్మాయి కూర్చుంటుంది. 10.58కి లెవెల్ క్రాసింగ్ దగ్గర దిగి, ఇంటినుండి కాలినడకన వస్తున్నట్టు ఆ అమ్మాయి ఆల్బర్ట్ మిషన్ కాలేజి కాంపౌండు చేరుకుంటుంది. కాలేజీ వదలగానే తిరిగి లెవెల్ క్రాసింగ్. అక్కడినుండి ఎక్కడికంటావా, అది నన్ను అడగొద్దు"

ఇంకా ఎందరెందరో, ఎవరికి తోచిన ధోరణిలో వాళ్లు, పనిగట్టుకుని నా దృష్టికి తీసుకొచ్చారు. ఒకరోజు ఉదయం లైబ్రరీకి వెళితే, లైబ్రేరియన్ ముసలాయన నాతో, "కొన్ని రోజులుగా బుజ్జి నాకు కనిపించడమే లేదు. టిఫిన్ తీసుకొచ్చేదా? ఇప్పుడు అదీ లేదు. ఎవరో ఒకరు తెలిసినోళ్లకు లైబ్రరీ వదిలేసి, నడుచుకుంటూ ఇంటికి వెళ్ళొస్తున్నాను. లైబ్రరీకి రోజూ వచ్చే పాత పాగిల్లో ఎవరోఒకరు- పాపం, నేను వచ్చేదాకా కాదనకుండా కూర్చుంటున్నారు. పది నిమిషాలు కునుకుదీసి గూడా వస్తున్నాను. బుజ్జి ఎనిమిదింటిదాకా ఇంటికి చేరడం లేదు. ఇంటర్ ఆఖరు సంవత్సరం గదా, స్పెషల్ క్లాసులూ పాడూ ఉంటాయనుకుంటా. రేపోమాపో ఇంటరు పాసైతే నాకు అంతకంటే కావలసినదేముంది? ఆ తరువాతంటావా, అది వాళ్ళ అమ్మానాన్నల ఇష్టం... అలా వదిలేద్దామంటే నా అల్లుడు అంత తెలివైనోడు కాదు. వాడి భార్య, అంటే నా కూతురు, వాడిలాగే మారిపోయింది. మద్రాసూ కలకత్తా వంటి నగరాల్లో ఉండేవాడికి నా కూతుర్ని ఇద్దామనుకున్నాను. ఐతే వీడిది బోలెడంత ఆస్తి. మద్రాసులో చదువుకుంటూ ఉన్నాడు. సివిల్ సర్వీసుకు రాస్తాడనుకున్నాను. తండ్రిపోగానే వీడు పల్లెకొచ్చి, అక్కడే నిలిచిపోయాడు. ఇప్పుడు వాడి తలనిండా ఆవుపేడ. దాని వాడకం తప్ప వేరే ఆలోచనే లేదు. ఆ పేడ కోసం ఒక గోబర్‌గ్యాస్ ప్లాంటును తెచ్చుకున్నాడు. వాడి పెళ్ళాం నోట ఎప్పుడు చూసినా

## ఏప్రిల్ - 2011
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. **ఎం. కొండారెడ్డి**
   - శివునిపల్లి, కడప జిల్లా
2. **డి. వసుంధర దేవి**
   - కరీంనగర్
3. **శైలశ్రీ**
   - పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా
4. **ఎం. రామచంద్రరావు**
   - హిల్‌కాలనీ, నల్గొండ జిల్లా
5. **వి.వి.ఆర్. నర్సయ్య**
   - హన్మకొండ, వరంగల్ జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. సరళ | 6. చంచల |
| 2. సునంద | 7. కురతుల్ ఐన్ హైదర్ |
| 3. కరుణ | 8. అనతోల్ ఫ్రాన్స్ |
| 4. రాకేష్ | 9. అమెరికా |
| 5. కుమార్ | 10. విశ్వనాథ |

గ్యాసూ, గ్యాసూ, గ్యాసు. దాంతోనే వంట చేసుకుంటారు. దీపాలు వెలిగించుకుంటారు. సెలవుల్లో బుజ్జిని వాళ్ళ దగ్గరికి పంపితే, పట్టుమని పదిరోజులు ఉండ లేదు. అక్కడికీ నేను ఉండమని ఒత్తిడి చేస్తుంటాను. ఉంటేనా. ఆ రకం జీవితమే దీనికి పడదు. ఆ పిల్లను పదేళ్ళ వయసులో చదువుకోసమని ఇక్కడికి తీసుకొచ్చాను.

ఇంటర్ పూర్తైతే ఆ తరువాత? రేయింబవళ్ళు నాకు అదే ఆలోచన. బుజ్జిని ఆఫీసరుగా చూడాలని నా కోరిక. దూరంగా పోకుండా, ఏదో ఈ చుట్టుపక్కలే వుండే ఉద్యోగం. పెళ్ళి చేసుకుని సుఖంగా ఉంటే చూడాలని గూడా ఉంది. అదైనా ఈ చుట్టుపక్కలే. బుజ్జిని చూడకుండా నేను ఉండలేను. నా భార్యగూడా అంతే. భగవంతుడు ఎలా రాసిపెట్టున్నాడో చూద్దాం" అంటూ నిట్టూర్చాడు.

అంతలో ఒక పాతపాగీ అడ్డొచ్చి, "మెయిల్ పత్రికలో పదోపేజీ కనిపించడంలేదు" అన్నాడు.

"ఆ పేజీలో అంత మునిగిపోయేదేముందో? "

"పదబంధం" అన్నాడు పాఠకుడు.

"దానికోసమే అనుకున్నా" అంటూ ముసలాడు తన సొరుగునుండి ఆ పేజీని బయటకు తీసి అందిస్తూ, "ఆ పేపరుమీద రాసేవు జాగ్రత్త. కాపీ చేసుకో" అంటూ హెచ్చరించాడు.

★ ★ ★

రాన్ తిరుగుళ్ళకు సంబంధించిన సమాచారంతో కలుగుతున్న ఆరాటాన్ని నాలో తుడిచేసుకున్నాను. దాన్ని గురించి ఏంచెయ్యాలో, ఎందుకు చెయ్యాలో బోధపడక, 'నాకు ఎందుకొచ్చిన గొడవ? ' అనుకున్నాను గానీ, అతని గతచరిత్ర గురించి నాలో ఏవేవో సందేహాలు మొలకెత్తాయి. అతన్ని నిలదీసే ముందు వాస్తవాలు గుప్పిట్లో ఉండాలి. ఉండాలంటే అతని గుట్టు రహస్యంగా ఆరా తీయడమొక్కటే నాకు అందుబాటైన మార్గం.

ఇప్పుడతడు పొద్దున్నే టిఫిన్ చేసి బయటపడితే, మధ్యాహ్నం భోజనం వేళకుగాని తిరిగిరావడంలేదు. రాగానే భోజనం ముగించుకుని, ఆగమేఘాలమీద పరిగెత్తిపోతున్నాడు. అతని దినచర్య గిరిజ (బుజ్జి) వెసులుబాటుకు అనుసంధానంగా నడుస్తోందని నాకు అర్థమైంది.

మధ్యాహ్నం వెళితే రాత్రి ఏ ఎనిమిదింటికోగాని తిరిగిరాడని తెలిసింది గాబట్టి, మారుతాళం చేతులతో అతని గది తలుపు తెరిచి లోపలికి ప్రవేశించాను. గదిలో అడుగేసేప్పుడు, 'అహా, నా ఇంట్లో నేనే దొంగనయ్యాను గదా' అనిపించింది. చిన్నతనంతో కాస్త తటపటాయించినా, అతడు తిరిగొచ్చేంతవరకే పరిమితమైన గడువు నన్ను తొందరపెట్టింది.

గబగబా అతని సూట్‌కేసు తెరిచాను. ఉత్తరాల బొత్తముండే అడపం చేతికి దొరికింది. అందులో మోపెడన్ని ఉత్తరాలు ఉన్నాయి- వాటిమీద రకరకాల పేర్లతో వుండే చిరునామాలు- రాన్ పేరుతో వుండేవి రెండే రెండు- ఏ దేశంలో ఉన్నా, ఏ నగరంలో ఉన్నా, చిరునామా మాత్రం కేరాఫ్ పోస్టుమాస్టరే. మన దేవుళ్ళకు మల్లే అతని పేర్లు ఎన్నెన్నో - నరేన్, అశోక్, డి-క్రెజ్, జాన్, ఆడమ్, శంకర్, శ్రీధర్, సింగ్, ఎక్బాల్- ఇలా.

ఏ ఉత్తరం తీసుకున్నా ఆడవాళ్లనుండే. కొన్ని అర్థించేవి, కొన్ని ప్రాధేయపడేవి, కొన్ని నిందించేవి, కొన్ని సూటిగా నిష్ఠూరం చేసేవి. వాటిల్లో కొన్ని- ముఖ్యంగా రీటా, నాన్సీ, మంజు, కమల నుండి వచ్చినవి- ప్రేమాభిమానాలతో ముంచెత్తుతున్నాయి. ఒకటి రెండు ఉత్త

## నేనే ఎదురు చెల్లించాలేమో!

దేవులపల్లివారు నిలకడగా ఓ చోట ఉద్యోగం చేయక కవిత్వం గురించి తిరుగుతూ ఉపన్యాసాలిచ్చేవారు. దాంతో ఆయన గురువు రఘుపతి వేంకటరత్నం నాయుడు, 'ఉద్యోగం లేక ఎన్నాళ్లిలా తిరుగుతావు? కొడుకు కూడా పుట్టాడు. కాకినాడ కాలేజీలో చేరు. నెలకు నలభై రూపాయలిస్తారు' అన్నారు.



'నాకేమీ అభ్యంతరం లేదు.. కానీ జీతం విషయంలోనే కొంచెం..' అన్నారు దేవులపల్లి.

'అదేంటి? 40 రూపాయలు తక్కువనా?'

దానికి దేవులపల్లి, 'నాకు మొదట పిఠాపురం స్కూల్లో జీతం డెబ్బై, పెద్దాపురంలో అరవై, కాకినాడలో స్కూల్లో యాభై రూపాయలిచ్చారు. ఏడాదికి పదిరూపాయల చొప్పున తగ్గుతూ వచ్చింది. మధ్యలో ఐదారేళ్లు ఉద్యోగం చేయలేదు. కాబట్టి ఇప్పుడు నేనే కాలేజీవారికి ముప్పై రూపాయలు ఇవ్వాల్సివస్తుందేమో అనుకున్నా' అని ఛలోక్తి విసిరాడు.

రాలు దుబాయికి, కువైట్‌కు ఉద్దేశించి, ఎన్నెన్నో దేశాలు తిరుక్కుంటూ చేరుకున్నాయి.

ఉత్తరాల్లో కొన్ని మొదటి పెళ్లాం రోజావి గూడా ఉన్నాయి.

అవి నానా తిప్పలుబడి అతన్ని చేరుకున్నాయి. ఏ ఉత్తరం చదివినా అందులో విధిగా కనిపించే ఆక్రందన అతని ఎడబాటు గురించే. కొన్ని బ్లాక్‌మెయిల్ చేసే ప్రయత్నాలూ, అంతర్జాతీయ పోలీసులకు ఫిర్యాదు చేస్తామనే బెదిరింపులూ ఉన్నాయి. ఆ కవర్లమీద తపాలా బిళ్ళలనూ, పోస్టాఫీసు ముద్రలనూ ఆధారం చేసుకుని అతడు తిరిగిన జాడలు తెలుసుకోవాలంటే మన ముందు ప్రపంచపటం పెట్టుకుని వెదుక్కోవాలి. ఆ కవర్లమీదుండే తపాలా బిళ్ళలతో ఒకటో నంబరు ఆల్బమ్ తయారవుతుంది.

ఇతనికోసం వేటాడేవాళ్ళకు కొదవలేదనీ, ఇతడు వాళ్ళకు చిక్కకుండా తప్పించుకుని తిరుగుతున్నాడనీ సందేహించే అవసరమే నాకు కనిపించలేదు.

'నువ్వొక గుండెలేని బండరాయివి, రాక్షసుడివి. బిడ్డను అంత మురిపెంగా లాలించేవాడివే, ఇప్పుడు ఆ పసిబిడ్డ నీకోసం రాత్రింబవళ్ళు గుక్కపెట్టి ఏడుస్తూంటే నీకు జాలైనా కలగదా? వెళ్ళేముందు ముద్దు పెట్టుకుని సెలవు తీసుకునేందుకు బదులు, రాత్రికిరాత్రి చీకట్లో మాయమయ్యేంత దగా చేస్తావని ఆ బిడ్డ ఎలా ఊహిస్తుంది?' అంటూ ఒకటి.

'నాకు ఈ శిక్ష చాలు. ఇంకెప్పుడూ ఆ డబ్బు ఊసే ఎత్తను. వచ్చెయ్యవా?' అంటూ మరొకటి.

'ఇక నువ్వు తిరిగొచ్చే అవసరం లేదు. వచ్చావా, గుమ్మంలో నుండే బయటికి గెంటేస్తా. నా వాటాకు రావలసిన డబ్బు మర్యాదగా నాకు ఇచ్చేసెయ్- కనీసం ఇరవైవేల పెసోలు. నాది నాకిచ్చి నువ్వు ఏ గంగలో దూకినా ఫరవాలేదు. ఇవ్వకపోతే ఇంటర్‌పోల్‌కు ఆకాశరామన్న ఉత్తరం రాసేస్తా' అంటూ ఇంకొకటి. ఈ ఆఖరు ఉత్తరం చూస్తే, ఇతనికి మాదకద్రవ్యాల రవాణాతో సంబంధాలున్నాయేమోనని అనుమానం కలిగింది.

ఒక చిరునామా నుండి మరో చిరునామాకు జారుకునేందుకు అతడేదో ప్రత్యేక విధానాన్ని అనుసరిస్తున్నట్టుంది. ఎందుకు అతడు తపాలా చిరునామా తెలుపుతున్నాడో, ఉత్తరాలు సేకరించుకునేందుకు వెళ్ళినప్పుడు దొరికిపోయే ప్రమాదం ఉందని ఎందుకు జంకడో, నా ఊహకు అందలేదు. ఉత్తరాలు సేకరించుకుని

దాచుకోవాలనేది మానసిక వ్యాధి లక్షణ మేమో! కాకపోతే ఇలాటి ఉత్తరాలు దాచి పెట్టుకునే అవసరం ఏమొచ్చింది? అతన్ని నిలువునా ముంచి, జైలుకు పంపేందుకు ఇవి చాలు. చూస్తే, చాలా అరుదైన శాల్తీలా ఉన్నాడు. మరో కోణం నుండి చూస్తే, అతని బహుముఖప్రజ్ఞను, చేవనూ, తెగింపునూ మెచ్చుకోకుండా ఉండ లేను. ఇంతకూ ఈ తరహాలో జీవితం గడిపేలా అతడ్ని నడిపిస్తున్న లక్ష్య మేమిటి?

అప్పుడప్పుడు అతడు రాస్తూకూర్చునే లావుపాటి బౌండు పుస్తకాన్ని చేతికి తీసు కున్నాను. తెరిచి చదవాలంటే భయమే సింది. చదువుతూ కూర్చుంటే నాకు తెలీ కుండా సమయం దాటిపోయి, అతడు తిరి గొచ్చేదాకా అక్కడే ఉండిపోయే ప్రమాద ముంది. అందువల్ల, అక్కడొక పేజీ, ఇక్క డొక పేజీ తిరగేశాను. తన తప్పుడు పనులు అతడు పుస్తకంలో ఎందుకు నమోదు చేస్తున్నాడో అర్థం గాలేదు. ఒక పేజీలో- 'ఇక్కడే పాతుకుపోతే ప్రయో జనం ఉండదు'. 'ఎస్‌తో వేగడం ఇక నాతో కాదు. కౌగిలించుకోవడం, ప్రేమగా మాట్లాడటం కాక, మగవాడికి వేరే పను లుంటాయని ఏ ఆడదీ అనుకోదు' అని రాసుంది. మరో పేజీలో- 'నా ప్రాజెక్టు కంటే ముఖ్యమైంది నాకు వేరే లేనేలేదు. దానికి ఆటంకం కలిగితే అంతా వదిలేసి పారిపోయేందుకైనా సిద్ధమే. విచక్షణలేని చిట్టెలుకలా అదే బోనులో పదేపదే ఇరు క్కుంటున్నాను. ఈ దశలో నా రచన ప్రాముఖ్యాన్ని ఇతరులతో ఒప్పించడం కష్టమే కావచ్చు. నా ప్రాజెక్టు, దాంతో పాటు నా పుస్తకం- అది దాని పిలకేన నుకో- నిరంతరాయంగా సాగిపోవాలి. అది పుస్తకంగా వెలువడితే ప్రపంచాన్ని కుదిపేస్తుంది. ప్రపంచానికంతా అగ్రస్థా యిలో నిలిచిన బహుమతి నాకు తంగేటి జున్ను కావచ్చు' అని రాసుంది. ఇంకో పేజీలో- 'ఘనత వహించిన గస్టోవ్ మహా రాజుకు, ఆయన పట్టపురాణికి, నోబెల్ బహుమతి నిర్ణేతలైన కమిటీ సభ్యులకు- ఈ బహుమతిని స్వీకరిస్తున్న ఈ సంద ర్భంలో మీరు నా దేశాన్ని గౌరవిస్తున్న ట్టుగా భావిస్తున్నాను. స్వీడన్ భారతదేశా లకు సాంస్కృతికంగా చాలా సాన్నిహిత్యం ఉంది..."

ఐదు గంటలు కొట్టి గోడ గడియారం నన్ను హెచ్చరించింది. ఎక్కడి సరుకును అక్కడ గబగబా సర్దేసి, వేలిముద్రలు మిగ లకుండా తుడిచేసి, ఆలస్యం చెయ్యకుండా గదిలోనుండి తప్పుకున్నాను.

ఒకరోజు రాన్‌తో, "ఆ అమ్మాయి గురించి నీ అభిప్రాయమేమిటి? " అన్నాను ఏమీ ఎరగనట్టు.

"ఏ అమ్మాయి? " అంటూ ఎదురుప్రశ్న వేశాడు.

"గిరిజ, లైబ్రేరియన్ మనుమరాలు. అతడు బుజ్జి అంటుంటాడే, ఆ పిల్ల"

"నాకెలా తెలుస్తుంది? ఇక్కడా అక్కడా చూస్తుంటానుగానీ, నాకంత పరిచయం లేదు. వాళ్ళ కాలేజీలో పనిజేసే ఒక ప్రొఫెసర్ కోసం అక్కడికి వెళ్ళినప్పుడు ఎక్కువగా కనిపిస్తుంది. నువ్వు అడిగితే గుర్తొస్తూంది. చాలా చురుకైన పిల్ల. మంచి శిక్షణ ఉంటే పైకొస్తుంది. ఇక్కడే వుంటే రాలేదు. ఈ కీకారణ్యం నుండి బయటపడాలి. మీ పట్నాన్ని అలా అంటు న్నందుకు మరోలా అనుకోకు"

నేను నొచ్చుకున్నాను. "అందుకేనా ప్రపంచంలో అన్ని పట్టణాలూ వదిలేసి నువ్వు దీన్నే ఎంచుకుంది? "

"నేనొచ్చిన పని వేరు. జీవితంలో అడు గెట్టబోయే లేత వయసులో మరింత ఆధు నికంగా వుండే నగరంలోనూ, నాగరికత

లోనూ నేర్చుకునేది చాలా ఉంటుంది. నన్నే అడిగితే- మళ్ళీ ఎక్కడైనా అనేవు- ఆ పిల్ల ఆ ముసలాళ్ళ దగ్గర పెరగడమే మంచిది గాదు. హాస్టల్లో ఉంటే నయం. తన ఈడువాళ్లతో పోల్చుకునేందుకూ పోటీపడేందుకూ అవకాశం ఉంటుంది. ఎలాగూ మార్చిలో వాళ్ళ ఫైనల్ పరీక్షలు అయిపోతాయి. భవిష్యత్తుకు సంబంధించి అప్పుడైనా ఆ అమ్మాయి ఒక నిర్ణయానికి రావాలి"

"పెళ్ళి గురించా? "

"అబ్బే, అదిగాదు. అంటే పెళ్ళి అవసరం లేదనిగాదు నా ఉద్దేశం. అమ్మాయిలు పెళ్ళీ చేసుకోవచ్చు. ఆ తరువాత గూడా విజ్ఞానాన్నీ, స్థాయినీ పెంచుకునేందుకు పాటుపడొచ్చు. ఐతే ఈ రొంపిలో నుండి బయటకి రావడం ఆ అమ్మాయి ప్రాథమిక కర్తవ్యం"

"అంటే, ఈ కీకారణ్యం నుండి? "

జవాబుగా అతడు మందహాసం చేశాడు. అతని అంతరంగం లోతులు నాకు అందేవిగా తోచలేదు.

"గిరిజకు అదృష్టం కలిసొచ్చింది. దాన్ని పరీక్షలకు తయారుజేసేందుకు రాన్ ఒప్పుకున్నాడు. కొన్నికొన్ని విషయాల్లో ఆయన పెద్ద మేధావిలా ఉన్నాడు. ఏమంటావ్? " అన్నాడు లైబ్రేరియన్ నాతో.

జవాబు ఏమివ్వాలో నాకు పాలుపోలేదు. నడుస్తున్న తతంగం ఆ ముసలాడికి ఎంతమేరకు తెలిసిందో అర్థం గాలేదు. మనుమరాలిని గొప్ప హోదాలో చూడాలనే ముసలాయన తాపత్రయానికి రాన్ విసిరిన వల కలిసొచ్చిన అదృష్టంలా కనిపించివుండొచ్చు. గిరిజతో వివరంగా మాట్లాడితేగానీ నా కర్తవ్యం బోధపడేలా లేదు. 'బాగున్నావా? ' అని అడిగితే 'బావున్నాను' అనేంతకు మించి ఆ అమ్మాయితో మాట్లాడే అవకాశమే నాకు దొరకడం కష్టమైంది.

నా సలహా కోసం ఎదురుజూస్తూ ముసలాయన నా ముఖంవైపే చూస్తూ కూర్చున్నాడు. ఏమని మాట్లాడాలో తేల్చుకోలేక నేను మౌనంగా ఉండిపోయాను. బల్ల చుట్టూ కూర్చొనున్న పాఠకుల్లో నుండి ఒకటి రెండు చెవులు మావైపుకు తిరిగి, నా జవాబుకోసం ఆసక్తిగా కాచుకున్నాయి. వదంతులను ప్రచారంజేసే నోళ్లకు నిరాశ కలిగిస్తూ, "ఇదేమి ఉక్కపోతో.. ఇంత ఎన్నడూ లేదు" అంటూ నేను సీటు నుండి లేవడంతో రిక్కించిన చెవులు ఉసూరుమన్నాయి.

లైబ్రరీ కట్టేసే సమయంలో ముసలాయన ఒంటరిగా దొరుకుతాడనే ఉద్దేశంతో, సాయంత్రం మళ్లీ అక్కడికి చేరాను. అతడు కిటికీలు మూసేసి, అడ్డదిడ్డంగా జరిగిన బెంచీలను సవరించి, గడప దగ్గరి నుండి హాలును ఆఖరుసారిగా పరికించి, ఆ తరువాత తలుపుచెక్కలు దగ్గరగా లాగి, తాళం బిగించాడు.

"ఇదేమిటి, వేళగాని వేళలో వస్తున్నావు? " అన్నాడు నన్ను చూసి.

"ఏదో పనిమీద ఈ దారిలో వస్తున్నాను. ఎలాగూ వచ్చానుగదా అని ఆగిపోయాను. పద, నీతో నేనూ నడిచొస్తా"

ఇక్ష్వాకుల కాలంనాటి తన గొడుగును చంకలో ఇరికించుకుని అతడు ఊగులాడుతూ నడుస్తూంటే, నేను సైకిలు తోసుకుంటూ అతన్ని అనుసరించాను. అతని ఇల్లు అక్కడికి దగ్గరలోనే ఉంది. పదిహేను నిమిషాల నడక. దారిపొడవునా అతడు గిరిజనుల గురించీ, గిరిజ భవిష్యత్తు గురించీ సందుబోకుండా మాట్లాడుతూనే ఉన్నాడు. ఆ పిల్ల భవిష్యత్తుమీద అతడు ఎన్నెన్నో ఆశలు పెంచుకున్నాడు. దేన్నైతే హెచ్చరించాలని వచ్చానో, ఇక దాన్నిగురించి మాట్లాడటం మంచిదిగాదని

ఆగిపోయాను. రాన్‌కు వ్యతిరేకంగా పల్లెత్తు మాటన్నా నష్టమయ్యేది నా పరువుకేనని తెలుసుకున్నాను.

ఇంట్లోకి రమ్మని అతడు ఆహ్వానించాడు. వీధిదీపం స్తంభానికి సైకిల్ ఆనించి, వసారా అరుగుమీద కూర్చున్నాను. కాళ్ళూ ముఖం కడుక్కునేందుకని అతడు ఇంట్లోకి వెళ్ళాడు. తుండుగుడ్డతో ముఖం తుడుచుకుంటూ తిరిగొచ్చి, నన్ను హాల్లోకి రమ్మన్నాడు. అప్పటికే అతడు చొక్కా, కండువాలను ఒంటిమీదినుండి తీసేసి, చిలక్కొయ్యకు తగిలించివున్నాడు. భుజాల మీదుగా తుండుగుడ్డ కప్పుకుని పడకకుర్చీలో కూర్చున్నాడు.

“ఇంటికంతా ఉండేది మేమిద్దరం, మాకు తోడు బుజ్జి. అదిగో అదే బుజ్జి ఉండే గది. చూస్తావేమో చూడు” అన్నాడు. అతన్ని తోసెయ్యలేక రెండడుగులేసి గదిలోకి తొంగిచూశాను. ఒక చిన్న బల్లమీద పుస్తకాలూ, కాగితాలూ అడ్డదిడ్డంగా పడేసి వున్నాయి. స్టాండుమీద బట్టలుగూడా చిందరవందరగా పడున్నాయి. గోడల నిండా సినిమా తారల బొమ్మలు అంటించి ఉన్నాయి. వాటి మధ్య ఒకటి రెండు దేవతా పటాలుగూడా ఉన్నాయి. ఆ పటాలకు పైన రెండు పువ్వులు అలంకరించి ఉన్నాయి. ఎదురుగా వుండే గోడకు ఒక కిటికీ, కప్పుకు వేలాడుతూ ఒక కరెంటు బల్బు ఉన్నాయి.

“చదువుకోవాలంటే హాల్లోకొచ్చి, చుట్టూ పుస్తకాలేసుకుని నేలమీద కూర్చుంటుంది. ఎక్కడైనా కూర్చోనీ, దాని చదువుకు మేం అడ్డమే రాము. అలికిడి కాకుండా నేను మునివేళ్ళమీద నడుస్తాను. వాళ్ళ అమ్మైతే నోరు మెదిపేందుకే భయపడుతుంది. అది మంచి మార్కులు తెచ్చుకోవడంకంటే మాకు కావలసిందేముంది? ఉపకారవేతనం గూడా సంపాదిస్తే ఇంకా సంతోషం”

అంతలో పొరుగింటికి వెళ్ళున్న అతని


హృదయోల్లాస ప్రత్యేక సంచిక వచ్చేసింది




విపుల
విశ్వకథా వేదిక

నవ్వించటం నాకదో తుత్తి
అంటున్న ఏవీఎస్
★ గిలింతలు పెట్టే
ఐదు తెలుగు కథలు
పది భారతీయ భాషల కథలు
నాలుగు ప్రపంచ భాషల కథలు
వెరసి పందొమ్మిది కథల కదంబం!
కొత్త శీర్షిక 'ఈ కథ మీదే!'
ఇంకా..
సాహితీవేత్త, ఐఏఎస్ ఉన్నతాధికారి
డాక్టర్ కె.వి. రమణాచారి పరామర్శ
చదవండి.. చదివి ఆనందించండి!

భార్య తిరిగొచ్చింది. ఆమెకు నన్ను ఆ ప్రఖ్యాత విదేశీయుడికి ఆతిథ్యం ఇస్తున్న గృహస్థుగా పరిచయం చేశాడు మొదట.

'ఈయన కబీర్‌వీధి కాపురస్తుడు. ఆ వీధిలో వుండే కుటుంబాలు అలాంటివీ ఇలాంటివీ కాదు' అని, మా తాతముత్తాతల వైభవాన్ని గొప్పగా ప్రశంసించాడు.

ఆ పెద్దావిడ మా కుటుంబసభ్యులను గురించి తనకు తెలిసిన సమాచారం ఏకరువు పెట్టి, ఎక్కడెక్కడో వున్న బంధుత్వాలన్నిటినీ కెలికి, నేను పేరైనా వినివుండని ఒకానొక పిన్నమ్మతో తనకుండే బంధుత్వాన్ని ముచ్చటించింది.

"ఆతిథ్యం ఇచ్చేందుకు అంతటి గొప్పమ

> **కొత్తగాలి...**
>
> **ట్యాంకుబండ్ చెట్టు**
> **బొమ్మల కొమ్మలు కూలి**
> **మోడయ్యింది**
>
> – హర్షవర్ధన్,
> సికింద్రాబాద్

నిషి దొరకడమే మన అదృష్టం. అతిథులు గొప్పోళ్లైతే మనకూ గౌరవం వస్తుంది. ఎంతమంది అతిథులు వచ్చినాసరే, అప్పట్లో ఆ చేతులమీద వండి వడ్డించేదాన్ని. ఇక్కడగాదు, గోకులంలో వుండే మా సొంతింట్లో. ఆ తరువాత ఇక్కడికి రాక తప్పలేదు. అప్పటికింకా మా అమ్మాయికి పెళ్లి చెయ్యలేదు. గిరిజ ఈ ఇంటికి వచ్చిన తరువాత పుట్టింది, ఆ ఇల్లు పోగొట్టుకుని-"

ముసలాయన అడ్డొచ్చి "ఆ పాత పురాణంతో అతన్నెందుకు విసిగిస్తావు" అన్నాడు.

ఆమె ఆగలేదు. "అప్పట్లో మా ఆయన జిల్లా కోర్టులో రిజిస్ట్రారు"

"అదే నీ తెలివితక్కువ. రిజిస్ట్రారు కాదు. సిరస్తారని ఇప్పటికి వందసార్లు చెప్పున్నాను"

"ఏదైతేనేం, రోజు ఎంత డబ్బు వచ్చేదో! కలవాలని వచ్చీపోయే మనుషులకు సందే ఉండేదిగాదు. ఏ ఒక్కరూ ఒట్టి చేతులతో రారు. ఏ వస్తువైనా సరే. బజారుకెళ్లి కొనే అవసరమే వచ్చేదిగాదు. కూరగాయలూ, పండ్లూ, బియ్యం-"

"ఆ రోజుల్లో మనుషులకు ఆప్యాయతలుండేవి" అని ముసలాయన సర్దుబాటు చేశాడు.

ఆ ఆప్యాయతలు ఎలాంటివో నాకు తెలుసు. తీర్పు నకళ్ళూ, కోర్టు ఆదేశాలవంటి కాగితాలు తొందరగా రావాలంటే చేతికి అందాలంటే సిరస్తారు చలువ అవసరంగాబట్టి, కోర్టు పక్షులతో అతనికి లావాదేవీలు నడిచుంటాయి.

ఆ సంగతులు ముసలాయనకు ఇరకాటమై, మాట మరో సంగతికి మారుస్తూ, "పదవీ విరమణ తరువాతే ఈ ఉద్యోగంలో చేరాను. ఇంటికి దగ్గరగా ఉండడంతో అనుకూలంగా ఉంటుందని చేరాను. మొదట్లో ఎందుకబ్బా అనుకున్నాను. ఈ లైబ్రరీని ప్రారంభించారే జడ్జిగారు, ఆయన ఫొటో సర్ ఫ్రెడరిక్ లాలీకి పక్కన మన లైబ్రరీ హాల్లో ఉంది చూడు. ఆయన నన్ను వదల్లేదు. ప్రజాసేవగా ఉంటుందని నచ్చచెప్పి ఒప్పించాడు. ఆ రోజు ప్రారంభోత్సవం ఎంత దర్జాగా జరిగిందనుకున్నావ్? ఉపన్యాసంలో జడ్జిగారు నా ప్రస్తావన కూడా తీసుకొచ్చారు"

ఆ జడ్జిగారికి సిరస్తారు ద్వారా ముడుపులు తీసుకునే అలవాటు ఉండేదేమోనని సందేహించాను. "అప్పుడు నేను హైస్కూల్లో ఉండుంటానేమో" అన్నాను

ప్రకాశంగా.

మా సంభాషణతో ఏమాత్రం చుట్టరికం లేని కొత్త సంగతి మొదలెట్టింది ముసలావిడ.

"మొన్న మా ఇంటికి రాన్‌గారు వచ్చున్నారు. గిరిజ పిలుచుకొచ్చింది. అంత పెద్ద హోదాలో ఉండి గూడా ఎంత సాదాగా ఉన్నాడో! ఆడంబరమే లేదు. ఎన్నెన్నో దేశాల్లో గొప్ప గొప్ప ఉద్యోగాలు చేశాడు. ఆయనకు ఎన్ని సంగతులు తెలుసో! నాకు రాత్రంతా కూర్చుని వినాలనిపించింది. ఆయన మాట్లాడుతుంటే ఎంతసేపయిందో తెలీదు. మా ముసలాయన ఆవలిస్తూ కూర్చున్నాడు. భోంచేసి వెళ్లమని బలవంతం చేస్తే ఇక్కడే భోజనం గూడా చేశాడు. మాకు వండుకున్నదే పెట్టినా, మరేమనకుండా తృప్తిగా తిన్నాడు. పింగాణీ పళ్లెరాలూ, చెంచాలూ మాకు ఎక్కడున్నాయ్? అందుకని చేత్తోనే తిన్నాడు. మనలాగా నేలమీద కూర్చోవడం చేతగాలేదు. అదొక్కటే అతనికి కష్టమైంది"

ఇంటికి తిరిగొచ్చాను. రాన్ గదిలో ఇంకా లైటు వెలుగుతుండడం చూశాను. 'ఏందిరా నీ ప్రవర్తన? ఏంది నీ పన్నాగం?' అంటూ నిలదీయాలన్నంత ఆవేశం వచ్చింది. 'మర్యాదగా ఆ అమ్మాయిని వదిలేసెయ్. నిరాశగా నీకోసం విలపించే మరో ఆడదాన్ని నీ ఉత్తరాల కట్టకు జమచెయ్యొద్దు' అంటూ తీవ్రంగా హెచ్చరించాలనిపించింది. కానీ- 'జరిగిన దాన్ని బట్టి నేను ఊహించుకున్నది వాస్తవమో కాదో' అనే సందేహం నా ఆవేశాన్ని అదుపులోకి తీసుకొచ్చింది. కోరినంతమంది ఆడవాళ్లను అతడు చూసుకున్నాడు. ఈ అమ్మాయి కోసం ప్రాకులాడే అవసరం అతనికి లేదు. గిరిజను ఒక చెల్లెలిగా అభిమానిస్తున్నాడో ఏమో? ఆ అమ్మాయి చదువులో రాణించేలా చేసి, చదువుకు తగిన హోదా సంపాదించేలా చూడాలని తాపత్రయపడుతున్నాడో ఏమో! ఆ ముసలి దంపతులకు రాన్ మీద విపరీతంగా నమ్మకం కుదిరింది. మరోలా చెబితే వాళ్ళు అపార్థం చేసుకునే ప్రమాదం కూడా ఉంది. గిరిజ మీద నాకు వేరే ఆలోచన ఉందనే నిందలు మోపొచ్చు. ఆమె ఎదగడం ఓర్చలేకపోతున్నానని ఎత్తిపొడవచ్చు. లేదా 'మా సంగతి మాకు తెలుసు. నీ సంగతి నువ్వు చూసుకో' అంటూ విదిలించొచ్చు.

రాన్ రహస్య జీవితం గురించి చాటించేందుకు ఇప్పుడిప్పుడే వీలు పడదు. అతడు ఖాళీచేసి వెళ్ళిపోతే, ఆ అమ్మాయి మీద ప్రచారమైన పుకార్లకు మరింత ఊతం ఇచ్చినట్లవుతుంది. ఏ పాపం ఎరుగని కుటుంబాన్ని బజారుపాలు చేసినట్లవుతుంది. ఆ అమ్మాయి ఎంత పిల్ల? ఏపుగా పెరిగి ఇప్పుడు చీరలు కడితే కట్టొచ్చు గానీ, ఆల్బర్ట్ మిషన్ స్కూల్లో ఉన్నప్పటి నుండి చూస్తున్నాను. ఇస్త్రీ బట్టలు కట్టి రెపరెపలాడుతూ ఇటూ అటూ తిరిగినంత మాత్రాన ఆడమనిషి అయినట్టుగా లెక్కలోకి తీసుకోలేం. పెరిగి పెళ్లైనట్టు కనిపించే ఎంతోమంది అమ్మాయిల్లాగే ఈమె మనసూ ఇప్పటికీ లేతగానే ఉండొచ్చునేమో!

అది సరే, మరి ఆ క్రిస్టియన్ గోరీల దగ్గర అతన్తో కలుసుకునే పనేమొచ్చింది? ఆ సంగతి తెలిసి గూడా ఆమెను అమాయకురాలిగా జమగట్టడం సబబేనా? ఆమె విజ్ఞానం పెంచడమే అతని ఉద్దేశమైతే, ఆమెను అంతదూరం తీసుకెళ్ళే పనేముంది?

పరుపుమీద దొర్లుతూ, నడిజాముదాకా వాళ్ళ ప్రవర్తనను వితర్కించి, ఆ తరువాత నిద్రలోకి జారుకున్నాను.

★ ★ ★

మా లోటస్ క్లబ్బుకు పాతిక సంవత్సరాల వయసొచ్చింది. ఆర్భాటంగా రజతోత్సవం జరుపుకోవాలని నిర్ణయించాం. ఆ సందర్భంగా టౌన్‌హాల్లో ఏర్పాటు చెయ్యబోయే బహిరంగ సభలో ఐక్యరాజ్య సమితికి చెందిన రాన్‌తో 'ఫ్యూచరాలజీ' అనే సరికొత్త అంశం మీద గంభీరమైన ఉపన్యాసం ఇప్పించాలని అనుకున్నాం. రాన్‌తో ఈ విషయం కదిలించగానే, ఎందుకోగాని ఒప్పుకున్నాడు. "సాధారణంగా బహిరంగ సభలంటే నాకు గిట్టదు. నేను రచయితనేగానీ వక్తను కాదు. ఐనా, నన్ను ఇంతగా ఆదరించే నిన్ను కాదనలేక

> ## కొత్తగాలి...
>
> **'సేవ్' చేసుకోడానికి**
> **పదవుంటే చాలు**
> **పేరు ప్రజాసేవ!**
>
> – **శ్రీ విజయ**, కరీంనగర్

ఒప్పుకుంటున్నాను" అన్నాడు.

తన హోదాను ప్రకటించుకోవాలనే దురద, అంతకంటే ముఖ్యంగా, ఏదోవొక సాకుతో చేతినిండా పని కల్పించుకుని, మురిగిపోతున్న నిధులను ఖర్చు పెట్టాలనే తహతహ లోటస్ క్లబ్బుకు బాగా పట్టుకుంది. దశాబ్దకాలానికి పూర్వం ఒక ధనవంతుడు క్లబ్బుకోసం, ప్రత్యేకంగా రజతోత్సవం కోసం బోలెడంత దానం రాయించి దాటుకున్నాడు. ఎన్నో ఏళ్ళుగా అదే స్థానంలో పాతబడి తుప్పుబట్టిన మా అధ్యక్షుడు మా ప్రతిపాదనను మారుమాట్లాడకుండా ఒప్పుకున్నాడు. అంతర్జాతీయ హోదా కలిగిన అతిథి మా ఉత్సవంలో పాల్గొని, ఇంతవరకు ఎవరికీ తెలీని అంశాన్ని ఉపన్యసించేందుకు పూనుకోవడం గర్వకారణంగా ఉబ్బిపోయాడు.

"ఫ్యూచరాలజీ? ఫిజియాలజీ గురించి విన్నాను, జువాలజీ గురించి విన్నాను, అస్ట్రాలజీ గురించి విన్నాను. ఫ్యూచరాలజీ అనే మాటే వినలేదు. ఆయన ఉపన్యాసం ఎప్పుడెప్పుడు విందామా అని కుతూహలంగా ఉంది" అన్నాడు.

ఉత్సవం రోజున టౌన్‌హాల్లో పంచేందుకు, 'పాతికేళ్ళ ప్రజాసేవలో లోటస్ క్లబ్' అనే బ్రోచర్ రూపొందించే బాధ్యత నాకు అప్పగించాడు మా అధ్యక్షుడు. అదే కాక ముందుగా టౌన్‌లో పంచేందుకు భారీ మోతాదులో కరపత్రాలనూ, రాష్ట్రపతి, ప్రధానమంత్రి, జాతీయ పత్రికా సంపాదకుల వంటి ప్రముఖులకోసం ఆడంబరమైన ఆహ్వానపత్రికలనూ తయారుచేయించే పనికి గూడా నన్నే పురమాయించాడు. ఊపిరి సలుపనంత పని మీదేసుకుని హడావుడిగా పరిగెత్తడానికి మించి నేను ఇష్టపడేది మరొకటి లేదు.

మా అధ్యక్షుని పేరు శ్రీగణేశరావు. చాలా ఏళ్ళకు ముందు సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా ఉండి, పదవీ విరమణ తరువాత స్వగ్రామం తిరిగొచ్చాడు. ఠీవిలో రాజసం తొణికిసలాడే వయోవృద్ధుడు. మెడమీద జీరాడే జులపాలతో లాయిడ్ జార్జిలానో, ఐన్‌స్టీన్‌లానో కనిపిస్తాడు. ఆయన మా కులానికి మణిదీపం. ఢిల్లీ, కాశ్మీర్, అంతర్జాతీయ న్యాయస్థానం వంటి అరుదైన ప్రదేశాల్లో ఎంతోకాలం ఉన్నతమైన హోదాలు నిర్వహించి గూడా, అక్కడే ఉండిపోవాలనుకోకుండా, జన్మస్థలం మీద గౌరవంతో స్వగ్రామం తిరిగొచ్చినందుకు మా పురప్రజలు అతన్ని అబ్బురంగానూ, కృతజ్ఞతాభావంతోనూ చెప్పుకుంటారు. లాలీ ఎక్స్‌టెన్షన్‌లో

ఆయన నివాసముండే బంగ్లాను సందర్శించడంతో ఇప్పుడు నా దినచర్య మొదలవుతుంది.

'ట్రూత్ ప్రింటింగ్ ప్రెస్' యజమాని నటరాజు నా కోసం తన ప్రెస్సులో ప్రత్యేకంగా ఒక మూలను కేటాయించాడు. అక్కడ కూర్చుని నేను రాసిచ్చిన కాగితాలు వేడివేడిగా అచ్చులోకి వెళ్ళిపోతున్నాయి. ఇతర పనులేవీ ముట్టుకోకుండా అతడు కేవలం మా సేవకే తన శక్తిని సర్వస్వం ధారపోస్తున్నాడు. ఈ పనులన్నీ పూర్తైతే నా దినచర్య చప్పబడి, జీవితం నిరుత్సాహంగా మారుతుందేమోననే భయం ఒక వైపు పీడిస్తున్నా, ఆ పనులతో ఉక్కిరిబిక్కిరి కావడం నాకు చెప్పలేనంత సంబరంగా ఉండేది.

టౌనులో ఆహ్వానాలు అందజేసేందుకు వెళ్ళేది నేనే, కరపత్రాల పంపకాన్ని పర్యవేక్షించేది నేనే, ఏర్పాట్లకోసం ప్రతి చిల్లరపనికి పరిగెత్తేది నేనే. అందువల్ల వాటికోసం నా సైకిలుకంటే వేగంగా, సాంబుడి స్కూటర్ కంటే సౌకర్యంగా పరిగెత్తగల వాహనాన్ని దొరికించుకోవడం మంచిదని భావించడంతో, టాక్సీ డ్రైవరు గఫూర్‌కోసం గాలించాను. రైల్లొచ్చే వేళల్లో కొద్దిసేపు స్టేషన్ బయట దిరిసెనచెట్టు కింద కాచుకోనుండే సమయం మినహా, ఏరోజైనా ఏగంటైనా మార్కెట్ రోడ్డులో ఫౌంటెన్ గోడకు కొద్ది ఎడంగా బహిరంగంగా దర్శనమిచ్చే అతని అంబాసిడర్ కారు ఆ అవసరానికి నాకు దొరకలేదు.

ఎంత వెదికినా గఫూర్ దొరకడు. ఎవరినడిగినా ఆచూకీ చిక్కదు. వేడుకరోజు దగ్గరపడుతున్నకొద్దీ నాకు తొందర ఎక్కువయింది. ఎప్పటిలాగే ఈ సంకటం నుండి గూడా నన్ను ఒడ్డుకు చేర్చింది జయరాజే.

"అతడు కాపురముండేది ఈద్గా దగ్గర. అతని ఇల్లేదో విచారించి నేను ఇంటికి వెళ్ళేప్పుడు నిన్ను కలవమని కబురుచేస్తాను" అన్నాడు జయరాజు.

మరుసటిరోజు ఉదయాన్నే గఫూర్ అంబాసిడర్ నా ఇంటిముందు నిలబడింది. కారును వీధిమలుపు దగ్గర వదిలేసి, గఫూర్ నేరుగా నా గదిలోకి వచ్చాడు. "మధూ, నన్ను రమ్మన్నావట? " అన్నాడు గఫూర్. అతడు నా చిన్ననాటి స్నేహితుడు కాబట్టి, ఇతరుల్లాగా 'వ.పి.' అనకుండా నా అసలు పేరుతో సంబోధించాడు. గెడ్డం గీసుకునేందుకు మూతి నిండా పులుముకున్న సుబ్బు నురగ ఇంకా ముఖంమీద అలాగే ఉండడంతో, అద్దంలో నుండే అతన్ని చూస్తూ, "గఫూర్, ఏమైపోయావు నువ్వు? నలుసువై పోయావు. ఒక వారం రోజులు నువ్వు నాతోనే ఉండాలి"

"నీ ఇంట్లో ఉంటున్నాడే, ఆయన నాకు చేతినిండా పనుండేలా చూస్తున్నాడు. పొద్దున్నే అతనికోసం కాచుకోనుండాలి. నేరుగా ఇక్కడికి పిలిపించుకోడు. సరిగ్గా పదిన్నరకు ఫౌంటెన్ దగ్గరికి వచ్చేస్తాడు. సాయంత్రం ఐదింటికి ఆ అమ్మాయిని యింటి దగ్గర దించేసిగాని నన్ను పంపించడు"

"అమ్మాయెవరు? ఆమెను ఎక్కడికి తీసుకుపోతున్నారు? "

"వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటారనుకుంటా- వెనక సీట్లో వాళ్ళు మాట్లాడుకునే ప్లానును బట్టి అనుకుంటున్నాను. ఆమెను అతడు అమెరికాకు తీసుకుపోతాడు. నాకెందుకని ఊరుకున్నా చెవిలో పడేవి పడుతూనే ఉంటాయి"

నా మూతిమీదున్న నురగ గాలిలో ఎగిరేంత బిగ్గరగా, 'భగవంతుడా' అంటూ అరిచాను.

"ఇందులో నీకు పోయేదేముందని? కొంపదీసి ఆ అమ్మాయిని నువ్వు పెళ్ళాడా

లనుకున్నావా ఏమిటి? "

"ఛ ఛ. గౌన్లలో తిరిగేంత పాపగా ఉన్న ప్పటినుండి ఆ అమ్మాయిని చూస్తున్నాను. నాకు కూతురులాంటిది"

"ఐతే మంచి మొగుడు దొరికినందుకు సంతోషించు. మొగుణ్ని కొనేందుకు ఖర్చయ్యే కట్నండబ్బు మిగిలిపోతుంది. మీ మతంలో బురఖా లేకుండా అమ్మాయి లు తిరగొచ్చు. మగవాళ్ళతో మాట్లాడొ చ్చు. కాబట్టి ఇప్పుడు తప్పేమొచ్చింది? "

"ఆ పిల్లకు తాతగా ఉండేంత వయసు ఆ నీచునిది"

"అది నేను ఒప్పుకోను. మనిషి అంద గాడు. యూరోపియన్‌లాగా కనిపిస్తాడు. మర్యాదస్తుడు. మీటరు చూసి నోరెత్త కుండా బాడుగ చెల్లించే పెద్దమనిషి. అటు వంటివాళ్ళు మరో నలుగురుంటే నేను రోల్స్‌రాయ్ కారు కొనుండేవాణ్ణి"

నేనింకేమీ మాట్లాడలేదు. ఇప్పటికే గఫూర్ మూలంగా నాకు చాలా విష యాలు తెలిసొచ్చాయి. రెండు రోజులుగా రాన్ పెట్టేబేడా సర్దుకోవడం నా దృష్టిలో పడకపోలేదు. రజతోత్సవం మరుసటిరోజు అద్దెకు తెచ్చుకున్న సామాన్లను బండికి ఎత్తేలా కిరాయికొట్టులో పద్దు తేల్చుకున్నా డని కూడా తెలిసింది. సభ జరిగే సమ యంలో రాన్ సూట్‌కేస్‌ను నా ఇంట్లో నుండి కార్లోకి ఎక్కించి, టౌన్‌హాలుకు దగ్గ రగా అతనికోసం కాచుకోనుండేలా ఏర్పాటు జరిగిందట. అక్కడినుండి, దారిలో ఎక్కడో గిరిజను ఎక్కించుకుని, రాత్రికి రాత్రే మెంపికొండమీదున్న గెస్ట్ హౌస్ చేరుకుంటారట. ఆ తరువాత కొండకు ఆవలివైపు దిగి, మెంపి టౌన్ చేరుకుని, అక్కడినుండి బస్సులో వెళ్ళిపో వాలని పథకం వేసుకున్నారట. ఎక్కడికి వెళ్ళాలనుకున్నారో ఆ దేవుడికి తెలుసు. ఆ అమ్మాయిని లేవదీసుకుని, ఎంత చల్లగా రాన్ జారుకోవాలనుకున్నాడో వినగానే నేను నివ్వెరపోయాను.

గఫూర్ అందించిన సమాచారం చాలా అమూల్యమైంది. దాని ఆధారంగా నా కర్త వ్యాన్ని నేను నిర్ణయించుకోవాలి. సమస్య ఎంతో సున్నితమైంది. ఇటువైపు, అటు వైపు ఏ వొక్కరికీ తలవంపులు కల క్కుండా ఒళ్ళు దగ్గరుంచుకుని వ్యవహరిం చాలి. ముసలి లైబ్రేరియన్ గుండె పగిలి చావకుండా చూడాలి. గిరిజ నలుగురిలో నవ్వులపాలు కాకుండా చూడాలి. ఎక్కడో దూరంగా వుండే ప్రదేశంలో రాన్ ఆమెను దిక్కులేనిదానిగా చేసి వదిలేయడం ఎలాగూ తప్పేదిగాదు కాబట్టి, రాన్ మాయాజాలంలో ఇరుక్కుపోయి దీనాతిదీ నంగా ఆక్రందించే ఇతర వనితల గతి ఈ పిల్లకు పట్టకుండా అడ్డుకోవాలి. వాళ్ళ చనువు ఇప్పుడు ఎంతదాకా వెళ్ళిందో నా ఊహకు అందలేదు. ఏదిఏమైనా లేడీడా క్టరు దగ్గరికి తీసుకెళ్ళి కడుపు తీసేసే అవ సరమేమైనా ఉందేమో తెలుసుకోవడం మంచిది. తండ్రిలేని బిడ్డకు తల్లిగా బతక డంకంటే కడుపు తీయించుకోవడమే మేలు. రాన్ చేతిలో మోసపోయిన ఇతర స్త్రీలకు ఆ గాయాన్ని భరించగలిగేంత గడుసుదనమో, లోకజ్ఞానమో ఉండొచ్చు గానీ, గిరిజ ఇంకా ముక్కుపచ్చలారని పసి పిల్ల. రాన్ సాన్నిహిత్యంతో ఇటీవల రాటు దేలుంటే చెప్పలేంగానీ, లేకపోతే మాత్రం అమాయకురాలే. పాపం, నమ్మి అంత స్వతంత్రంగా వదిలేసిన తాతను అలా మోసగించడం ఆ అమ్మాయికి భావ్యం గాదు. ఇటీవల ఆ అమ్మాయి తన చదు వును గురించి గూడా ఆలోచించినట్టు లేదు. ఈ భూమ్మీదుండే ఏ యూనివర్సిటీ లోనైనా సరే, ఏ డిగ్రీ కావాలనుకున్నా సరే, ఇప్పించేస్తానని రాన్ ఆమెను నమ్మిం చివుండొచ్చు. 'ఓస్. ఆ సంగతి నాకు వది

లెయ్. అమెరికా చేరగానే యూనివర్సిటీ అధ్యక్షుడు టర్న్‌బుల్‌తో మాట్లాడి...' అంటూ కోతలు కోసే రాన్ ముఖం నా కళ్ళముందు నిలిచింది. అతని మాటలు నా చెవుల్లో ప్రతిధ్వనించాయి. మూర్ఖత్వంలో పడిపోయిన ఆ పిల్ల చెంపలు ఛెళ్ళున వాయించి, ఇంట్లో తోసి తలుపులు బిగించి, రాన్‌ను వీధిలోకి ఒక్క తాపు తన్నినట్టు కాస్సేపు కలగన్నాను. కానీ అలా చేసేందుకు వీలుపడదు. రాన్‌తో ఏమీ తెలీనట్టే నడుచుకోవాలి. తన పథకం తల్లకిందులైందని అతనికి తెలిస్తే పరారైపోతాడు. అప్పుడు టౌన్‌హాల్లో అతని ఉపన్యాసం గురించి తప్పెట వాయించిన నన్ను ఊర్లో జనం వెంటతరిమి తాట తీస్తారు.

గఫూర్ వెళ్లిపోయాక నేను ధ్యానమందిరంలో దూరి, నా మెదడును బాగా చిలికి, సభలో ఉపన్యాసం అయిపోయేదాకా రాన్‌తో ఈ విషయం కదలించగూడదని కచ్చితంగా తీర్మానించుకున్నాను. అతడు సామాన్లు సర్దుకోవడం గూడా తెలీనట్టే ఉండిపోవాలనుకున్నాను.

నా గదిలోకొచ్చి డైరీ కోసం తారాడాను. ఆ ఢిల్లీ వనిత ఇచ్చిన విజిటింగ్ కార్డును అందులో ఉంచినట్టు గుర్తు. కొంతసేపు ఎంత వెదికినా అది కనిపించలేదు. డైరీ తిరగేసి విదిలిస్తే ఏవేవో కార్డులూ, చీటీలు రాలిపడ్డాయిగానీ అది కనిపించకపోయేసరికి నిరాశపడ్డాను. మరోసారి గట్టిగా విదిలిస్తే ఆ పసుపు పచ్చని కార్డు కింద పడింది. కార్డుమీద ఆమె చిరునామా, టెలిఫోన్ నెంబరు, టెలెక్స్ నెంబరుతో సహా 'కమాండెంట్ సరస, హోంగార్డు ఉమన్స్ ఆఫీసర్, ఢిల్లీ' అనుంది. పోస్టాఫీసుకు పరిగెత్తుకెళ్ళి ఆమెకు టెలిగ్రాం పంపించాను-

"వెంటనే వచ్చేయండి. మీ భర్త దొరికాడు. పారిపోకముందే వచ్చేయాలి. పట్టుకునేందుకు ఇది మీకు ఆఖరు అవకాశం. స్టేషన్ వెయిటింగ్ రూములో దిగండి. టౌనులో కనిపించకండి. వచ్చిన తరువాత మిగతా విషయాలు మాట్లాడుకుందాం"

నేను ఆలోచించిన పథకం చాలా పకడ్బందీగా కుదిరింది.

సభకు ముందురోజు తలమునకలుగా వుండే ఏర్పాట్ల నడుమ కాస్తా వీలుజేసుకుని స్టేషన్‌మాస్టారును ఇంటి దగ్గర కలుసుకున్నాను. ఆమె వచ్చిందని తెలీగానే ఊపిరి పీల్చుకున్నాను. వెయిటింగ్ రూముకు వెళ్ళి ఆమెతో ముఖాముఖి మాట్లాడేంత వెసులుబాటు లేక, వివరంగా రాసిపెట్టిన జాబును స్టేషన్‌మాస్టారుకు అందించి, ఐదురూపాయల నోటును సమర్పించి, దాన్ని ఆమెకు చేర్చమన్నాను. పెద్దవాళ్ళకోసం ప్రత్యేకంగా అచ్చేసిన ఆహ్వాన పత్రిక ఒకటి అతనికిచ్చి, సభకు రమ్మ

## కవిత తప్పు..

భావకవిత్వానికి ఊపిరిపోయడమేకాక, భావకవి ఎలా ఉండాలో దేవులపల్లివారు వేషధారణలో చూపించేవారు. మల్లెపూవు లాంటి తెల్లటిలాల్చీ, కంటిమెడ, గాలికి రెపరెపలాడే మెడపట్టీ, పెట్టుకోక వదిలేసిన బొత్తాములతో కన్పించేవారు. అయితే తనను



అనుకరించే భావకవుల అతి చూసి ఆయనకే విసుగు పుట్టిందేమో మరి! 1945లో చమత్కారంగా వేమనపై రాసిన పారడీలో..

'మెరుగు కళ్లజోళ్లు గిరజాలు సరదాలు
భావకవికి లేనివేవి లేవు
కవితయందు తప్పు గట్టివాడన్నింట
విశ్వదాభిరామ వినుర వేమ!'

అని చురకేశారు.

న్నాను. స్టేషన్‌మాస్టారు చెప్పలేనంతగా మురిసిపోయాడు.

★ ★ ★

లోటస్ క్లబ్బు భారీగా నిర్వహించిన ప్రచారం ఫలితంగా, వేడుక దినాన టౌన్ హాలు ఆడిటోరియం కిటకిటలాడింది. సభాధ్యక్షునిగా ఒక సహాయమంత్రిని పిలి పించడంలో నిర్వాహకుల ప్రయత్నం సఫలం కావడంతో, స్థానికంగా ఉండే గవ ర్నమెంట్ ఆఫీసర్లకు వచ్చినట్టు హాజరయ్యే అవసరం ఏర్పడింది. కన్నుల పండువగా పోలీసులు బారులుతీరి బందోబస్తు ఏర్పా టుచేశారు. ఆ సహాయమంత్రి పట్టణాభి వృద్ధిశాఖ, పశుసంవర్ధకశాఖ, శిశుసంక్షేమ శాఖ, కుటుంబ నియంత్రణ, వాతావరణం-పర్యావరణ పరిరక్షణ, ఇంకా- ఆయనకే గుర్తుండనన్ని శాఖలు నిర్వహిస్తున్నారు. ఢిల్లీలో ఆయన కార్యాలయాల కోసం ఆరు వేరువేరు భవంతులు కేటాయించారు.

మా వేడుకలో పాల్గొనమని మా అధ్య క్షుడు ఉత్తరం ద్వారా చేసిన విజ్ఞప్తిని ఆయన వెంటనే ఆమోదించారు. ఆయన పర్యటనకు సంబంధించి ప్రతిరోజూ పత్రి కల్లో కనిపించే సమాచారం చూస్తే చాలు, ఆయన ఎంత తీరుబాటులేని మంత్రిగారో ఇట్టే తెలిసిపోతుంది. ఆయన సందర్శన జాబితాలో మా పట్టణం చేరకపోవడం ఇంతవరకు మాకొక వెలితిగా ఉండేది. ఇప్పుడు ఆ కొరత తీరినందుకు మాల్గుడి పౌరులు తృప్తిపడ్డారు. సభ ప్రారంభం కాగానే చప్టా మీదుండే లైట్లవరుస వెలిగి, వేదిక దేదీప్యమానంగా ప్రకాశించింది. వేదిక మధ్యలో బంగారు పూతరేకుతో ధగ ధగ మెరిసే ఎత్తైన ఆసనంలో మంత్రిగారు కూర్చున్నారు. ఆయనకు కుడివైపుండే ఆస నంలో- దాని ఎత్తు కొంచెం తక్కువైనా, బంగారు పూతకు మాత్రం కొదవలేని ఆస నంలో రాన్ కూర్చున్నాడు. మిగిలిపోయిన మూడు సీట్లల్లో ఒకటి మా క్లబ్బు అధ్య క్షుడూ, మిగతా రెండూ మా ప్రధాన కార్య వర్గ సభ్యులూ ఆక్రమించారు. విలేఖరిగానే కాక, ఆ ఉత్సవానికి కార్యభారం నిర్వహిం చిన సభ్యునిగా నాకు ఆ మొదటివరుస స్థానాలకు ముఖంజేసిన కుర్చీని కేటాయిం చారు. మంత్రిగారి వెనుకసీటులో ఆయన కార్యదర్శి కూర్చున్నాడు. ఆ కార్యదర్శి వెనుక ధగధగలాడే అంచుతో పురివిప్పిన ఫించంలా నిక్కబొడుచుకున్న తురాయి వుండే పాగాతో కనిపించే సేవకుడు నిలు చున్నాడు.

నేను కూర్చున్న చోటునుండి ఆడిటోరి యంవైపు చూస్తే, ప్రేక్షకుల్లో విద్యార్థులూ, న్యాయవాదులూ, వర్తకులే కాక, పలురకాల వృత్తుల్లో జీవించే పౌరులతో సభ కళకళ లాడుతూ కనిపించింది. స్త్రీలు, ప్రధానంగా ఆఫీసర్ల భార్యలు, పెద్దసంఖ్యలో హాజర య్యారు. ఒకరినొకరు తాకేసుకునే వినో దంలో పిల్లలు గగ్గోలుగా నడవంతా పరు గులు తీస్తున్నారు. పట్టుకోబోయిన నిర్వా హకులను తప్పించుకునేందుకు కుర్చీల సందున దూరిపోతున్నారు. వేదికమీదున్న పెద్దలు దాన్ని పట్టించుకోకుండా ఎక్కడో దూరంగా చూస్తున్నట్టు నటిస్తున్నారు. మా అధ్యక్షుడు మాత్రం ఒక నిర్వాహకుడ్ని దగ్గరగా రమ్మని సైగచేసి, "ఆ పిల్లలను నిశ్శబ్దంగా ఉంచేందుకు ఏదైనా చెయ్య రాదా" అన్నాడు. ఆ దరిమిలా, ఆ నిర్వా హకుడు ఆడవాళ్ల దగ్గరికెళ్లి, "దయవుంచి మీ పిల్లలను కాస్తా అదుపులో ఉంచండి" అన్నాడు.

"వాళ్ల తల్లులతో చెప్పు, మాతో చెబితే ఎలా?" అంటూ వాళ్లు తిప్పికొట్టారు.

"వాళ్ల తల్లులు ఎక్కడున్నారు?"

ఏ ఒక్కరి నుండి సమాధానం లేదు. నిర్వాహకుడు తల గోక్కున్నాడు. కష్టం మీద ఒక కుర్రాణ్ణి పట్టుకుని, "అదిగో

అక్కడ మిఠాయి పంచుతున్నారు" అంటూ బయటికి వేలు చూపించాడు. ఆ కుర్రాడూ, అతని వెంట మిగతా పిల్లలు పోలోమంటూ బయటికి పరిగెత్తారు.

"మా పిల్లలు కాదు. చుట్టుపక్కల ఇళ్లలో పిల్లలు" అంటూ అప్పుడు వివరించారు ఎవరో.

సద్దుమణగ్గానే మా అధ్యక్షుడైన మాజీ న్యాయమూర్తిగారు పేపరు వెయిట్‌తో బల్లను చరిచి, గ్లాసులో నుండి గుక్కెడు నీళ్లతో గొంతు తడుపుకుని, "గౌరవనీయులైన మన మంత్రిగారు ఈరోజు మన మధ్యనుండటం మాకెంతో గర్వకారణం" అంటూ ఉపన్యాసాన్ని ప్రారంభించారు.

> ### కొత్తగాలి...
>
> **ఆమె ఒయ్యారం**
> **ఎడారిలో ఒయాసిస్సు**
> **ఆమె వ్యవహారం**
> **ఖాళీ నా పర్సు**
>
> – పి. సునీల్,
> పెద్ద కొట్టాల, నంద్యాల

మహోన్నతమైన జాతిగా మనదేశాన్ని తీర్చిదిద్దడంలో మంత్రిగారి పాత్రను వివరించేందుకు ఆయన దాదాపు ఇరవై నిమిషాలు తీసుకున్నారు. ఆ తరువాత ఈనాటి కార్యక్రమానికి ప్రధానవక్తగా విచ్చేసిన రాన్ గురించి చెప్పేందుకు రెండు నిముషాలు తీసుకున్నారు. అంతకుమించి పొగిడేందుకు అతన్ని గురించి మా అధ్యక్షునికి తెలిసిన సమాచారం అదనంగా మిగల్లేదు. అందువల్ల సందేశం వినిపించేందుకు మంత్రిగారిని ఆహ్వానిస్తూ ప్రసంగం నుండి ఆయన విరమించాడు.

మంత్రిగారు లేచి, అనుభవమున్న వక్త గనక స్వహస్తంతో మైకును నోటికి దగ్గరగా లాక్కుని, సందేశం వినిపించేందుకు ఉపక్రమించాడు.

"వేదికను అలంకరించిన పెద్దలకూ, సభను అలంకరించిన సోదర సోదరీమణులకు నా హృదయపూర్వక నమస్కారాలు. ఇప్పుడు, ఇక్కడ, మన మధ్యలో, ఎంతో దూరం నుండి విచ్చేసి, తన జీవితాన్ని..." అంటూ తడబడి, సరైన మాట కోసం కాస్సేపు గింజుకుని, చీటిముక్కను చూసుకునేందుకు క్షణకాలం వినియోగించి, "తన జీవితాన్ని ఫ్యూచరాలజీ కోసం అర్పించిన మేధావి మనతో ఉన్నారు. 'ఫ్యూచరాలజీ' అంటే ఏమిటి? అని మీరు అడగవచ్చు. మన ప్రధానవక్త ఆ విషయాన్నే మీకు వివరించబోతున్నారు. అందువల్ల, ఆ విషయం ఆయనకే వదిలేస్తున్నాము. నా వరకు నేను జవహర్‌లాల్ నెహ్రూగారి సందేశానికి పరిమితమవుతాను. ఒకసారి నెహ్రూగారు ఏమన్నారంటే-"

ఫ్యూచరాలజీని నిర్వచించే సందిగ్ధ సముద్రాన్ని ఆయన నెహ్రూ ప్రవచనాల తెప్పతో తేలిగ్గా దాటేశారు. ఆ తరువాత మహాత్మాగాంధీగారి సిద్ధాంతాన్ని వివరించేందుకు పూనుకున్నాడు.

"అప్పుడు నేను చిన్న బచ్చాని. వయసులో చిన్నవాణ్ణైనా, మాతృభూమికి ఏదో వొకవిధంగా, ఎంత కిందిస్థాయిలోనైనా సరే, అంకితం కావాలనేది నా జీవిత లక్ష్యంగా పెట్టుకున్నాను. మన మహానాయకులు ఆ దిశగా నన్ను ప్రభావితం చేశారు, ప్రోత్సహించారు. మహాత్మాగాంధీగారు ఎక్కడికి వెళ్ళినా నేను ఆయనతో వెళ్ళేవాణ్ణి. జవహర్‌లాల్ నెహ్రూగారైతేనేమి, మనం నిత్యం స్మరించుకునే తదితర జాతీయనాయకులైతేనేమి, మహాత్ముడ్ని అనుసరించేవాళ్ళు. నేను చిన్నపిల్లవాడినైనా, ఒకవైపు మహాత్ముడు, మరోవైపు

నెహ్రూగారు నన్ను తమ అనుచరుడిగా ఆదరించారు. ఇప్పుడు నేను ఈ స్థానంలో ఉన్నానంటే అది కేవలం వాళ్ళ ఆత్మీయత. నా మాతృభూమికి నేను ఏ కొంచెం ఉపయోగపడ్డానన్నా అది వాళ్ళ దయాభిక్ష"

లార్డ్ మౌంట్‌బాటన్ గురించి ప్రస్తావించేందుకు గూడా ఆయన చిన్న సందు కల్పించుకుని, అతన్ని గూడా తన గురువుల్లో ఒకడిగా పేర్కొంటూ, మళ్ళీ మహాత్మాగాంధీకి తిరిగొచ్చి, చనిపోయే ముందు, కేవలం రెండురోజుల ముందు, మహాత్ముడు ఏమన్నాడో వివరించాడు.

'నా చావు దూరంగా లేదని నా అంతరాత్మ స్పష్టంగా చెబుతూవుంది' అంటూ మహాత్ముడు వెల్లడిస్తూంటే, తాను, ఈ రోజు కేంద్ర సహాయమంత్రి హోదాలో వున్న తాను, అలాంటి మాటలు ఇంకెప్పుడూ అనొద్దని గుండెలు బాదుకుంటూ గొల్లున ఏడ్చేశాడట.

"అప్పుడు మహాత్ముడు ఏమన్నాడో తెలుసా? 'నిన్న బిర్లా మందిరంలో జరిగిన ప్రార్థనా సమావేశంలో ఉన్నావు గదా? అప్పుడు గేటు దగ్గరున్న గుంపును గమనించావా? వాళ్ళ నిర్ణయం నాకు తెలుసు..."

జోలపాటలా వున్న మంత్రిగారి ఉపన్యాసానికి కుర్చీల్లో తూగుతున్న ముసలాళ్ళిద్దరూ ఈ మాటలు విన్నప్పుడు కొద్దిగా తల ఆడించారు. నీలి ఆక్స్‌ఫర్డ్ సూటులో నీటుగా ముస్తాబైవచ్చిన రాన్‌వైపు చూశాను. మంత్రిగారి ఉపన్యాసానికి అతడు విసిగెత్తినట్టున్నాడు. మాట్లాడే అవకాశం తనకు వస్తుందా అనే సందేహంలో కూరుకుపోయిన వాడికిమల్లే, టైపు చేసుకొచ్చిన కాగితాలను తిరగేస్తూ కూర్చున్నాడు. కాగితం ముక్క సహాయం లేకుండా మంత్రిగారు సుమారు గంటసేపు అనర్గళంగా మాట్లాడారు. ఎల్లవేళలా ఆయన తన ప్రసంగాన్ని మహాత్మాగాంధీ సంఘటనతో ముగిస్తారని ఆయన ఉపన్యాసాలతో పరిచయమున్నవాళ్ళకు తెలిసుండొచ్చుగానీ, అక్కడ కూర్చున్న చాలామందికి ఆ సంగతి తెలీదుగనక, అర్ధరాత్రిదాకా తమగతి ఇంతేనని దిగులుపడ్డారు.

విద్యార్థుల గుంపునుండి 'మేము ప్రధాన వక్త ఉపన్యాసం వినాలనుకుంటున్నాం' అనే కేక వినిపించింది. మంత్రిగారు చలించలేదు. పార్లమెంటులో ప్రతిపక్షాల నుండి ఇలాటి అవాంతరాలు ఆయనకు కొత్త కాదు. "ఔనౌను. ఆయన... ఏమిటది? " అంటూ మరోసారి చీటీ చూసుకుని, "ఆ- ఫ్యూచరాలజీ- ఫ్యూచరాలజీ గురించి వినాలని నాగ్గూడా ఆసక్తిగా ఉంది అంటూ తేలిగ్గా జవాబిచ్చి, "ఐతే, నేను చెప్పేది పూర్తికానివ్వండి. అది మీరు వినబోయే ప్రసంగానికి అనుబంధంగా ఉండేదే" అంటూ గేలిచేసినవాళ్ళను హతాశులను చేసి, మరో పదిహేను నిమిషాలపాటు గ్రామీణ చేతివృత్తుల ప్రాముఖ్యతను వక్కాణించి విరమించారు.

రాన్ వైపుగా వంగి, "మీ ఉపన్యాసం రేపు పత్రికల్లో చదువుకుంటాను. బాగల్‌లో మరో సమావేశం ఉంది. నేను తప్పకుండా అక్కడికి చేరుకోవాలి. అది కాగానే తిరుచ్చి విమానాశ్రయానికి పరిగెత్తాలి. ఈ రాత్రే ఢిల్లీ చేరుకోక తప్పదు. మరోలా అనుకోకండి" అంటూ నిటారుగా నిలుచోగానే, అతని పరిచారకుడు ముందుకొచ్చి పూలదండను- సభ ప్రారంభంలో మా క్లబ్బు అధ్యక్షుడు ఏ పూలదండతో సన్మానించాడో ఆ పూలదండను- మంత్రిగారి మెడలోనుండి స్వాధీనం చేసుకున్నాడు. ఆ వెనువెంటనే మంత్రిగారు వేదిక దిగిపోయి, తరువాతి మజిలీకి నిష్క్రమించారు.

క్లుప్తమైన ప్రకటన తరువాత, రాన్ మైకు దగ్గరికి లేచొచ్చి, సూటిగా విషయం లోకి దిగిపోయాడు.

"మనం వినాశనానికి ఎంత దగ్గరలో ఉన్నామో మీకందరికీ బాగా తెలుసు" అన్నాడు మొదటి వాక్యంగా.

"ఇప్పటిదాకా తెలీదు. అంత ఘోర మైంది ఇంకా వినలేదు. నువ్వు కానిచ్చే సెయ్" శ్రోతల్లో నుండి ఎవరో ఎద్దేవా చేశారు. ఖాతరు చెయ్యకుండా రాన్ హెచ్చరిక సూచకంగా తన చూపుడు వేలిని ఉపన్యాసం పొడవునా ఎత్తి పట్టు కుని, టైపు చేసిన ప్రసంగాన్ని చదవడం కొనసాగించాడు.

"పుట్టినప్పుడు మనిషి స్వతంత్రుడు. కానీ ఎక్కడ చూసినా అతడు బందీగానే కనిపిస్తున్నాడు" అన్నాడు రూసో.

"రూసో కాదు, వాల్టేర్" అన్నాడు ఎగ తాళిచేసే శ్రోత.

"ఎవరో ఒకరు. చెప్పింది ఎవరా అన్నది గాదు ఇక్కడ ప్రధానం. కంటికి కనిపిం చని సంకెళ్లు మానవజాతికి ఉన్నాయని తెలుసుకోవలసిన సమయం ఆసన్నమైం దని గుర్తించడం. సరైన సమయంలో వాటిని గుర్తించేందుకు విఫలమైతే, అవే మనను అధిగమిస్తాయి"

"ఐతే సరే. కమ్మరిని పిలిపించి ఆకురా యితో కోయించేద్దాం గానీ, నువ్వు చెప్పే దేదో చెప్పు ముందు"

"ముందు ఆ కొంటెమనిషిని బయటికి పంపించండి. కావాలని సభను చెడగొడు తున్నాడు. మీరు కానివ్వండి సార్. వాణ్ణి పట్టించుకోవద్దు" అన్నాడొక మనిషి మరో గుంపు నుండి. దానిమీద చిన్న తగాదా తలెత్తింది. ఎగతాళి చేసిన తుంటరిని ఇద్దరు బలమైన మనుషులు బయటికి లాక్కుపోయారు. వాళ్లు హాల్లోకి తిరిగొచ్చి, "మీరు కానివ్వండి. వాణ్ణి పట్టించుకోకండి. ఏ సభలోనూ వాడింతే" అంటూ రాన్‌కు భరోసా ఇచ్చారు.

రాన్ తిరిగి పేపర్లు చదవడం ప్రారం భించాడు. ఆదివారం ప్రార్థనా సమావే శంలో క్రీస్తు పునరుత్థానం విశ్వసించే మతబోధకుని హావభావ ప్రదర్శనా నైపు ణ్యానికి తీసిపోని ఆవేశంతో అతడు ఒక చోట గొంతు తగ్గిస్తాడు. ఇంకొకచోట పెద్దగా పెంచుతాడు. అతడు నిర్మిస్తున్న నాటకంలోని సన్నివేశానికి అనుగుణంగా ఒకసారి రహస్యం చెబుతున్నంత మెల్లిగా గుసగుసలాడుతాడు. ఇంకోసారి ఉరు ములు దొర్లినట్టుగా గర్జిస్తాడు. ఒకసారి విషాదంగా నిట్టూరుస్తాడు. మరోసారి కెవ్వున ఆర్తనాదం చేస్తాడు. క్రీ.శ. 3000 నాటికి ఈ భూమి అంతరించిపోతుందని అతని కథనం. ఏ వొక్కరూ గమనించి వుండని ఒకానొక కలుపు మొక్కను చేత్తో పట్టుకుని చూపిస్తూ, రాబోయే కాలంలో ఆ చిన్నకుచ్చు ఈ భూగోళాన్ని ఎలా ఆక్రమిం చబోయేదీ అతడు వివరిస్తుంటే శ్రోతలు నిర్ఘాంతపోయి వింటున్నారు.

"సీసాలో బంధించిన భూతం ఎంత అప్రధానంగా కనిపిస్తుందో ఇది గూడా అలాగే కనిపించొచ్చు. ఒక్కసారి బిరడా తీస్తే, అప్పుడుగానీ తెలీదు భయంకరంగా విస్తరించే దీని ఆకారం" అంటూ కొనసా గించి, అది ఎంత భయంకరంగా పెరుగు తుందో, ఎంత విస్తృతంగా వ్యాపిస్తుందో చెప్పి, క్రీ.శ. 2500 నాటికి సగం భూగో ళాన్ని నింపేస్తుందని తేల్చేశాడు.

"దీనికి స్వజాతిని భోంచేసే లక్షణం గూడా ఉంది. అమేజాన్ నది తీరప్రాం తాల్లో కొన్నిచోట్ల దీన్ని 'క్యాన్నిబాల్ గరికె' అనే పేరుతోనే పిలుస్తారు. మొదట్లో ఆ మాటను క్యాన్నిబాల్స్‌కు (స్వజాతిని భుజించేవాళ్లకు) ఆహారంగా ఉపయోగప డేదని పొరపాటుగా అర్థం చేసుకున్నారు.

కానీ దాని అసలు అర్థం- ఇతర వృక్షజాతులను భుజించి బలాన్ని పుంజుకునేదని. ఎక్కడ ఇది కనిపిస్తుందో అక్కడ ఇతర జాతిమొక్క బతకలేదు. అందుబాటైన ఏ మొక్కనైనా సరే, దాన్ని సమూలంగా- ఆకులూ, కొమ్మలూ, వేర్లూ ఏవీ మిగల్చకుండా- మింగేస్తుంది. దప్పిక తీర్చుకునేందుకు భూగర్భజలాన్ని- ఎంత లోతులో వున్నాసరే- పీల్చి పారేస్తుంది. నేను సేకరించిన నమూనాల్లో దీని వేరు ఒకటుంది, సన్నటి తీగెలా వుండే వేరు.. బయటికి పెరికి చూస్తే, పొడవు మూడువందల అడుగులుంది. వేరు చివర్లో మైక్రోస్కోపులో చూస్తే నీటిని పీల్చుకునే సంచులు కనిపించాయి. అలాటి సంచులు కోటానుకోట్లు, నీటిని పీల్చేస్తూ గాలిలోకి ఆవిరిగా వదిలేస్తూంటే భూగర్భంలో గాని, నదుల్లో గాని, సముద్రంలో గాని నీటిచుక్క మిగిలే అవకాశమే లేదు.

శాస్త్రజ్ఞులు- జీవశాస్త్ర నిపుణులూ, జీవరసాయనశాస్త్ర నిపుణులూ- దీన్ని తుదముట్టించే మిశ్రమాల కోసం అహర్నిశలూ రహస్యంగా పరిశోధనలు చేస్తున్నారు. రహస్యంగా ఎందుకుంచుతున్నారంటే- భయాందోళన సృష్టించడం ఇష్టపడక. అయితే ఈ కలుపు ఏ మందుల మిశ్రమాన్నైనా, ఎంత వినాశకరమైన క్రిమినైనా తట్టుకునే శక్తిని తనలో ఉత్పత్తి చేసుకుంటూ వుంది. రెండోతరం మొక్కమీద ఆ మందులూ పనిచెయ్యవు. ఆ క్రిములూ పనిచెయ్యవు. అవి దానికి ఆహారంగా మారిపోతున్నాయి. మన పురాణాల్లో చెబుతుంటారే రాక్షసులను- వాళ్ళ రక్తం చుక్క నేలమీద పడితే అందులో నుండి వందమంది కొత్త రాక్షసులు పుట్టుకొస్తారని- ఆ రాక్షసులకు ఇది దాయాది"

దాన్ని గురించి అలా చెప్పి చెప్పి, ఆ తరువాత మానవులకుండే మరో ప్రమాదాన్ని తీసుకుంటూ, "మీ కందరికీ తెలిసేవుంటుంది- మన దేశంలో ఒక్కో పౌరునికి ఎనిమిది చొప్పున ఎలుకలు ఉన్నాయని. అంటే ఉత్పత్తి అవుతున్న ఆహారధాన్యంలో కేవలం ఎనిమిదింటి భాగం మాత్రమే మనుషుల వినియోగానికి న్యాయసమ్మతంగా-"

"న్యాయసమ్మతమంటే అర్థమేమిటి? తిండితినే హక్కు ఎలుకలకు ఎందుకు లేదు? అవిగూడా మనలాగే ఈ భూమ్మీద నివసించే ప్రాణులు" వెనకసీట్ల నుండి కేక వినిపించింది. బయటికి

## కొత్తగాలి...

**నా ముఖం తప్ప**
**ఏ అద్దం బాగాలేదు**
**అన్నింటినీ బద్దలు కొట్టేయాలి**
**ఇప్పుడే**

– కందాళై రాఘవాచార్య,
నిజామాబాద్

గెంటించుకున్న తుంటరి తిరిగొచ్చాడని తెలుస్తున్నా, అతడు జనంలో ఎక్కడ నక్కి వున్నాడో ప్రత్యర్థులకు ఆచూకీ చిక్కలేదు.

"వాడిని పట్టించుకోకండి డాక్టర్. వాడో తలతిక్క వెధవ" అన్నాడు మరో వ్యక్తి.

"నేనేం తలతిక్క వెధవను కాదు. మీకంటే ఎక్కువ చదువుకున్నోణ్ణి. డాక్టరేట్ చేసినవాణ్ణి"

అతడు ఎక్కడున్నా పట్టుకునేందుకు ప్రత్యర్థులు లేచారు. దాంతో చిన్న కలకలం బయలుదేరింది. ఉపన్యాసంతో విసిగిన శ్రోతల్లో కొందరు లేచి వెళ్లిపోయేందుకు దారి చేసుకోవడం మొదలెట్టారు. దిక్కుతోచక రాస్ అలాగే నిలిచిపోయాడు.

"వాడినెందుకు పట్టించుకుంటావు? నువ్వు కానిచ్చేసెయ్, మొదలెట్టు" అన్నాను అతన్తో మెల్లగా.

"ఈనాడు మనం ఇలాటి సమస్యలు వందలాదిగా ఎదుర్కుంటున్నాము" అంటూ ఓ గంటసేపు మానవుని మనుగడకు సవాలుగా నిలిచిన రకరకాల ప్రమాదాలను సమగ్రంగా చెప్పుకొచ్చాడు. అతనిది బీభత్స ప్రధానమైన జ్యోతిష్యం.

"ఎలుకలు మన ఆహారధాన్యాల నిలువలను నాశనం చేస్తున్నాయా, ఈ కలుపు ఆ ఎలుకలను గూడా వదలకుండా సర్వస్వాన్ని మింగేస్తుంది. అన్నిటినీ రాక్షసంగా బలిగొంటుంది. ఇప్పటివరకు గమనించిన దాన్ని బట్టి, ఇది పెరిగేది దశాబ్దానికి ఒక మిల్లీమీటరులో పదోవంతు. కానీ చివరకు ఆకాశంవైపు రాక్షసంగా ఎదుగుతుంది. ఎవరైనా ఇతర గ్రహం నుండి చూస్తే భూమి ఉపరితలం ఎలా కనిపిస్తుందనుకున్నారు- కుంచె చివర కుచ్చుంటుందే అలా కనిపిస్తుంది. భారీ ఇన్ఫ్రారెడ్ టెలిస్కోపుతో మరింత దగ్గరగా చూస్తే- ఎక్కడ చూసినా చెల్లాచెదురుగా పడివున్న అస్థిపంజరాలు- మనుషులవీ జంతువులవీ- ఈ రాక్షసగడ్డికి ఎలుకల భోజనంగా ఉపయోగపడుతూ కనిపిస్తాయి"

ఆ మాట వినగానే ఒక స్త్రీ గావుకేక వినిపించింది. "అయ్యయ్యో, మన మనవళ్ళకు పట్టబోయే గతి ఇదా!"

"ఆ ముసలావిడ మూర్ఛపోయింది. ఎవరైనా పరుగెత్తుకెళ్లి డాక్టరును తీసుకురండి"

సొమ్మసిల్లి కుర్చీ నుండి పడిపోయిన ముసలమ్మ చుట్టూ జనం గుమిగూడారు. ఒకరు ముఖంమీద నీళ్ళు చిలకరిస్తూంటే, మరొకరు విసురుతున్నారు. "ఆమెకు గాలి తగలనివ్వండి. గుంపుగా మూగకండి" అన్నారు ఇంకొకరు. ముసలావిడ కొద్దిగా తేరుకోగానే, ఆమెకు ధైర్యం చెప్పే ఉద్దేశంతో ఎవరో అన్నారు- "అది జరగబోయేది క్రీ.శ. 3000 నాటికి. ఇప్పుడిప్పుడే కాదు"

"ఎప్పుడైతే మాత్రం? " అందావిడ.

"ఇంత ఘోరంగా మనం నాశనమైపోవడం నాకు సుతరామూ ఇష్టం లేదు. మన పిల్లలను ఎలాగైనా రక్షించుకోవాలి" అంది మరో స్త్రీ.

'పిల్లలు' అనే మాట వినిపించగానే, మూర్ఛనుండి అప్పుడప్పుడే తేరుకుంటున్న ముసలావిడ బిగ్గరగా అరిచింది- "అయ్యో, పిల్లల్లారా! వాళ్ళను ఎక్కడికైనా తీసుకుపోలేరా? అయ్యో, ఎక్కడైనా ప్రమాదం లేని చోటుకు చేర్పించండి"

మిగతా ఆడవాళ్ళంతా తమ తమ పిల్లల చేతిని పిడికిట్లో గట్టిగా పట్టుకుని, బయటికి తీసుకెళ్ళే ప్రయత్నంతో లాగుతున్నారు. పిల్లలు విదిలించుకుంటూ మారాం చేస్తున్నారు. "గొడవ చెయ్యకుండా నడు. ఇది అపశకునాల గూడు. ఇక్కడ కూర్చోవడమే పెద్ద ప్రమాదం" అంటూ తల్లులు గదమాయిస్తున్నారు.

ఆడవాళ్లకు ధైర్యం చెప్పాలనుకునే పురుషులు కొంతమంది, "అంత కంగారుపడే అవసరం లేదు. ఇది జరగబోయేది ఎప్పుడో వెయ్యేళ్ళ తరువాత. ఇప్పుడొచ్చిన ప్రమాదమేం లేదు" అంటున్నారు.

"నువ్వెవరు ఆ మాట చెప్పేందుకు? నీకు ఏ అధికారముందని ఆ మాట అంటున్నావు? ఎవరు జూశారు, ఈ రోజే జరిగినా జరగొచ్చు"

ఎవరికి వాళ్ళు కుర్చీల నుండి లేవడంతో సభ గందరగోళంగా మారిపోయింది. సహాయమంత్రిగారిని సాగనంపి తిరిగొచ్చిన మా అధ్యక్షుడు తలుపు దగ్గరే ఆగిపోయి, ఆ తరువాత చేతికి చిక్కకుండా

# స్ఫూర్తినిచ్చిన చిరుత

చతుర ప్రపంచం

అమెరికాలోని పదిహేడేళ్ళ కోరీపెరియాకి బేస్‌బాల్ ఆటలో హీరోగా గుర్తింపు పొందాలనేదే ఏకైక లక్ష్యం. కోరీ సమర్థత విషయంలో ఎవరికీ అనుమానం లేదు. చక్కగా బేస్‌బాల్ ఆడేవారి కోసం వెదికే బాబ్ షెపర్డ్ కోరీని గుర్తించి టీంలోకి తీసుకున్నాడు. కొద్దికాలానికే ఓ ప్రమాదంలో కోరీ కుడికాలు విరిగింది. కాలితోపాటు అతడు తన ఆత్మవిశ్వాసాన్నీ కోల్పోయాడు. ఆ ప్రమాదం మానసికంగాను అతన్ని కుంటివాణ్ని చేసింది. తన అధైర్యాన్ని తగ్గించుకోడానికి వీల్ చెయిర్‌లో అతను అనేక రిహాబిలిటేషన్ ప్రోగ్రామ్‌లకు వెళ్లసాగాడు. ఐతే అవేవీ అతన్ని ప్రోత్సహించలేకపోయాయి. ఓరోజు అతన్ని ఫీల్డ్‌ట్రిప్‌కి తీసుకెళ్ళారు. 'ఎవ్వరూ నాకు సాయం చేయలేరు' అని ఆ ప్రోగ్రాం నిర్వాహకుడితో నిరాశగా చెప్పాడు కోరీ. లాస్‌ఏంజల్స్‌కి దగ్గరలో హాలీవుడ్ నటి టిప్పీ హెన్డ్రెన్ నడిపే షంబాలా పార్క్‌లో పులులున్నాయి. ఓ పెద్ద ఓక్‌వృక్షం మీదున్న 'సుచిర' అనే చిరుతను చూసాడు. అది వేగంగా పరిగెత్తడం చూసి కోరీ ఆశ్చర్యపోయాడు.



"ఈ చిరుత పిల్ల రెగాన్ జూలో పుట్టినప్పుడు బొడ్డుతాడు చుట్టుకుని కాలు పోయింది. మూడు కాళ్ళ చిరుతని చూడడానికి ఎవరూ ఇష్టపడరని దాన్ని చంపాలనుకున్నారు. ఇది తెలిసి నేను దాన్ని ఇక్కడికి తీసుకొచ్చాను. అంగవైకల్యాన్ని అది అధిగమించింది" అని ఆ నటి కోరీతో చెప్పింది. "దాన్ని నేనోసారి ముట్టుకోవచ్చా?" పదిహేడేళ్ళ కోరీ అడిగాడు. ఆ తర్వాత కోరీ జీవితం మారిపోయింది. అతను తన డిప్రెషన్‌లోంచి బయటపడ్డాడు.

జారుకున్నాడు. మంత్రిగారితోపాటు పోలీసు బలగం కూడా నిష్క్రమించింది. చేతి దురద ఉండే కుర్రాళ్ళు కొందరు మడతకుర్చీలను పైకెత్తి, శక్తికొద్దీ విసిరేస్తూ తునాతునకలు చేస్తున్నారు. మరికొంత మంది వాటిని మోపులుగా బయటికి మోసుకెళ్ళి స్వేచ్ఛగా తగులబెడుతున్నారు. ఇంతలో ఎవరో ఆడిటోరియం లైట్లు తీసేయగానే గగ్గోలు రెట్టింపయింది. వేదిక మీది లైట్లు మాత్రం ఎలాగో ఆరిపోకుండా నిలిచాయి. విగిరిన కుర్చీల కాళ్ళూ, చేతులూ ఆయుధాలుగా పిడికిట్లో పట్టుకొని ఒక రౌడీగుంపు... 'నశించాలి' అంటూ ఎలుగెత్తి నినాదాలు చేసుకుంటూ వేదికమీదికి ఎగబడుతూంది.

తను ఊహించిన వినాశనానికి చిన్నపాటి ముందస్తు నమూనాను నిశ్శబ్దంగా తిలకిస్తూ రాన్ కుర్చీలో మూర్ఖంగా కూర్చుండిపోయాడు. "లే తొందరగా, మూర్ఖుడా, వాళ్ళ చేతిలో చావకముందే బయటపడాలి. రా వెళ్దాం" అన్నాను అతని కాలరు పట్టుకుని లేవదీస్తూ.

"ఎందుకూ, ఎందుకూ?" అంటూ అతడు గింజుకుంటున్నా వదలకుండా స్టేజి వెనకుండే ఆవరణంలోకి బలవంతంగా లాక్కుపోయి, టౌనుహాలు ప్రహరీ గేటు తెరచి, చీకట్లోకి తోసేశాను.

"ఇలారండి డాక్టరుగారూ, మీ కారు ఇక్కడుంది" అంటూ ఇద్దరు మనుషులు సమీపించి, చీకట్లో అతన్ని నడిపించుకుంటూ తీసుకెళ్ళారు.

కారు డోరు దభీల్లున మూసుకోవడం విన్న తరువాత నేను వెనక్కు తిరిగాను. అదే నేను రాన్ పేరుగల మనిషిని చిట్టచి

వరిసారిగా చూడటం. ఆ తరువాత మరెప్పుడూ అతడు నాకు కనిపించలేదు.

కొన్ని రోజుల తరువాత కమాండెంట్ సరసగారి నుండి నాకు ఉత్తరం వచ్చింది. 'ఇది కృతజ్ఞతలు చెప్పుకోవడం మాత్రమే. నా శ్రేయోభిలాషులు ఆయన్ను పట్టుకొచ్చి, నేను ఏర్పాటు జేసుకున్న కారులో కూర్చోబెట్టారు. ఇకమీద ఆయన సంతోషంగానే ఉంటారనుకుంటా. నా చూపుల్లో నుండి ఆయన తప్పించుకోకుండా జాగ్రత్తలు తీసుకుంటాను. మా చిరునామాకు తన సామాన్లను పంపవలసిందిగా ఆయన మిమ్మల్ని కోరమన్నాడు' అనేది అందులో వర్తమానం.

★ ★ ★

టౌనుహాలు మెయిన్‌గేటుకు కాస్తా ఎడంగా, సగం సగం చీకట్లో, అంబాసిడర్ కారు నిలుపుకుని ఘనత వహించిన అతిథికోసం గఫూర్ ఎదురుచూస్తున్నాడు. గగ్గోలైన ప్రేక్షకులందరూ ఆడిటోరియం ఖాళీచేసి, లైట్లన్నీ తీసేసేదాకా హాల్లోనే ఉండి, ఆ తరువాత నేను ఇంటికి బయలుదేరాను.

దారిలో గఫూర్ టాక్సీని గమనించి, "నువ్వేం చేస్తున్నావిక్కడ? " అన్నాను.

"నీకు తెలుసుగదా. ఆయన ఇక్కడ ఉండమన్నారు. కొండమీద గెస్ట్‌హౌస్ చాలాదూరం. ఎప్పుడు వెళ్లాలో, ఏమో, డిక్కీలో ఆయన సామాన్లన్నీ తీసుకొచ్చాను. ఆయన చెప్పినట్టు సాయంత్రం నీ ఇంట్లో నుండి తీసుకొచ్చాను"

"రోల్స్‌రాయ్ కొనాలనే ఆశ ఇంకా చావలేదా? " నవ్వు ఆపుకుంటూ అడిగాను.

"ఈ లెక్కన ఆయన బాడుగలు ఇస్తూంటే అదో లెక్కా? ఢిల్లీకో బొంబాయికో నా కారే పిలవచ్చునేమో"

"అతడు ఢిల్లీకి బయలుదేరి చాలాసేపయింది" అంటూ జరిగిన సంగతి అతన్తో క్లుప్తంగా చెప్పాను.

"అతని తప్పేముంది? పాపం, భార్యతో కలుసుకున్నాడు. అతనిమీద ఆమెకు హక్కుగూడా ఉంది. అతడు ఆమెకు భర్తగా ఉండాలనే సర్టిఫికెట్ గూడా ఆమె చేతుల్లో వుంది"

"అక్కడ కాచుకుని కూర్చున్న అమ్మాయి గతేమిటి? "

"ఎక్కడుంది? "

"అన్నీ సర్దుకుని స్కూలు వరండాలో ఉంది. ఇద్దరూ కలిసి కొండమీది గెస్ట్‌హౌసుకు వెళ్ళాలనుకున్నారు. ఆ తరువాత-"

"అక్కడికి వెళ్దాం పద. ఆమెను ఇంటికి చేరుద్దాం"

"మీటింగు అయిపోయిందా? నేనుగూడా అక్కడికొచ్చి నీ ఉపన్యాసం వినాలనీ, జనం చప్పట్లు కొడుతూంటే గంతులేయాలనీ ఎంతగా ఆశపడ్డానో. పోనీలే, ఇప్పుడు నీకు సంతోషంగా ఉందిగదూ. ఇక మనకు ఎవరూ అడ్డుండరు" ఆ అమ్మాయి ఆవేశాన్ని వెళ్లగక్కుతూ కారు దగ్గరికి పరిగెత్తుకుని వస్తూవుంది.

గఫూర్ గబాలున కారు దిగి, మారిన పరిస్థితిని చెప్పేందుకు రెండడుగులు ఆమెకు ఎదురుగా నడిచాడు. నన్ను చూసిన తరువాత ఆమె పిచ్చెత్తినట్టు ఏడుస్తూ, "నేను మిమ్మల్ని నమ్మను. ఆయనంటే మీకెవరికీ గిట్టదు. ఆయన ఎంత మంచివాడో, అంత ఉదారమైన మనిషి, అంత జాలి గుండె ఉండే మనిషి, అంతగా ప్రేమించే మనిషి ఎక్కడా ఉండడు. మీరు ఆయన్ను అర్థం చేసుకోలేదు. ఆయన ఎక్కడున్నా సరే, నన్ను అక్కడికే తీసుకెళ్ళండి. నిజమేదో ఆయన నోటితోనే చెప్పనివ్వండి. ప్లీజ్, ప్లీజ్, నేను బతిమాలుకుంటున్నాను" అని నన్ను తిట్టిపోస్తూ గుండెలు బాదుకుంది.

రాన్‌ను ఆమె చూసిన కోణం పూర్తిగా

భిన్నమైందని నాకు అర్థమైంది. అతన్ని ఏ తప్పూ చెయ్యని దేవునిగా ఆమె ఆరాధి స్తోంది. ధారాపాతంగా కురుస్తున్న కన్నీ ళ్లతో, తన దైవాన్ని గురించి ఎడతెగకుండా వదురుతున్న స్తోత్రపాఠంతో ఆమె ముఖం వికృతంగా మారిపోయింది. వాళ్ళ స్నేహం ఎంత లోతులకు చేరిందో తెలిసి నేను అవాక్కయ్యాను. వాళ్ళ సంబంధం అల్లేసుకున్న మోతాదును ఊహిస్తే, రాన్ ఆందోళనపడే రాక్షసగడ్డి నెరుసుకుపోయే దృశ్యం నా కళ్ళముందు నిలిచింది. రాన్ గురించి ఇప్పుడు ఆమెతో ఏం చెప్పినా ప్రయోజనముండదు. ఆమె చెవికి ఎక్కిం చుకునే పరిస్థితిలో లేదు. బయట ప్రపంచం తెలీకుండా తాను కట్టుకున్న అడ్డుగోడను ఏ వాస్తవం ఇప్పుడు ఛేదించ లేదు.

> **కొత్తగాలి...**
>
> **గుండెల్లో**
> **సముద్రాన్ని మోస్తూ**
> **పెదవులపై**
> **చిరునవ్వు నతికించే**
> **నా బతుకు చిత్రం... ఆమె**
>
> – పెరుగు రామకృష్ణ, నెల్లూరు

ఆమె ఆక్రోశాన్ని పూర్తిగా వెళ్లగక్కనివ్వ డమే మంచిదని కాచుకున్నాను. గపూర్ నా స్నేహితుడు గాబట్టి, ఆలస్యాన్ని ఓర్చు కుంటాడు. అతనికి కూడా ఆ పిల్ల చిన్న ప్పటినుండి తెలుసు. ఆమెలో వచ్చిన మార్పు అతన్నిగూడా నిశ్చేష్టున్ని చేసింది. కారులో కూర్చునేలా ఆమెను ఒప్పించేం దుకు ఎంతోసేపు పట్టింది. గపూర్ వెళ్ళి ఆమె ట్రంకుపెట్టె తీసుకొచ్చాడు. ఆమె ఎంత నిస్సత్తువుగా మారిందంటే, ఒక చిన్న తోపుతో కారులో కూలబడింది. మరో చిన్న తోపుతో ఆమె వీపు సీటుకు అంటుకుపోయింది. నిరాశలో కూరుకుపో యి, కనీసం మేము ఎక్కడికి తీసుకుపోతు న్నామనే సంగతైనా పట్టించుకోలేదు. ఇంటికి చేరే మలుపు తిరిగినప్పుడు మాత్రం, "తాతయ్యను లేపొద్దండి. నేనే లోపలికి వెళ్ళిపోతాను" అంది.

సమయం నట్ట నడిరాత్రి. నేను తటప టాయించాను. కానీ ఆమెతో వాదించి ప్రయోజనముండదు. అలికిడి కాకుండా ఆమెనూ, ట్రంకుపెట్టెనూ వాకిటిముందు దింపి నిశ్శబ్దంగా మేము దాటుకున్నాము. కబీర్ వీధి చేరుకునేదాకా ఇద్దరం మూగ వాళ్ళలా కూర్చుండిపోయాం. ఇంటి ముందు ఆగగానే గపూర్ అడిగాడు- 'అతని సామాన్లు ఏంజేసేది?' అని. అతడు ఆందోళనతో వణికిపోతున్నాడు.

"నా దగ్గరే ఉంచు. అతనికి చేర్పిస్తాను"

"మీటరు ఛార్జీ ఇచ్చేదెవరు?"

"రేపు లోటస్ క్లబ్బులో మాట్లాడి ఏర్పాటు చేయిస్తా"

నిరాశగా వాపసు వెళ్ళుతూ, "పాపం చాలా మంచి అమ్మాయి" అన్నాడు గపూర్.

★ ★ ★

ఒక వారం రోజులదాకా టౌనుహాలు లైబ్రరీకి వెళ్ళడం కుదరలేదు. తిరిగి వార్త లకోసం వేటమార్గం ప్రారంభించి, తపాలా పంపే కార్యక్రమాన్ని పునరుద్ధరించిన తరు వాత, ఒకనాటి ఉదయం అక్కడికి వెళ్ళ గానే లైబ్రేరియన్ ముసలాయన పెద్దగా నిట్టూర్చి, "అబ్బా, వచ్చావా? ఎప్పుడు కని పిస్తావా అనుకుంటూ ఎదురుజూస్తు న్నాను. బుజ్జికి ఆరోగ్యం బావుండలేదు. క్లాస్‌మేట్లతో ఏదో యాత్రకని వెళ్ళిందా, ఆ ప్రయాణమే ఆరోగ్యం చెడగొట్టింది. చిన్న పిల్లలు గదా, అడ్డమైన తిండీ తినుంటారు.

అనుకున్నదానికంటే ముందే తిరిగొచ్చింది గూడా. డా. క్రిష్ణయ్యకు చూపించాను. ఏవో మందులు ఇచ్చాడు" అన్నాడు గుక్క తిప్పుకోకుండా.

"ఏం ఫరవాలేదు. కోలుకుంటుంది. నువ్వు దిగులుపడొద్దు" అన్నాను ఉత్సాహం కొనితెచ్చుకుంటూ.

"మా ఊర్లో మా ఇలవేల్పు మా గుడిలోనే ఉంది. మొక్కుబడి చెల్లించక చాలా ఏళ్ళయింది. ఇంతకాలం పట్టించుకోకపోవడం తప్పైపోయింది. మొక్కుబడి చెల్లిస్తేగానీ బుజ్జికి నయంగాదు"

"మంచిదే. తప్పకుండా తీసుకెళ్ళండి" అన్నాను ప్రకాశంగా. 'ఎందుకైనా మంచిది, లేడీ డాక్టర్‌కు గూడా చూపెట్టండి' అనే సలహాను నాలోనే అణుచుకున్నాను.

★ ★ ★

అతన్ని అనవసరంగా పోగొట్టుకున్నానే అనిపించింది. రాన్ లేకపోవడంతో ఆ ముందరిగది బోసిపోయింది. రాన్‌లాటి మనిషి మరొకడు రాకపోతాడా అనే ఆశతో ఆ గదిని ఖాళీగా వదిలేశాను. రాన్ తిరిగొస్తాడో ఏమో ఎవరు చూశారు? తన అపూర్వగ్రంథాన్ని పూర్తిజేసేందుకో, లైబ్రేరియన్ మనుమరాలి విద్యాభ్యాసం పైస్థాయికి తీసుకెళ్లేందుకో రాగూడదని ఎక్కడుంది? మొదట్లో వాళ్ళ సహవాసం నన్ను కలతపెట్టిన మాట నిజమే గానీ, ఇప్పుడది అంత అభ్యంతరకరంగా తోచలేదు. బహుశా వాళ్ళ ఆత్మీయత శారీరక సంబంధానికి అతీతమైంది గూడా అయ్యుండొచ్చు. వాళ్ల సాన్నిహిత్యాన్ని నేను తప్పుగా అర్థం చేసుకోనుండొచ్చు. ఆ అసంభవమైన ప్రత్యామ్నాయానికి నాలో నేను నవ్వుకున్నాను. శారీరక సంబంధానికి అతీతమైన సాన్నిహిత్యానికి గఫూర్ టాక్సీలో కొండమీది గెస్ట్‌హౌస్ చేరుకునే అవసరముండదు. లైంగికవాంఛలేని అనురాగానికి రాత్రికిరాత్రే రహస్యంగా లేచిపోయే అవసరం కలగదు. కాబట్టి కొత్త భాష్యం చెప్పుకోవడం దండగ. నాకు నేనే వాస్తవాలను దాచుకునే ఖర్మేమొచ్చింది? అతడొక నిర్దాక్షిణ్యమైన, విచక్షణారహితమైన కామాంధుడు అనేది తిరుగులేని వాస్తవం. దేవుని దయవల్ల ఆ పిల్లను లేపుకొచ్చి నా ఇంట్లోనే కాపురం పెట్టలేదు. అదే జరిగుంటే కబీర్ వీధి యుద్ధరంగంగా మారుండేది. మా వాళ్ళు ఎంతకు తెగించే వాళ్ళో ఆ భగవంతుడికే తెలియాలి.

అదృష్టంకొద్దీ జరగరానిదేదీ జరుగలేదు. ఆ అమ్మాయి నిరపాయంగా బయటపడింది. బుద్ధిగా కాలేజికి వెళుతూ, తిరిగి చదువులో పడింది. అడపాదడపా ఆ సమాచారాన్ని టౌనుహాలు లైబ్రరీలో పరోక్షంగా విచారించుకుంటున్నాను. మనుమరాలిని గురించి మాట్లాడడమంటే ముసలాయనకు మహా సంతోషం. "అబ్బో, చదువులో పూర్తిగా మునిగిపోయింది. స్కూలు వదలగానే నేరుగా ఇంటికే వచ్చేస్తుంది. వచ్చిన దగ్గరినుండి చదువుకుంటూనో రాసుకుంటూనో కూర్చుంటుంది. ఎక్కడ ఆరోగ్యం చెడుతుందోనని వాళ్ళ అమ్మమ్మ దిగులు. కొద్దిసేపు స్నేహితురాళ్ళతో సరదాగా తిరిగి రమ్మంటుంది. బుజ్జికి సరదాల మీద మోజే పోయింది. ఏదో దీక్షగా మారిపోయింది"

బోర్డులేని హోటల్లో రాన్ గురించి నేను చెప్పే కథనంలో కొద్దిపాటి మార్పులకు చోటు కల్పించాను. గిరిజకు సంబంధించిన సంఘటనలను చాలావరకు దాటేస్తున్నాను. అలా చేస్తేనే ఆ అమ్మాయి పరువు నిలబడేది. రాన్‌కు గిరిజతో వున్న సంబంధం గురించి ప్రచారంలో వున్న పుకార్లను ఎవరైనా ప్రస్తావించినా, అపోహలకింద వాటిని కొట్టేసేవాణ్ణి. నేను ఎంత

అడ్డుకున్నా, హఠాత్తుగా అతడు అదృశ్యం కావడంమీద నడిచే చర్చలు నిరంతరాయంగా కొనసాగుతూనే ఉన్నాయి.

"అంటే, తన సొంత భర్తను మీటింగులో నుండి తనే ఎత్తుకెళ్ళిందన్నమాట! అద్భుతంగా ఉంది. ఆ తరువాత?" అన్నాడు వర్మ అందరికంటే ముందు.

"ఆ తరువాత ఏముంటుంది? కమాండెంట్ సరస దగ్గరినుండి నిన్న వచ్చిన ఉత్తరాన్నిబట్టి వాళ్ళు సుఖంగా కాపురం చేసుకుంటున్నారు. ఆమె అతన్ని అదుపులో పెట్టినట్టుంది. మరోసారి పారిపోతాడని అనుకోలేం. మొగుడూ పెళ్ళాల తగాదాలు మనం ఎన్ని చూడలేదు? అవి ఎల్లకాలం నిలిచేవి కాదు. ప్రేమాభిమానాలుండే జంటలు ఆ సంధికాలాన్ని దాటుకోవడం మనం చూస్తున్నదే గదా" అన్నాను.

"మన పురాణాల్లో సావిత్రీ సత్యవంతుల కథలాగా ఉంది. భర్త ప్రాణం పాశంతో లాగేసుకుని యముడు ఎత్తుకుపోతూంటే, ఆ తల్లి అడుగడుగునా యముణ్ణి వెంబడించి, ఎంతగా బతిమాలింది, ఎంతగా బతిమాలింది? వాపసు ఇచ్చేదాకా వదల్లేదు. అడవిలో శవమై పడిపోయిన సత్యవంతుడు తిరిగి ప్రాణంతో లేచి భార్యతో కలుసుకున్నాడు. ఈ సరసగారు కూడా అంతటిదే అనిపిస్తుంది" అన్నాడు వర్మ.

దేనికీ నేను ఆక్షేపించకుండా, అతన్నీ అతని జతగాళ్ళనూ వారి వారి ఊహలకు వదిలేశాను. తను సేకరించిన ముప్పై సంవత్సరాల క్యాలెండర్లలో ఏదో వొకదాంట్లో యముణ్ణి సావిత్రి వెంటబడే దృశ్యం, రంగుల లిథోలో అచ్చయింది, ఉండే ఉంటుంది. అతడు చేసే ఆధ్యాత్మిక నిర్ణయాలు చాలావరకు ఆ గోడమీదున్న బొమ్మలమీద ఆధారపడేవే.

బోర్డులేని హోటల్ సమాజానికి టౌను హాలు సభలో లేచిన గందరగోళం గూడా కుతూహలాన్ని రేకెత్తించింది. ఎవరో కొందరు రౌడీలు ఉద్దేశపూర్వకంగా సభలో దూరి, లేనిపోని గొడవలు సృష్టించడమే అందుకు కారణమని అనుకుంటూ ఉండగా, ఒక సభ్యుడు అందుకుని-

"ఈ భూగోళాన్ని ఆటంబాంబుతో పేల్చేస్తానన్నట్టు ఉపన్యాసకుడు భయపెట్టాడని విన్నాను. నేను వెళ్ళలేదనుకో, మా బావమరిది చెప్పాడు. వాడు ఆల్బర్ట్ మిషన్‌లో చదువుతున్నాడు. ఉపన్యాసకుడు అందరినీ భయపెట్టాడని వాడన్నాడు"

శ్రోతలందరూ సభాపర్యవసానంమీద మూజువాణీ సంకేతంతో సమ్మతిని తెలియజేశారు.

"కానీ సహాయమంత్రి ఉపన్యాసం చాలా సమగ్రంగా, ఆదర్శప్రాయంగా ఉండిందని విన్నాను" అన్నాడు మరో సభ్యుడు.

వాళ్ళ అభిప్రాయాన్ని నేను బలపరచనూలేదు, వ్యతిరేకించనూ లేదు. ఆ అవసరం నాకు కనిపించలేదు.

కానీ ఎక్కడో దూరంగావుండే ఢిల్లీలో, సంకెళ్ళు తొడుక్కుని చేసే సంసారాన్ని రాన్ ఎలా నెట్టుకొస్తున్నాడా అనే ఆలోచన నన్ను వదల్లేదు. ఉత్తరం రాస్తాడని అనుకున్నాను గానీ, ఇంతవరకు అలాటిదేం లేదు. తన ఉపన్యాసం ఆ రీతిలో ముగిసి, ఆ విధంగా వలలో చిక్కినందుకు నామీద అతనికి కోపం వచ్చిందేమో!

★ ★ ★

ఆరు నెలల తరువాత, ఒకరోజు మెయిల్ వ్యాన్‌లో తపాలా పంపేందుకు స్టేషన్‌కు వెళ్ళగానే, స్టేషన్ మాస్టారు ఆత్రంగా నా దగ్గరికి పరిగెత్తుకొచ్చి, "ఆమె వెయిటింగ్ రూములో ఉంది. ఈ రోజు మధ్యాహ్నం జీపులో వచ్చింది" అన్నాడు. ఆ వైపుగా చూశాను. ఖాకీ యూనిఫాంలో ఆమె ద్వారబంధం నిండా నిలబడి కనిపించింది. నన్ను రమ్మని చెయ్యూపి, లోపలికి

వెళ్ళి తలుపు బిగించింది. కొద్ది నిమిషా లకు దుస్తులు మార్చుకుని తలుపు తెరి చింది. చీర- లేత పసుపురంగు చీర- కట్టు కొచ్చింది. "నేను వస్తానని మీరు ఊహిం చివుండరు గదా. ఇదిగో వచ్చాను చూడండి" అంటూ నవ్వుతూ నన్ను పలక రించినప్పుడు ఆమెలో అసాధారణమైన శక్తి కనిపించింది. ఇదివరకటిలాగా రెండు కుర్చీలు చెట్టుకింద వేయించింది. అక్కడక్కడే తచ్చాడుతున్న స్టేషన్‌మాస్టా రుతో- "మాస్టారుగారూ! టైంటేబుల్ మారలేదనుకుంటా, పదకొండు గంటలకు గూడ్సు రైలు వచ్చేదాకా మమ్మల్ని కదిలిం చకండి" అంది.

"అలాగే మేడం. మీకు అన్నీ జ్ఞాపకమే"

"ఒక అరటిపండు, మజ్జిగ తప్ప మరేమీ అక్కరలేదని మీ ఆవిడతో చెప్పండి. అన్ని పూటలా ఆహారం తగ్గించమన్నారు. అవి కావాలనుకుంటే నేనే పిలుస్తాను. అంత దాకా మమ్మల్ని వదిలెయ్యండి. చాలా ముఖ్యమైన సంగతులు మాట్లాడుకోవాలి"

ఆమె నావైపు తిరిగి, "వ.పి.గారూ, ఈ రోజు సాకులు కుదరవు. మీరు కదల కుండా కూర్చుని నేను చెప్పేదంతా వినేతీ రాలి. నేను ఇక్కడ ఎంతోసేపు ఉండేం దుకు కుదరదు. గ్రామీణ ప్రాంతాల సర్వే కని పంపించారు నన్ను ఇక్కడికి. రెండు రోజులుగా జీపులో తిరుగుతున్నాను. జీపు ప్రయాణం మనిషిని గుల్ల చేస్తుంది. తెల్ల వారుజామున్నే తిరుచ్చి చేరుకోవాలి. రేపు మధ్యాహ్నానికల్లా ఢిల్లీలో ఉండాలి. అందు కని నేను ఆట్టేసేపు ఉండేందుకు వీలుప డదు. మీతో చెప్పవలసింది చాలా ఉంది. మీరు నిలకడగా కూర్చోవాలి. ఆకలైతే చెప్పండి, మాస్టారుతో చెప్పి తినేందుకు ఏమైనా తెప్పిస్తాను. అంతేగానీ, కదలగూ డదు. నేను చెప్పేదంతా వినితీరాలి"

స్టేషన్‌మాస్టారూ, పోర్టరూ ఎక్కడో నక్కుకుని వింటుంటారనే అనుమానంతో ఆమే చాలాసేపు అసలు సంగతికి రాకుండా ఊకదంపుడు మాట్లాడింది. వాళ్ళు లేరనే నమ్మకం కుదరగానే, నాకు దగ్గరగా వంగి, మెల్లిగా అంది- "మీ స్నేహి తుడు మళ్ళీ పారిపోయాడు".

అలాటిదేదో వినవలసి వస్తుందని ముందే ఊహించుకున్నాను గనక, "అనుకు న్నాను" అన్నాను అసంకల్పితంగా.

"ఇక్కడే ఉంటే దయవుంచి మళ్ళీ నాకు అప్పగించండి. ఈ ప్రయాణానికి నేను ఒప్పుకున్నానంటే కేవలం ఈ ఆశతోనే. అతడు ఇక్కడికే వచ్చుంటాడని ఆశ. అది ఎండమావిలాంటి ఆశేనని తెలుసు" అంది

> ## కొత్తగాలి...
>
> **అమ్మకు అన్నం అంటే**
> **జీతం చాలదు**
> **కానీ, భార్యకు మాత్రం**
> **పట్టుచీర శాంక్షన్**
>
> – ఈ వేమన,
> శ్రీకాకుళం

ఆమే దీనంగా, ప్రాధేయపూర్వకంగా.

"మీకు సహాయపడాలని మనస్ఫూర్తిగా ఉంది. కానీ అతడు ఇక్కడ లేడంటే నమ్మండి. అతని సమాచారమైనా నాకు తెలీదు. అప్పటి నుండి అతన్ని గురించి విననైనా లేదు"

ఆమెకు నమ్మకం కలిగించేందుకు ఈ మాటలు పదేపదే చెప్పాల్సి వచ్చింది. పర్సులో తారాడి, చేతిగుడ్డ బయటికి లాగి, కళ్ళు తుడుచుకుంది. ముక్కు చీదుకుని- "ఈ కొద్ది నెలలు మా జీవితంలో మరువ లేనివి. ఎప్పుడో మద్రాసులో ఉన్నప్పటి రోజులు తిరిగొచ్చినట్టు ఉండేది. అదే

ఉత్సాహం, అదే ఆత్మీయత అతన్లో కనిపించేవి. మా వయసూ, శారీరకంగా వచ్చిన ఈ మార్పులూ బయటి ప్రపంచానికి ఎలా కనిపించినా మావరకు మాకు మా నాన్న కార్ఖానా రోజుల్లో- ఆ చెట్టుకింది, ఆ బెంచీ మీద, ఒకరితో వొకరం గుసగుసలాడుకున్న రోజులకు తిరిగి వెళ్ళినట్టుండేది. వెనక్కు తిరిగొచ్చిన ఆ క్షణాల మత్తులో ఇప్పటి పరిస్థితే స్పృహలో ఉండేదిగాదు. ఒకరికొకరం తోడుగా, ఏదో సాధించిన భావనతో, ఎంతో తృప్తిగా ఎంతో అపురూపంగా గడిచింది. అలాటి సందర్భాల్లో మీకు చేతులెత్తి నమస్కరించాలనిపించేది. నా ఖర్మకొద్దీ ఆయన్ను విడిచి పెట్టకుండా ఉండేందుకు వీలయ్యేదిగాదు. ఉదయం ఆరుగంటలకే పెరేడ్‌గ్రౌండులో ఉండాలి. ఏవేవో ఉద్యోగబాధ్యతలమీద అక్కడా ఇక్కడా తిరుగుతూ, మధ్యమధ్యలో మాత్రమే ఇంటికి వచ్చేందుకు వీలయ్యేది. క్యాంపుమీద గ్రామాలకు వెళ్ళి, ఒకటిరెండు రోజులు అక్కడే ఉండిపోవలసి వచ్చేది. పని భారం చాలా ఎక్కువ. ఆ బరువు మోయడం నాకు చాలా ఇష్టం. కష్టపడి పనిజేయడం ఆయనకూ నచ్చేది. నన్ను ఎంతగానో మెచ్చుకునేవాడు, ప్రోత్సహించేవాడు. నేను లేనప్పుడు ఇంటినీ, తననూ తనే చూసుకుంటాడు. ఎంత సంసారపక్షంగా మారిపోయాడో ఊహించనేలేము. ఎంతో నియమంగా ఉండేవాడు. ఆ చదవడం, ఆ రాసుకోవడం తప్ప వేరే ప్రపంచమే ఉండేదిగాదు. నలుగురితో కలవాలనిగానీ, బయట తిరగాలనిగానీ ఆశించేవాడే కాదు. తన రచన ఎప్పుడూ నడవనంత వేగంగా ఇప్పుడు సాగిపోతూందనీ, నాతో ఇంత అద్భుతమైన జీవితాన్ని పంచుకునే అదృష్టాన్ని ఇంతకాలంగా పోగొట్టుకున్నందుకు బాధగా ఉందనీ చెబుతుండేవాడు.

సాయంత్రం నేను ఇంటికి తిరిగొచ్చి, యూనిఫాం తీసేసి చీర మార్చుకున్న తరువాతగానీ కూర్చుని మాట్లాడుకునేందుకు తీరిక చిక్కేదిగాదు. ఆరుబయట కుర్చీలు వేయించుకుని, బాగా పొద్దుబోయిందాకా కబుర్లు చెప్పుకుంటూ కూర్చునేవాళ్ళం. ఒక్కోసారి భోజనం గూడా అక్కడికే తెప్పించుకునేవాళ్లం. పదకొండు దాటితే ఆయన చదువులో పడిపోతాడు. తలుపులు మూసేసుకుంటాడు. అర్ధరాత్రిదాకా రాసుకుంటూ కూర్చునేవాడనుకుంటా. తన పుస్తకం అచ్చయితే ప్రపంచాన్ని కుదిపేస్తుందని ఎన్నోసార్లు అనేవాడు. ఉదయం లేవగానే ఆ దగ్గర్లో వున్న పార్కులో జాగింగ్ చేస్తాడు. ఎప్పుడైనా సాయంకాలాల్లో కాస్సేపు బజార్లో జనాలమధ్య తిరిగొచ్చేవాడు. అంతకుమించి ఏదీ కావాలన లేదు, ఏ తోడూ ఆశించలేదు. ఒంటరిగా ఉండాలని కోరుకునేవాడు. అతని కోరిక ప్రకారమే ఉండనిచ్చేదాన్ని. ఏవేవో దేశాల నుండి ఉత్తరాలు రావడం చూసి, పాత మిత్రులతో సంబంధాలు తెగలేదని భయపడినా, అకారణంగా అనుమానించడం మంచిది కాదని నా భయాన్ని నాలోనే అణుచుకున్నాను. అతనిమీద నాకు ప్రేమే కాదు, గౌరవమూ నమ్మకమూ గూడా ఉండేవి" కాస్సేపు ఆపి, బాధగా నవ్వి, "అన్నీ భ్రమలూ, తప్పుడు ఆలోచనలు. అతని మారురూపం మనమెవ్వరం పసిగట్టలేనంత మర్మంగా ఉంటుంది. మొదట్లో నా అనుమానాలు నాకుండేవి. అందుకే అతని కదలికలమీద కన్నేసి ఉంచేదాన్ని. ఆ తరువాత అవసరం లేదనిపించింది. నీచంగా ప్రవర్తిస్తున్నానేమో అనిగూడా అనిపించింది. అప్పుడు అలా గడిచిపోయింది. ఎంతో సంతోషంగా సాగిపోయింది. అతన్ని ఎక్కడ పోగొట్టుకుంటానో అనే భయం తప్ప, అనుమానించేందుకు

తగిన కారణం లేదనుకున్నాను. చివరకు అదే నిజమై కూర్చుంది.

పదిరోజుల కిందట, స్పెషల్ డ్యూటీలో మూడురోజులదాకా నేను జైపూర్‌లో ఉండ వలసి వచ్చింది. వెళ్లేముందు అతన్తో సెలవు తీసుకుందామన్నా కుదరలేదు. ఎంతసేపు కాచుకున్నా తలుపు తెరవలేదు. అతని ప్రశాంతతకు భంగం కలక్కుండా నడుచుకోవడం నా అలవాటు. మూడురోజుల తరువాత తిరిగొచ్చి చూస్తే, అంతా అయిపోయింది. పాత కథ మళ్లీ మొదల యింది."

చదవమని ఒక ఉత్తరాన్ని నావైపు చాపింది ఆమె. అందులో- 'ప్రియతమా, సెలవు. నేను వెళుతున్నాను. ఉన్నన్ని రోజులు సంతృప్తిగా గడిచిపోయింది. అందుకు ధన్యవాదాలు' అని రాసుంది.

"ఆ జాబునుబట్టి, మీకు ఏమని తోచింది? " ఆమె అడిగింది.

"పరిశోధనకు సంబంధించి ఏదో అవ సరం వచ్చుంటుందని" అన్నాను.

ఆమె విషాదంగా నవ్వి, "అలాంటప్పుడు ఆ ఆడది ఎవరో? " అంది.

"బహుశా పరిశోధనలో అసిస్టెంటు అయ్యుండచ్చు"

"కాదు. మెటిల్డా ఆస్పత్రిలో నర్సు. కని పించకుండా పోయిన మనుషుల వివరాల కోసం నేను గాలించనిచోటే లేదు. ఉద్యోగా నికి రాజీనామా చేసి, కోమల అనే అమ్మాయి కనిపించకుండా పోయింది. ఆ అమ్మాయిని ఎలా మచ్చిక చేసుకు న్నాడు? ఎన్నాళ్ళనుండి మచ్చిక చేసుకు న్నాడు? ఎంత కాలంగా ఆ భాగోతం నడి పించాడు? అనే వివరాలు నన్ను అడగొద్దండి. దగా చెయ్యడంలో అతడు ఆరితే రిన మొనగాడు. నాతో సంసారం చేస్తు న్నట్టే నటించి, అదే సమయంలో మొదటి నుండి రహస్యంగా రెండో జీవితం గడిపా డని నాకు ఆ తరువాత అర్థమైంది.

విమానాశ్రయాలన్నీ విచారిస్తే, నేను జైపూర్ వెళ్ళినరోజే అతడు రోమ్‌కు ఉడా యించాడని తెలిసింది. రోమ్ నుండి కొత్త సావాసగత్తెను వెంటేసుకుని, అతడు ఏ ఖండానికైనా ఎగిరిపోగల సమర్థుడు. విమానాశ్రయం ఉద్యోగుల నుండి సేకరిం చిన సమాచారాన్ని బట్టి, మాల్గుడిలో మీ సౌకర్యం కోసం రాన్‌గా అవతరించాడే, ఆ మనిషే ఈ ప్రయాణికుడు. ఆ రంగంలో అతనికి అతడే సాటి.

ఏదో వొకరోజు అతని పాస్‌పోర్టు మోసాలపైనైనా పట్టుబడి, జీవితాంతం ఏ దరిద్రపు జైల్లోనో పడివుండేలా చెయ్య మని ఆ దేవునికి మొక్కుకున్నాను. మళ్ళీ అతన్ని చూస్తాననే ఆశ నాకు చచ్చిపో యింది"

ఆ మాట అనేసి, దుఃఖం ఆపుకోలేక, భోరున ఏడ్చింది.

ఎక్కిళ్ళ మధ్యన అందుకుని, "మీతో కలవకుండావుంటేనే నేను ఏ చింతా లేకుండా బతికేదాన్ని. టింబక్టో మనిషి గురించి మీ వ్యాసం చదవకపోయినా నాకు బావుండేది. కాదంటే, చిన్నప్పుడే మా నాన్నగారి సలహా పాటించి, అతనికి దూరంగా ఉండుంటే ఈ నరకం ఉండేది గాదు" అంది.

అంత దృఢమైన మనిషి, అంతటి ఆత్మ నిగ్రహం కలిగిన మనిషి, అంతగా కుమిలి కుమిలి కుప్పగూలడం నన్ను తీవ్రంగా కుదిపేసింది. నా కళ్ళూ చెమ్మ గిల్లాయి. నా ఎదుట అలా కుళ్లకుంటూ కూర్చోవడం ఆమెకు నామోషీగా తోచిందో ఏమో, ఒక్క ఉదుటున లేచి, గదిలోకి పరిగెత్తి, తలుపు బిగించుకుంది.

*(ఆర్కే నారాయణ్ వారసుల అనుమతితో అనువదితం)* ©

# హాస్యరచనల్లో సంచలనం!



1989లో 'చతుర'లో ప్రచురిత మైన ఓ నవల తెలుగు పాఠకుల్ని కడుపుబ్బ నవ్వించింది. అప్పటి వరకూ వచ్చిన హాస్య నవలలకు భిన్న మైన శిల్పంతో, కథావస్తువుతో జనానికి దగ్గరైంది. ఆ నవల పేరు 'హరిశ్చంద్రుడు అబద్ధమాడితే'! అప్పటి వర్ధమాన రచయితలు కొలపల్లి ఈశ్వర్, ఎం.ఐ.కిషన్ ఉమ్మడిగా ఈ నవలను చతుర కోసం రాశారు. ఇదే అనతికాలంలో రాజేంద్రప్రసాద్, శోభన జంటగా వంశీ దర్శకత్వంలో 'ఏప్రిల్ 1 విడుదల'గా తెరకెక్కి ఘనవిజయం సాధించింది. ఈ జంట రచయితల్లో ఒకరైన కొలపల్లి ఇప్పటికే దాదాపు వేయికి పైగా కథలు, ముప్పైకి పైగా నవలలు రాశారు.. ఇంకా రాస్తూనే ఉన్నారు. వేలాది కార్టూన్లు, అనేక కథలు రాసిన కిషన్ మాత్రం కొన్నేళ్ల క్రితమే మనల్ని వీడిపోయారు. తమ తొలి నవల 'హరిశ్చంద్రుడు అబద్ధమాడితే' కథవెనుక కథను కొలపల్లి ఈశ్వర్ చెబుతున్నారిలా..

నాకు మంచినవల రాయాలనే బలమైన కోరిక ఉన్నప్పటికీ 1989 వరకూ ఒక్కటి కూడా రాయలేకపోయాను. 1978 నుంచే రచనావ్యాసంగం సాగిస్తున్న నేను అప్పటికే అనేక కథలు రాశాను. నవల రాసేందుకు మొదట్లో ప్రయత్నించలేదు.

నేటికీ సినిమాలకు డైలాగ్స్ రాస్తున్న నా మిత్రుడు పత్తిపాడుకు చెందిన జంధ్యం వెంకటేష్‌బాబు(జె. వి. బాబు) రాసిన 'రేప్' అనే నవల 1984 నవంబరు చతురలో అచ్చయింది. అది చూసి సంభ్రమాశ్చర్యాలకు గురయ్యాను. నేను కూడా అలా రాయాలనుకున్నాను.

ఒకసారి అతనిని కలిసినప్పుడు అడిగాను- నవల రాయాలంటే ఎలా? అని. 'మంచి థీమ్‌ను మనసులో అనుకుని పేపరుపైన పెడుతూపోవడమే.. రాస్తుంటే అదే వస్తుంది' అన్నారాయన.



కావలిలో లెక్చరర్‌గా పనిచేస్తున్న మరో మిత్రుడు వీరపల్లె వీణావాణి రాసిన నవల 'దండకారణ్యం' 1985 అక్టోబరు చతురలో వచ్చింది. అది బాగా పేరు తెచ్చిందాయనకు. అప్పట్లో ఆయన రచనలు పుంఖానుపుంఖంగా అచ్చయ్యేవి. ఆయన ఒకసారి మాఇంటికి వచ్చాడు. సాహిత్య విషయాలవీ చర్చించుకున్నాక అతనితో, 'మీ నవల చతురలో రావడం నిజంగా గొప్పవిషయం. మీరెలా రాశారు? ఎన్ని పేజీలు రాశారు? రిప్లై ఎన్ని రోజుల్లో వచ్చింది?' తదితర ప్రశ్నలు అడిగాను. ఆయన ఏవేవో సమాధానాలు చెబుతూ, 'చతురలో నవల పడటమంటే గొప్ప' అన్నారు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఇప్పటికి ముప్పైకి పైగా నవలలు రాసిన నాకు ఆనాడు తొలి నవల రాయాలంటే పురిటినొప్పులలాగే ఉండేది. ఇక ఎలాగైనా ఓ మంచి నవల రాయాలనే కోరిక నాలో బాగా నాటుకుంది.

కథ వెనుక కథ

అప్పటికే వేలాదిగా కార్టూన్లు వేసి తెలుగువారిని నవ్విస్తూ, తన కథల ద్వారా మురిపిస్తున్న నా మిత్రుడు ఎం. ఐ. కిషన్ నెల్లూరు రావటం, ఇద్దరమూ కలిసి ఓ నవల రాయాలనుకోవటం, స్టోరీలైన్‌ను డిస్కస్ చేయటం చకచకా జరిగిపోయాయి. అలా ఓ మంచి మిత్రుడితో కలిసి ఈ నవల రాశాను. ఆయనతో స్నేహం ఎలా కలిగిందంటే అప్పట్లో ఆయన సికింద్రాబాదులో ఉంటూ ఫ్రీలాన్సర్‌గా పని చేసేవారు. పత్రికలకు కార్టూన్లు వేసేవారు. నేనాయన అభిమానిని. నేను కార్డులమీద జోక్స్ రాస్తుంటే ఆయన వాటికి చక్కటి కార్టూన్లు వేసేవారు. మా ఇద్దరి పేర్లతో వాటిని పత్రికలకు పంపుతుండేవారు. ఆ కార్టూన్లు పుంఖానుపుంఖాలుగా అచ్చవుతుండేవి. అడపా దడపా మనసులో మెదిలే ఇతివృత్తాలను, విషయాలను ఫోన్లో చర్చించుకునేవాళ్లం.

## నవలా ఇతివృత్తం

హీరో బ్యాంకులో క్లర్కు. పేయింగ్ గెస్టుగా హీరోయిన్ వాళ్లింట్లో ఉంటాడు. అలవోకగా అబద్ధాలు ఆడేస్తుంటాడు. ఆమెను ప్రేమిస్తాడు. 'అబద్ధాలకోరువి. నిన్ను ప్రేమించను' అంటుంది హీరోయిన్. 'ఏం చేస్తే ప్రేమిస్తావు?' అడుగుతాడు హీరో. 'అబద్ధాలు చెప్పడం మానేసి ఓ నెలరోజులపాటు పచ్చి నిజాలే చెప్పాలి' అంటుందామె. సరే అని ఒప్పుకున్న హీరో నిజాలు చెబుతూ అష్టకష్టాల పాలవుతాడు. హీరోయిన్ తండ్రికి గుండెపోటు వచ్చినప్పుడు ఆ సంగతి అతనికి తెలియనివ్వవద్దని అంటాడు డాక్టర్.

అప్పుడు మార్చి 31న అబద్ధం చెబుతాడు హీరో. దాంతో హీరోయిన్ అతనిని తిరస్కరించినట్లు నటించి ఏప్రిల్ 1న 'ఫూల్'ని చేస్తుంది. అతని సిన్సియారిటీని మెచ్చుకుని, అభినందించి తన ఇష్టాన్ని తెలుపుతుంది. కథ ఆద్యంతం పూర్తి హాస్యంతో నడుస్తుంది.

అప్పట్లో కిషన్‌కు ఉద్యోగం లేదు. అది 1989 మార్చి నెల. మా ఇంట్లో ఓ పదిరోజులు గడిపేందుకు అతనిని ఆహ్వానించాను. ఆయన వచ్చాక నవల రాయాలనే నామనసులోని మాటను చెప్పాను.

'అలాగే రాద్దాం.. నేను పగలంతా మీ ఇంట్లోనే ఉంటాను. కాబట్టి రోజూ ఎంతలేదన్నా పదిహేను పేజీలవరకైనా రాయగలను. రాత్రికి మీరు వచ్చిన తర్వాత నేను రాసింది చదివి ఆ కథకు కొనసాగింపు ఓ పది పేజీలు రాయండి. అలా కలిసి పూర్తిచేద్దాం' అన్నారాయన.

మాకున్న బట్టలకొట్టులో ఉదయం తొమ్మిది నుండి రాత్రి తొమ్మిది వరకూ నేను నిత్యం బిజీనే. దాంతో దాదాపు నడిరేయి నాకు సమయం, అవకాశం లభించేది. అయితే పొద్దునంతా కథను మన

సులో ఆలోచించుకునేవాణ్ని. కిషన్ కూడా నాలాగే చాలా శ్రమించేవారు.

మా ఇద్దరి ఆలోచనల్లోను ఏకత, స దవగాహన, ఒకేలక్ష్యం ఉండటంతో ఉమ్మడి సేద్యంగా నవలను మొదలెట్టాం.

ఇతివృత్తం గురించి ముందే తీవ్రంగా చర్చించుకున్నాం. చాప్టర్లు అంత కచ్చి తంగా విభజించుకోకున్నా, ఎవరికివాళ్లం రఫ్‌గా రాసుకున్నాం. ఇద్దరి ఆలోచనల్ని కలబోసుకునేవాళ్లం. అలా ఎట్టకేలకు నవ లను పూర్తి చేసి జూన్ మొదటివారంలో 'చతుర'కు పంపాం. జులై ఒకటిన జవాబు వచ్చింది. అప్పటి చతుర-విపుల సంపా దకులు చలసాని ప్రసాదరావు ఆగస్టులో ప్రచురిస్తున్నామంటూ అందులో తెలి పారు. ఎవరెస్టు ఎక్కినంత ఆనందాన్ని అనుభవించాం. అందరికీ స్వీట్లు పంచాం.

### అసలు కథ ఎలా పుట్టిందంటే..?

మా బట్టలకొట్టులో ఓ గుమాస్తా ఉండే వాడు. అతనిది ఓ విచిత్ర ప్రవృత్తి. అవ సరమున్నా, లేకపోయినా నిజాల్ని, అబద్ధాల్ని కలిపి సునాయాసంగా కథలల్లి చెప్పేవాడు. చివరికి నామీదనే అబద్ధాలు చెప్పేసేవాడు. అతనితో ఆ అబద్ధాలను మాన్పించాలని ఎన్నో ప్రయత్నాలు చేశాను. కానీ మారలేదు. అప్పటికి అతని జీతం నెలకు మూడొందలే. నేను మరో మూడువందల రూపాయల ఆశపెట్టి, నెల రోజులు అబద్ధాలాడకుండా ఉంటే మొత్తం ఆరువందలు జీతం ఇస్తానన్నాను.

"అదెంత పనన్నా.. నాకు మాత్రం అబ ద్ధాలు ఆడటం ఇష్టమా? ఆరువందలు వస్తుంటే చేదా? ఇప్పటినుండే అబద్ధాలు మానేస్తాను. నిజాలు మాత్రమే చెబు తాను" అన్నాడు.

అలా చెప్పిన మరు నిముషంలోనే "అన్నా! ఆటోలో నీతోపాటు వచ్చిన మురళి ఏడీ?" అని అడిగాడు.

వాస్తవంగా నేను ఒక్కడినే ఇంటినుండి రిక్షాలో మూడురూపాయలు ఇచ్చి షాపు వద్ద దిగాను. నేను ఆటోలో వచ్చినట్లు, నాతోపాటు నా స్నేహితుడు మురళి దిగి నట్లు అతడు వాదిస్తాడు. అదీ ఎలాగంటే, "నేను కదన్నా చూశాను- మీరిద్దరూ ఆటోలో నుండి దిగుతుంటే. ఆటోఛార్జి కూడా మురళి ఇస్తానంటే మీరే బలవం తంగా ఇచ్చారు" అన్నాడు.

'ఓర్నాయనో! వీడు నామీదే అబద్ధాలు ప్రయోగిస్తున్నాడు' అని తలపట్టుకున్నాను. ఇక చేసేది లేక పనిలో మునిగిపోయాను.

ఆ వేళ మధ్యాహ్నం "ఏరా.. ఏమనుకు న్నావ్? నెలాఖర్లో ఆరువందలు తీసుకుం టావా? ఓడిపోతావా?" అన్నాను.

"మీరు రెడీగా ఆరువందలు చేతిలోనే పట్టుకుని ఉండండి. నాకు ఆరోజు లటు క్కున ఇచ్చేయాలి" అన్నాడు.

అలా అన్న మరుక్షణమే, "అవునన్నా! రాత్రి సెకండ్‌షోకి ఒక్కరే వచ్చారేం? మీరు సినిమాలు చూడరుగా.. అదీ లీలా మహల్‌కి ఓమెన్‌లాంటి భయంకర సిని మాకి వచ్చారే?" అన్నాడు.

దాంతో నా కోపం తారస్థాయికి వెళ్లింది. తమాయించుకుని "ఓరి భడవా! నన్ను చూస్తే పలుకరించక పోయావా?" అన్నాను.

"ఇంటర్వెల్‌లో కూల్‌డ్రింక్ తాగుతు న్నారన్నా.. పలకరిద్దామనుకున్నా. నాతో పోకిరి పిల్లలున్నారు. వాళ్లని నాతో చూస్తే అరుస్తారని గమ్మునున్నా. అదీ వాళ్ల చేతుల్లో సిగరెట్లున్నాయ్! ఆ పొగంటే మీకు అసయ్యం కదా.. అందుకని నేను ప్రొజెక్టర్ రూము దగ్గర సైడ్ అయ్యాను" అన్నాడు.

నిజానికి నేను సినిమాలు చూడటమే చాలా తక్కువ. పైగా ఇంగ్లిష్ సినిమాలు వేసే ఆ థియేటర్‌కు వెళ్లనే వెళ్లను. వాడు అంత సహజంగా నామీద అబద్ధం చెబు తుంటే నేనేం చేసేది? వాడు చెప్పేది చూస్తే, నేనే దొంగవేషాలు వేస్తున్నట్లు

ఎవరైనా సరే అనుమానిస్తారు.

ఇది జరిగిన ఓగంట తర్వాత పాటూరు నుండి పన్నెం రాఘవయ్య అనే వ్యక్తి వచ్చి నాతో మాట్లాడి వెళ్లాడు.

వీడు మిద్దెమీద నుండి దిగి వచ్చి "అన్నా! బుచ్చి నుండి పృథివి బాలసుబ్రహ్మణ్యం వచ్చాడు కదా! మూడో నెంబరు చీరలు తెమ్మని చెప్పారా? " అన్నాడు.

అలా వాడు అబద్ధాలు చెప్పటం మానలేదు. వాడి గురించి చెబుతూ ఓసారి మా మేనత్త కొడుకు యంత్రపాటి వెంకట్రావ్ బావతో "వీడిని మార్చలేక పోతున్నాను" అన్నాను.

అప్పుడు మా బావ "వాడిమీద ఓ కథ రాయి" అని సలహా ఇచ్చారు.

నాకు ఫ్లాష్‌లా వెలిగింది. అది విన్న మరుక్షణమే "కథకాదు. వాడిమీద ఏకంగా ఓ నవల రాయాలి. అంత పెద్ద మ్యాటర్ ఉంది" అన్నాను. అప్పటికి నవలలు చదవటమేగానీ అసలు ప్రారంభించింది లేదు. అయినా నాలో విశ్వాసం పురివిప్పింది.

ఎం.ఐ.కిషన్‌తో క్షుణ్ణంగా మరోసారి స్టోరీలైన్ డిస్కస్ చేశాను. ఇద్దరమూ రంగంలోకి దిగాం. మా చేతిరాతలో 275 పేజీలు వచ్చింది. అలా ఈ ఇతివృత్తం ఆధారంగా మంచి నవల తయారయింది.

సినిమాగా రూపొంది, బ్రహ్మాండంగా ఆడింది. పేరు ప్రఖ్యాతులు తెచ్చింది.

### తెరంగేట్రం ఇలా...

ఆగస్టు 1 రానేవచ్చింది. అచ్చులో మా మొట్టమొదటి నవల మా అభిమాన పత్రిక 'చతుర'లో వచ్చింది. అదేనెల 16న మా చెల్లెలి పెళ్లి చెన్నైలో. అయితే దానికి ఓరోజు ముందు, 15వ తేదీన మా ఇంటి ల్యాండ్‌లైన్‌కు ఫోన్ వచ్చింది. 'మీ నవలను సినిమాగా తీయాలనుకుంటున్నాం' అన్నారెవరో!

మా స్నేహితులెవరన్నా ఆటపట్టించేందుకు ఫోన్ చేస్తున్నారని భావించి, 'తర్వాత తీద్దురుగానీ.. ముందు ఇంటికి రండి.. చెన్నైకి బస్సు బయలుదేరబోతోంది' అని ఫోన్ పెట్టేశాను.



**ప్రశంస!**

హాస్యం రావడం లేదని, ఆస్వాదించేవాళ్లు తగ్గారని ఎవరన్నారు? మా 'చతుర'లో ఈ నెల అచ్చయిన నవల 'హరిశ్చంద్రుడు అబద్ధమాడితే' కాపీలు 14వ తేదీకల్లా అయిపోయాయి. అలా పాఠకులు హాస్యాన్ని బతికించారు.

**– చలసాని ప్రసాదరావు,**
(జ్యోతి మాసపత్రిక రివ్యూలో..)

నెల్లూరులో 17న రిసెప్షన్. మళ్లీ ఫోన్. 'మేం సింహపురి హోటల్‌లో దిగాం. ఇంటి అడ్రెస్ చెబితే వస్తాం' అన్నారు.

అదిరిపోయాం మేము. మా రెండో అన్నయ్య లాయర్ ఉమా మహేశ్వర్‌రావు దగ్గరుండి అగ్రిమెంట్ రాయటం, 'ఏప్రిల్ 1 విడుదల' సినిమాగా రావటం వెంటవెంటనే జరిగిపోయాయి. సినిమాగా వచ్చాక ప్రేక్షకులు బ్రహ్మరథం పట్టారు. సినిమా చూసినవాళ్లు మళ్లీ 'చతుర'లో నవలను చదివి ఎంజాయ్ చేశారు. నవల చదివినవాళ్లు సినిమాను చూసి ఎగిరిగంతేశారు. ఏమైతేనేం? సినిమా సూపర్ హిట్టు!

తర్వాతి కాలంలో కిషన్, అతని భార్య రాధాకిషన్‌లు ఉద్యోగాన్వేషణలో భాగంగా నెల్లూరు వచ్చి స్కూల్లో టీచరు అయ్యారు. వారు ఇక్కడున్న కాలంలో కిషన్‌తోపాటు రాసిన మరోరెండు నవలలు 'కోకిల' అనే కలంపేరుతో 'చతుర'లోనే అచ్చయ్యాయి. అలా మా ఉమ్మడి కృషి బాగా వర్ధిలింది.

అలా చతురతో ప్రారంభమైన నవలా రచన అదే పత్రికలో ఇంతవరకూ నేను రాసిన 14 నవలలు వచ్చేలా చేసింది. ఈ ప్రస్థానం ఇంకా కొనసాగుతూనే ఉంది అంటూ ముగించారు కోలపల్లి.

సేకరణ: **సుశాంత్**



# హలో హలో.. అమెరికా 2

## రోగమొస్తే అంతే సంగతులు!

**మనదేశంలో ఎవరికైనా జ్వరం వస్తే మన సందులోనో కాలనీలోనో క్లినిక్ నడిపే ఎంబీబీయ్యస్ డాక్టర్ వద్దకు వెళతాం. అతడు మొదటి విజిట్‌లో యాభై నుంచి వంద రూపాయల దాకా తీసుకొని జ్వరం తగ్గేదాకా చికిత్స చేస్తాడు. రాసిచ్చిన మందులని ఏ మెడికల్ షాపులోనైనా కొనుక్కోవచ్చు. పిల్లలకి చిల్డ్రన్ స్పెషలిస్టులు, గర్భిణులకు గైనకాలజిస్టులు అందుబాటులో ఉంటారు. మరీ పెద్ద జబ్బులు వస్తేనే మనం స్పెషలిస్టుల దగ్గరకో, పెద్ద ఆసుపత్రులకో వెళతాం. అయితే అమెరికాలోని వైద్యవ్యవస్థ ఇంత సౌకర్యంగా ఉండదు. అమెరికన్స్ చాలాకాలంగా ఎదుర్కొంటున్న సమస్య వైద్యచికిత్సలకు సంబంధించినదే. అక్కడ డాక్టర్ల ఫీజు సామాన్యులకు ఏమాత్రం అందుబాటులో ఉండదు.**

అమెరికాలో కార్పొరేట్ సంస్థలు కోట్లాది డాలర్లు వెచ్చించి ఫైవ్‌స్టార్ హోటల్స్ స్థాయిలో పెద్ద పెద్ద ఆసుపత్రులను నిర్మించాయి. అందులో పనిచేయడానికి అధిక జీతమిచ్చి డాక్టర్లను నియమిస్తారు. జీతానికి ఆశపడి వైద్యులు ఆ హాస్పిటల్స్‌లో పనిచేయడానికి వెళ్తారు తప్ప, మన దేశంలోలా చిన్న చిన్న క్లినిక్స్‌ని తెరిచి తక్కువ ఫీజుతో ప్రజలకి అందుబాటులో ఉండరు. సేవా దృక్పథంతో అక్కడ ఇలాంటి చిన్న క్లినిక్స్‌ని తెరిచేవారు లేరనే చెప్పవచ్చు.

వైద్యుల జీతాలు, ఆసుపత్రి భవనాల ఖర్చులు, వడ్డీ ఇతరత్రా నిర్వహణ ఖర్చులు మొదలైనవన్నీ ఆ ఆసుపత్రులకు వచ్చే రోగులనుంచే వసూలు చేస్తారు. అందువల్లనే అక్కడి ఆసుపత్రి యాజమాన్యం దండుకునే ఫీజులు వేల డాలర్లలో ఉంటాయి. సామాన్యుడికి ఏమాత్రం అందుబాటులో ఉండవు. వచ్చిన ప్రతి రోగికీ అవసరమున్నా, లేకపోయినా డాక్టర్ల ఆదాయం కోసం అనేక రకాల ఆరోగ్య పరీక్షలు చేయించుకోవాలని చెబుతారు. అవి ఆ హాస్పిటల్‌లోనే చేయించుకోవాలి. అమెరికాలోని పెట్టుబడిదారి వ్యవస్థలో అలాంటి బడా కార్పొరేట్ హాస్పిటల్సే అధికం కాబట్టి సామాన్యుడికి వైద్యం ఖర్చుతో కూడుకున్న వ్యవహారం.

దీన్ని అధిగమించడానికి అమెరికన్లు ఆరోగ్య బీమాను తప్పనిసరిగా తీసుకోవాల్సి వస్తోంది. ఆ ఇన్సూరెన్స్ ప్రీమియం కూడ పెద్ద మొత్తంలోనే ఉంటుంది. ప్రతివారు తప్పనిసరిగా తమ సంపాదనలోని నాలుగో వంతుదాకా హెల్త్ ఇన్సూరెన్స్‌కి బదిలీ చేయాల్సి వస్తోంది. మన దేశంలో మనకి ఈ ఖర్చు లేదు.

హెల్త్ ఇన్సూరెన్స్‌లో సగం తాను పనిచేసే ఆఫీసు యాజమాన్యమే కట్టే పద్ధతి అమెరికాలో ఉంది. అందుచేత ముసలివాళ్లు కూడా ఆ ఇన్సూ

రెన్స్‌ని కట్టడానికి తప్పనిసరిగా అక్కడ ఉద్యోగాలు చేస్తున్నారు. ఆ ఇన్సూరెన్స్ కూడా కొంత చికిత్స వరకే కవర్ చేస్తుంది. వాటిలో అనేక పథకాలు ఉంటాయి. కొన్ని సాధారణ రోగాలనే కవర్ చేస్తాయి కనుక, కిడ్నీ ట్రాన్స్ ప్లాంటేషన్ లాంటి ప్రాణాంతకమైన, ఎక్కువ ఖర్చయ్యే రోగాలను కవర్ చేయవు. ఉదాహరణకి ఇన్సూరెన్స్‌లో లక్ష డాలర్లు మాత్రమే చికిత్సకి ఇచ్చే పథకంలో చేరిన వ్యక్తికి అంతకంటే ఎక్కువ ఖర్చయ్యే రోగం వస్తే ఉన్న ఇంటిని అమ్మి హాస్పిటల్‌కి కడతారు. ఇక చికిత్స కోసం ఇంటిని పోగొట్టుకుని రోడ్లమీద జీవించేవారి సంఖ్య అక్కడ లక్షల్లో ఉంటుంది.

అమెరికాలోని కార్పొరేట్ రంగం మొదటినుంచి డాక్టర్లని హెచ్చు జీతంతో తమ తమ హాస్పిటల్‌లో ఉద్యోగులుగా అనేక సంవత్సరాలుగా చేర్చుకుంటూ వస్తున్నది కాబట్టి ఇప్పుడు ప్రైవేట్ డాక్టర్ల కొరత అమెరికాలో అధికం. ఈ కారణంగానే 'అమెరికాలో డాక్టర్లు ఎక్కువ సంపాదిస్తారు' అని మనం తరచూ వింటూంటాం.

హెల్త్‌ఇన్సూరెన్స్ లేనివాళ్ళు అక్కడ వైద్య సౌకర్యాన్ని కోల్పోతారు. ఏ హాస్పిటల్‌కి వెళ్ళినా వారు ముందు అడిగేది ఇన్సూరెన్స్ వివరాలనే. యూనివర్సిటీ విద్యార్థులకి, ఉద్యోగస్థులకి తప్పనిసరిగా ఇన్సూరెన్స్ ఉంటుంది. కట్టే ప్రీమియాన్ని బట్టి ఎంతమేరకు చికిత్సకు అర్హులన్నది నిర్ణయిస్తారు.

అమెరికాలో స్థిరపడ్డ మన దేశస్థులు తల్లితండ్రులు తమని చూడటానికి వస్తున్నారంటే గడగడలాడుతారు. ఎందుకంటే వృద్ధాప్యంలో అనేక రోగాలు గలవారు అమెరికాలో అడ్డంపడితే, హాస్పిటల్‌కి అయ్యే ఖర్చు ఒక్కోసారి వారు అక్కడికి వెళ్లాక కూడబెట్టుకున్నదంతా ఖర్చయి, అప్పుల్లో పడే ప్రమాదం ఉంటుంది. కాబట్టి వారు విజిటర్స్ కోసం ఉండే హెల్త్‌ఇన్సూరెన్స్ పాలసీని, వారు అమెరికాలో ఉన్నన్ని రోజులు ప్రత్యేకంగా తీసుకోవాల్సి వుంటుంది. అదీ ఖరీదే కాబట్టి కొందరు మొండి ధైర్యంతో 'ఏంకాదు' అనుకుని ఇన్సూరెన్స్ తీసుకోరు.

మనదేశంలోలా ప్రభుత్వ ఉచిత ఆసుపత్రులు అమెరికాలో పెద్దగా లేవు. కొన్ని మిషనరీ సంస్థలు, ధార్మిక సంస్థలు నడిపే ఉచిత హాస్పిటల్స్ అక్కడక్కడా ఉన్నా అవి అమెరికన్స్ అవసరాలకు సరిపడా లేవు.

అమెరికాలోని హెల్త్ కార్పొరేట్ సెక్టార్ చాలా బలమైంది, రాజకీయ నాయకులు, పార్టీల్లో వారి లాబియింగ్ కూడా బలమైంది కాబట్టి ఈ దురవస్థ కొనసాగుతుంది. హెల్త్ ఇన్సూరెన్స్, హాస్పిటల్స్ పూర్తిగా ప్రైవేట్ సెక్టార్‌లో ఉండటంవల్ల అమెరికన్ ప్రజలు బాధితులయ్యారు.

యు.ఎస్. సెన్సస్ బ్యూరో లెక్కల ప్రకారం 2009లో 5.7 కోట్లమంది, అంటే జనాభాలోని 16.7 శాతానికి హెల్త్‌ఇన్సూరెన్స్ లేదు. వారికే అనారోగ్యం వచ్చినా ఇబ్బందే. ప్రపంచంలోని మిగిలిన దేశ ప్రజలకన్నా అమెరికన్స్ ఆరోగ్యం కోసం చేసే తలసరి ఖర్చు అధికం అని గణాంకాలు చెప్తున్నాయి. 2007లో అమెరికన్స్ ఐపి పెట్టడానికి కారణం హాస్పిటల్ బిల్స్. ఏగ్గొట్టబడ్డ అప్పుల్లో 46.2 శాతం ఈ బాపతుకు చెందినవే. 2000లోనే వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ అమెరికాని ఆరోగ్య ఖర్చు అధికంగా గల దేశంగా ప్రకటించింది. హెల్త్‌ఇన్సూరెన్స్ లేక ఏటా




44,800 మంది అమెరికాలో మరణిస్తున్నారని హార్వర్డ్ యూనివర్సిటీ పరిశీలనలో తేలింది.

మార్చి 23, 2010న ఒబామా ప్రవేశపెట్టిన పేషెంట్ ప్రొటెక్షన్ అండ్ అఫోర్డబుల్ ఆక్ట్ హెల్త్ ఇన్సూరెన్స్‌లో అనేక మార్పులని తెచ్చినా ఇంకా మౌలికమైన మార్పులు రావాల్సివుంది.

ఎంత గొప్ప దేశం అయినా అమెరికన్స్‌కి అనారోగ్యం వస్తే అంతే సంగతులు. పొరుగు దేశమైన కెనడాని చూసి అమెరికా నేర్చుకోలేకపోతోంది. కెనడాలో వైద్యం పూర్తిగా ఉచితం

– డి. పద్మజ



# హిపోక్రసీ

-పద్మినీ ప్రియదర్శిని

'అమ్మో! రేపెలాగ? రేపు వచ్చేస్తోందే.... రేపు మాత్రం ఈరోజులా ఉండకూడదు. అవును మరి.. రాబోయేది మామూలు రోజుకాదు కదా? జాగ్రత్తగా ఉండాలి. గొడవ పెట్టుకోకూడదు. ఫోన్లు రిసీవ్ చేసుకోవాలి. ఏమయినా స్పెషల్ గా చేయాలా..? నాకేమొచ్చబ్బా..!

అమ్మో..! ఈరోజు కూడా స్పెషల్స్ ఏమీ వండలేదా..? అని ఎవరన్నా అడిగితే? ? ఆ.. ఏదోకటి చేద్దాంలెద్దూ..'

రాత్రి నిద్ర హాయిగా పట్టిందేమో.. ఉదయం లేవగానే ఉత్సాహంగా ఉంది. పక్కనే తను.. చేయి కలిపా!

"ఈరోజు త్వరగా ఆఫీసుకెళ్ళాలి!" అన్నారు ఆయన.

సరే..ఇంతలో ఫోను.. అన్నయ్య కాలింగ్..

"హలో! ఏరా.. ఆ.. లేచాంరా.. ఓ.. థాంక్యూ.. మీ బావగారిని పిలవమంటావా.. ఆ.. ఒక్క నిమిషం.. ఎవరితోనో సెల్ లో మాట్లాడుతున్నార్రా. సరేలే.. ఉంటా మరి.."

"ఏవండీ ఫోన్.. మా అన్నయ్య.. మీతో మాట్లాడతాడట. మీరే చేయకూడదూ పోనీ.."

"ఏవక్కర లేదులే.. మళ్ళీ చేసినపుడు చూద్దాం.." అన్నారాయన.

"అదేంటి.. మీకు ఎవరైనా ఫోన్ చేసి మిస్డ్ కాల్ వస్తేనే వెంటనే చేస్తారుగా! మా అన్నయ్యకు చేయడానికి ఏంటి ప్రాబ్లమ్?"

"చేస్తానంటున్నానుగా..?" ఆయన గొంతు కాస్త పెరిగింది.

'అరే.. ఇదేంటి ఇలా చేస్తున్నాను ఈరోజు..

## చతుర కేత

నాకస్సలు బుద్ధిలేదు. ఈరోజు పోట్లాట పెట్టుకుంటారా ఎవరైనా..? నాకు మైండ్ లేదసలు. తర్వాత చేస్తాననే అంటున్నారుగా.. నాకు మాత్రం ఎందుకంత కంగారు?'

"మధ్యాహ్నం హోటల్ కెళదామా?" అన్నాను.

"అబ్బా. ఆయిలీ ఫుడ్ తినే మూడ్ లేదు"




## దురదృష్ట పర్యాటకుల పోటీ!

అమెరికన్ ట్రావెల్ ఇన్సూరెన్స్ కంపెనీ 'ట్రావెల్ గార్డ్' దురదృష్టపర్యాటకుల కోసం పోటీ పెట్టింది. పర్యటనలో అత్యంత ఇబ్బందుల పాలైన పర్యాటకుడికి ఈ సంస్థ బహుమతి ఇస్తుంది. 2010 జనవరిలో ఈ పోటీని ప్రకటించారు. ఈ ఆన్‌లైన్ పోటీలో ఏడాది పొడుగంతా నెలకో విజేతని ఎంపిక చేశారు. పన్నెండు నెలల్లోని పన్నెండుమంది విజేతలనించి 2011లో ఓ విజేతని తిరిగి ఎంపిక చేస్తారు. నెలనెలా దురదృష్టవిజేతకి పదివేల డాలర్లు, వారిలోంచి తిరిగి ఎంపికైన ఓ విజేతకి పాతికవేల డాలర్లను ఇస్తారు. ఈ పోటీకి 800 ఎంట్రీలు అందాయి. వియత్నాంలోని బీదలకి సేవ చేయడానికి వెళ్లిన ఓ డాక్టర్ కొండ ఎక్కుతూ జారిపడటంతో కాలు విరిగింది. దాంతో అతను తన సెలవుల్లో హాస్పిటల్ పడకమీదే గడిపాడు. అతన్ని జనవరి 2010 విజేతగా ఎంపిక చేసారు. బొలీవియాలోని ఓ అడవిలోకి వెళ్లిన దంపతులు, అడవి అంటుకోవడంతో బకెట్లతో తమ ముందు నీళ్లుపోసి మంటలు ఆర్పుకుంటూ సమీపంలోని చెరువులోకి వెళ్లి బతికిపోయారు. ఈ దంపతులకు చెరో ఐదువేల డాలర్లు ఇచ్చింది. కెన్యా దేశంలోని ఓ చెట్టుమీద గల హోటల్‌లో భోజనం చేసే ఓ నలభై ఏళ్ళ మహిళ హేండ్‌బేగ్‌ని కోతి ఎత్తుకుపోయింది. దాంట్లో ఆమె డబ్బు, పాస్‌పోర్ట్ ఇతర ముఖ్యమైన ప్రయాణపత్రాలు ఉండటంతో ఆమె స్వదేశానికి తిరిగి వెళ్ళడానికి ఎంతో ఇబ్బంది పడింది. ఈమెని మార్చి 2010కి ప్రపంచ దురదృష్ట పర్యాటకురాలిగా ఎన్నుకుని పదివేల డాలర్లని ఇచ్చారు. 2011లో కూడా ఈ పోటీని కొనసాగిస్తారుట.



"సరే మరి ఏం చేయమంటారు..? "

"ఏదో ఒకటి... నీ యిష్టం..."

గబగబా గులాబ్‌జామ్, పులిహోర చేశాను. రెండూ ఘోరంగా కుదిరాయి! మధ్యాహ్నం ఒంటి గంట దాటింది. ఆయన రాలేదు ఇంకా... ఫోను తీసుకున్నా!

"హలో! నేను, లేటవుతుందా ఏంటి..? ఎంత సేపు, ఇంకా గంట పడుతుందా? సరే అయితే"

'దేవుడా.. ఆకలి పీకేస్తోంది... పోనీ తినేస్తే... రోజూ చేసేపని అదేగా..?

ఈ రోజు కూడా ఒక్కదాన్నే ఎలా తింటాను...? తను పక్కన లేకుండా...?'

రెండు దాటింది సమయం.

"హమ్మయ్య...! వచ్చేశారు" గబగబా తిండి తినడం అయింది.

"సాయంత్రం ఏం ప్రోగ్రామ్? "అడిగారాయన.

"సినిమాకెళదామా...? "

"ఏం సినిమాలు ఉన్నాయి...? "

"ఏదో ఒకటి....!"

"ఏదో ఒకటి ఎలా చూస్తాం....? "

"సరదాగా టైమ్‌పాస్..."

"టైమ్‌పాస్ అంత చెత్తగా చేయక్కరలేదు..."

"అదేంటి-? మొన్న మీ అక్కావాళ్ళు వచ్చినప్పుడు, ఇంకా భయంకరమైన సినిమానే చూశాం. టికెట్లు కూడా మీరే తెచ్చారు"

"అయితే....!!!"

"అలాగే... మనం కూడా సరదాగా చూద్దాం"

"నేను భరించలేను తల్లీ...!"

"అవును మరీ.. నేను కదా వెళదామన్నాను"

"సర్లే! నువ్వెలా అనుకున్నా ఇక నీ యిష్టం"

"సరే అయితే...!"

'మైగాడ్.. నిజంగా నాకు పిచ్చిపట్టింది. ఈరోజు ఎలా ఉండాలి?! ఎవరైనా పోట్లాట పెట్టుకుంటారా...? సంతోషంగా ఉండాలి కానీ... సినిమాకు వెళ్ళకపోతేనేం... ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ... హాయిహాయిగా... తీయతీయగా..'

'హమ్మయ్య..' రాత్రయింది. టీవీలో ఏదో సినిమా... చూస్తుండగానే నిద్ర పట్టేసింది.

ఎప్పటిలాగే.. మరుసటిరోజు.. ఉదయం ఆరుగంటలకు చటుక్కున మెలుకువ వచ్చేసింది.

గుండెనిండా గాలి పీల్చుకుని వదిలా..

'ఓహ్.. నిన్నటి టెన్షన్ ఈరోజు లేదు.. ఎంత రిలీఫ్‌గా ఉంది! హాయిగా ఉంది ప్రాణానికి'

'అవును మరి! నిన్న మా పెళ్లిరోజు'

# కాలాతీతం




# జీన్ క్రిస్టోఫ్

కళకు సరిహద్దులుండవు. జర్మనీలో పుట్టి, ఫ్రాన్స్‌లో కీర్తి శిఖరాలను అధిరోహించిన మ్యూజికల్ జీనియస్ జీన్ క్రిస్టోఫ్. కొందరికి ఇది బీతోవెన్ జీవితం ఆధారంగా రాశారనిపిస్తుంది. అయితే ఇందులో అనేక సంగీతకారుల జీవితాలు పెనవేసుకుపోయాయని విమర్శకులు అన్నారు. పది సంపుటాలుగా వెలువడిన పదిహేనువందల పేజీల పెద్ద నవల జీన్ క్రిస్టోఫ్.




**తొలి సంధ్య**

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో, జర్మన్ రైన్‌లాండ్‌లో జన్మించాడు జీన్ క్రిస్టోఫ్ క్రాఫ్ట్. తండ్రి మెల్కియన్‌క్రాఫ్ట్ మంచి సంగీతకారుడే గాని తాగుబోతు. తల్లి వంటమనిషిగా ఎంతో కొంత సంపాదిస్తుంటుంది. ఆమె ప్రేమా, కష్టసహిష్ణుతా అతడికి ప్రేరణ. బాల్యంలోనే సంగీత ప్రపంచంలోకి ప్రవేశిస్తాడు క్రిస్టోఫ్. పియానో, చర్చిగీతాలు అతడికిష్టం. ఆనాటి ప్రముఖ సంగీతకారుడు ఎఫ్.ఎమ్.హాస్లర్ కుర్రాణ్ణి ఆశీర్వదించి, బంగారు భవిష్యత్తుకు బాటవేస్తానంటాడు. నిరంతర సాధనతో త్వరలోనే రెండో మోజార్ట్‌గా గుర్తింపు తెచ్చుకుంటాడు క్రిస్టోఫ్. ఓ సంస్థానాధీశుని కొలువులో ఆస్థాన విద్వాంసుడు అవుతాడు.

**ఉదయం**

సంగీత సాధనకు సన్మానాలు, సత్కారాలు అడ్డంకులవుతాయని క్రిస్టోఫ్

విశ్వాసం. తండ్రి మరణంతో కుటుంబ బాధ్యత మీద పడుతుంది. ఆర్థిక సమస్యలతో కళకు దూరమవుతాననే సందేహం వస్తుంది. సమవయస్కుడైన మరో కుర్రాడు ఆటో డీనర్‌తో పరిచయం పెరిగి, ఇద్దరూ ఉద్వేగభరితంగా ఉత్తరప్రత్యుత్తరాలు కొనసాగిస్తారు. ఈ లేఖలు చదివిన క్రిస్టోఫ్ సోదరులు వీళ్ల స్నేహానికి విపరీతార్థాలు తీస్తారు. అవమానం భరించలేక మిత్రులు విడిపోతారు.

పక్కింటి టీనేజ్ బాలిక మిన్నా వాన్ కెరిక్‌తో సెంటిమెంటల్ అనుబంధమేర్పడుతుంది. క్రిస్టోఫ్ ఆ పిల్లకు పియానో టీచర్. ఆమెతల్లి అభ్యంతరం చెప్పకపోవటంతో మిన్నాతో ప్రేమలో పడతాడు. అయితే తన కూతురికి పేద కుర్రాడు భర్త కావటం ఆమెకిష్టం లేదు. క్రిస్టోఫ్ జీవితంలో విఫలమైన తొలిప్రేమ అది.

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

## యవ్వనం

తండ్రి మరణం తర్వాత తల్లితో మరో చిన్న అపార్టుమెంట్‌కు మారతాడు క్రిస్టోఫ్. దాని యజమాని జస్టస్ యూలర్‌ది పెద్ద కుటుంబం. పిల్లలు, మనవళ్లతో ఎప్పుడూ సందడే. వాళ్ల సంకుచిత మనస్తత్వంతో గాలిలేని గదిలో బంధింపబడినట్టుగా గిలగిల్లాడతాడు క్రిస్టోఫ్. జస్టస్ మనవరాలు రోసా, క్రిస్టోఫ్‌ను ఇష్టపడుతుంది. అయితే అక్కడే ఉంటున్న మరో వితంతువు సాబైన్ ఆకర్షణకు లోనవుతాడు క్రిస్టోఫ్. రోసాను అతడికిచ్చి పెళ్లి చేయాలనుకున్న జస్టస్‌కీ విషయం కోపం తెప్పిస్తుంది. త్వరలోనే ఇన్‌ఫ్లుయెంజాతో సాబైన్ మరణిస్తుంది.

క్రిస్టోఫ్ మరోసారి ప్రేమలో పడతాడు. ఈసారి ప్రేయసి ఆడెల్ హైడ్. ఒకసారి ఇద్దరూ బోటులో షికారుకెళ్లి, చీకటిపడటంతో తిరిగి రాలేక రాత్రంతా ఒక సత్రంలో గడుపుతారు. క్రిస్టోఫ్‌కు అదే తొలి శృంగారానుభవం. వీళ్ల వ్యవహారం తల్లితో సహా బంధుమిత్రులందరికీ తెలుస్తుంది. ఎలాగైనా ఈ ప్రేమికుల్ని విడదియ్యాలని క్రిస్టోఫ్ సోదరుడు ఎర్నెస్ట్ ప్రణాళిక రచిస్తాడు. ఒకనాడు ఆడెల్, ఆమె సోదరి మిరాతో కలిసి పిక్నిక్‌కెళ్లి, ఉద్దేశపూర్వకంగా తాను ఆడెల్‌తో, క్రిస్టోఫ్ మిరాతో గడపటానికి ఆడపిల్లల్ని ఒప్పిస్తాడు. నిజానికి మిరా ఎర్నెస్ట్ ప్రియురాలు. ఈ వికృత శృంగార చేష్టలతో క్రిస్టోఫ్‌లో జుగుప్స పెరుగుతుంది. నైతికంగా దిగజారిన ఆడెల్‌ను అసహ్యించుకుంటాడు.

## తిరుగుబాటు

క్షణిక ప్రేమలతో విసుగెత్తి తన జీవితాన్ని కళకే అంకితం చెయ్యాలనుకుంటాడు క్రిస్టోఫ్. తొలి ప్రయత్నాలు ఫలించవు. అప్పటి జర్మన్ సంగీత దిగ్గజాలు వాగ్నర్, బ్రామ్స్ కృతులలో నిజాయితీ లోపించిందనిపిస్తుంది. లబ్ధప్రతిష్ఠులను విమర్శించటం వల్ల క్రిస్టోఫ్‌కు అహంకారిగా ముద్రపడుతుంది. "నీ సంగీతం కూడా మాకర్థం కావటంలేదు" అంటారు రసజ్ఞులు. సాటి గాయకునితో ఒకసారి వాగ్వాదం జరుగుతుంది. ఆ దశలో ఒక స్థానిక పత్రిక 'డమోనిసస్'లో సంగీత విమర్శకునిగా ఉద్యోగం దొరుకుతుంది. అది అధికారవర్గాన్ని విమర్శించే పత్రికే అయినప్పటికీ అభిప్రాయాలను దూకుడు తగ్గించి మరింత సౌమ్యంగా వ్యక్తపరచాలని సూచిస్తారు మిత్రులు. కాని సలహాలను పెడచెవిన పెట్టడంతో

అతడి వ్యాసాలను తిరిగి రాసి ప్రచురి స్తారు సంపాదకులు. అచ్చయింది మళ్లీ చదువుకునే అలవాటు క్రిస్టోఫ్‌కు లేదు. ఒకసారి ఫ్రెంచి కళాకారులు ప్రదర్శిస్తున్న నాటకానికి టికెట్టు దొరుకుతుంది. అక్కడ నటీమణి కోలిన్ అతణ్ణాకర్షిస్తుంది. ఫలి తంగా ఫ్రెంచి సంస్కృతి, కళారంగాల పట్ల క్రిస్టోఫ్‌కు ఆమెవల్ల అనురక్తి కలుగుతుం ది.

కొత్త సంగీత రూపకాలను(ఆపెరాలు) సృష్టించే క్రమంలో మరో సంగీతకారునితో తగువు పెట్టుకుంటాడు క్రిస్టోఫ్. తన సంగీత సమీక్షలు మరెవరో తిరగరాశారని తెలిసి పత్రికలో ఉద్యోగం మానేస్తాడు. అతని ఇతర రచనలు యథాతథంగా ఓ సోషలిస్టు పత్రికలో ప్రచురణ కావటంతో ఆస్థాన విద్వాంసుడి పదవి కూడా పోతుంది. నిరాశా నిస్పృహలతో సంస్థానా ధీశుడైన గ్రాండ్‌డ్యూక్‌ను పరుష పదజా లంతో దూషిస్తాడు క్రిస్టోఫ్. నాటి సమా జంలో, సంగీత ప్రపంచంలో ఇదో పెద్ద స్కాండల్. అతని సింఫనీ ఒకటి ప్రదర్శి స్తారుగాని ఉద్దేశపూర్వకంగా తప్పులు చేస్తారు నిర్వాహకులు. ప్రచురితమైన అతని సంగీత విమర్శనాగ్రంథాలు అమ్ము డుపోవు. అతనితో స్నేహం చేసిన అభ్యు దయవాదులైన ఓ ప్రొఫెసర్ దంపతుల జీవితాన్ని దుర్భరం చేస్తారు అధికారులు. వాళ్లను కించపరుస్తూ పత్రికల్లో ఆకాశరా మన్న ఉత్తరాలు అచ్చవుతాయి.

ఏం చెయ్యాలో పాలుపోని క్రిస్టోఫ్, తనను బాల్యంలో ప్రోత్సహించిన హాస్లర్‌ను ఆశ్రయించాలనుకుంటాడు. అతి కష్టంమీద అతనికి ఇంటర్వ్యూ దొరికినా, క్రిస్టోఫ్ రచ నలపట్ల హాస్లర్ ఏమాత్రం ఆసక్తి కనబర చడు. తిరుగు ప్రయాణంలో తనను అభి మానించే పాతమిత్రుడు షల్జేను కలుస్తాడు క్రిస్టోఫ్. అయితే అతడు సాయంచేసే స్థితి లేదు. వృద్ధుడు, అనారోగ్య పీడితుడైన షల్జే త్వరలోనే మరణిస్తాడు.

జర్మనీలో గుర్తింపు పొందలేని క్రిస్టోఫ్, తన అదృష్టం పరీక్షించుకునేందుకు ఫ్రాన్సు వెళ్లాలనుకుంటాడు. కాని తల్లి అడ్డుపడు తుంది. అప్పుడు అనుకోకుండా జరిగిన సంఘటనతో అతనికి జర్మనీ విడిచివెళ్ళక తప్పని పరిస్థితి తలెత్తుతుంది.

ఒకనాడు సరిహద్దు గ్రామంలో తనకు పరిచయస్తురాలైన ఓ యువతిని సైనికులు అల్లరి చేస్తారు. క్రిస్టోఫ్ వాళ్లను ప్రతిఘటి స్తాడు. ఘర్షణలో సైనికుడు మరణిస్తాడు. ఇక చెయ్యగలిగిందేమిటి-సరిహద్దు దాటి ఫ్రాన్స్‌కు పారిపోవటం తప్ప!

**విపణి**

పారిస్‌లో క్రిస్టోఫ్ అనామకుడు. బాల్య మిత్రుడు ఆటో డీనర్ నుండి ఏ సహా యమూ లభించదు. మరో అభిమాని సిల్వేన్‌కోన్ అతణ్ణి సంగీత, సాహితీ రంగ ప్రముఖులకు పరిచయం చేస్తాడు. ప్రచుర ణకర్త హెట్ అతనికి ఉద్యోగమిచ్చి ఆదు కుంటాడు. సంస్కారవంతులైన ఫ్రెంచి వాళ్లు క్రిస్టోఫ్‌కు అనాగరికుల్లా కనిపిస్తారు. వీళ్లలో భేషజం, కుహనా విలువలు తప్ప ప్రతిభ లేదనుకుంటాడు. సంపన్న మహిళ కోలేట్‌స్టీవెన్స్‌కు సంగీత గురువుగా ఉద్యోగంలో చేరతాడు. కాని మేధావి గ్రూపులు, కళాకారుల మధ్య ఇంకా గుర్తింపు రాలేదు. కచేరీలు చేసే అవకాశం కోసం ప్రయత్నిస్తుంటాడు. సోషలిస్టు రాజ కీయ నాయకుడు రూసిన్ రచనను ప్రద ర్శించటానికి అంగీకరిస్తాడు క్రిస్టోఫ్. అయితే అందులో అతని ప్రియురాలు నటించక తప్పదని షరతు పెడ్తాడు రూసిన్. క్రిస్టోఫ్‌కు ఆమె గాత్రం నచ్చదు. రూసిన్‌కు కోపం వస్తుంది. ప్రదర్శన నచ్చని ప్రేక్షకులు గోల చేస్తారు. రంగస్థలం మీదే, ఫుట్‌లైట్స్ వద్ద నిల్చుని వాళ్లకు 'అభిరుచి'

# రోమా రోలా (1866 - 1944)

ఫ్రెంచి న్యాయవాదులు, న్యాయమూర్తుల కుటుంబంలో జన్మించాడు రోలా. తండ్రి నోటరీ. తల్లి ప్రోత్సాహంతో సంగీతం పట్ల అభిరుచి పెరిగింది. బాల్యమంతా సాహిత్యాధ్యయనంలోనే గడిచింది. కొడుక్కు మరిన్ని విద్యావకాశాలు కల్పించాలని తండ్రి క్లెమెన్సీ నగరం నుండి పారిస్‌కు మకాం మార్చాడు. ఆనాటి ప్రముఖ చరిత్రకారులు, విద్యావేత్తలు రోలాకు ఇకోల్ నార్మేల్ సుపీరియర్ కళాశాలలో ఉపాధ్యాయులు. కవులు క్లాడెల్, పెగై అతని మిత్రులు. టాల్‌స్టాయ్ రచనలతో ప్రభావితుడైన రోలా ఆయనతో ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభించాడు. ఓ కాలేజీ కుర్రవాడి లేఖకు అంతటి మహానుభావుడు జవాబివ్వటం చిన్నప్పుడే రోలాకు దక్కిన మరచిపోని గౌరవం.

1889లో వుపకారవేతనం మీద పైచదువులకు రోమ్‌కు వెళ్ళిన రోలాకు అభ్యుదయ భావాలు గల మహిళ మాల్విదా వాన్ మీసెన్‌బర్గ్‌తో పరిచయం కల్గింది. ప్రముఖ కళాకారులు, రచయితలు, తాత్వికులైన వాగ్నర్, నీషే, మజిని, హెర్జెన్ తదితరులతో ఆమెకు పరిచయమున్నది. తదుపరి రోలా సాహిత్య జీవితానికి ఆమె వెన్నెముకగా నిల్చింది.

1895లో తన పాత కళాశాలలో కళాచరిత్రను, 1897లో సార్బాన్ విశ్వవిద్యాలయంలో సంగీత చరిత్రను బోధించాడు రోలా. 1895లో ఆపెరాచరిత్ర, ఆ తర్వాత ఫ్రెంచి విప్లవంతో ప్రభావితమైన పలు నాటకాలూ ప్రచురించాడు. రోమ్‌లో ఉన్నపుడే జీన్ క్రిస్టోఫ్‌కు బీజంపడినా, 1904 దాకా తొలిభాగం అచ్చుకాలేదు. తొమ్మిదేళ్ళపాటు నిరాఘాటంగా ప్రచురితమైన ఈ మహాకావ్యం 1913లో పూర్తయింది. రోలాకు విశ్వరచయితగా గుర్తింపు వచ్చింది. ఈ కాలంలోనే మిల్లెట్ (1902), బీతోవెన్ (1903), మైకెలేంజిలో(1906)ల జీవిత చరిత్రలు కూడా రాశాడు రోలా.

మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పుడు స్విట్జర్లాండులో స్థిరపడ్డాడు. ఎంత దేశభక్తి, ఉత్సాహం వున్నా నలభై ఏళ్ల వ్యక్తి సైన్యంలో చేరలేడు గదా! జెనీవాలోనే రెడ్‌క్రాస్ కార్యక్రమాల్లో పాల్గొన్నాడు.

తనను తాను ప్రపంచ పౌరుడినని గాఢంగా విశ్వసించిన రోలా దేశాలమధ్య యుద్ధ వాతావరణం ఏర్పడటాన్ని నిరసించాడు. 1914లో శాంతిని ప్రచారం చేస్తూ పలు వ్యాసాలు ప్రచురించాడు. యుద్ధాన్ని వ్యతిరేకించినందుకు, మాతృదేశంలో జనబాహుళ్యం అతణ్ణి అసహ్యించుకుంది.

1938 దాకా స్విట్జర్లాండులోనే గడిపిన రోలా, ప్రాక్ దేశాల సాహితీ సాంస్కృతిక సంపద వైపు ఆకర్షితుడయ్యాడు. గాంధీ, టాగోర్‌లతో స్నేహం చేశాడు. రామకృష్ణ పరమహంస, వివేకానంద, గాంధీల జీవిత చరిత్రలు ప్రచురించాడు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో స్వదేశానికి తిరిగి వచ్చాడుగాని, ప్రభుత్వ వ్యతిరేకిగా ముద్రపడిన రోమా రోలాను అక్కడి పాలకులు గృహ నిర్బంధంలో పెట్టారు. 1920ల తర్వాత రోలాకు కమ్యూనిజం పట్ల అభిమానం పెరిగింది. స్టాలిన్‌ను ఇంటర్వ్యూ చేశాడు.

జీన్ క్రిస్టోఫ్ గాక, మరో ఏడు భాగాల నవలా, టాల్‌స్టాయ్ గురించిన అధ్యయన పత్రాలను రోమా రోలా ప్రచురించాడు.

1915లో ఆ బహుముఖ ప్రజ్ఞాశాలిని నోబెల్ బహుమతి వరించింది.

---

లేదని నిందిస్తాడు క్రిస్టోఫ్.

సంగీత ప్రస్థానం అంతటితో ముగిసినట్టే. ఆ దశలో పాత పరిచయస్తురాలు ఆంట్వానెట్ జీనిన్ కనపడుతుంది. పలకరించే లోపే ట్రాఫిక్‌లో మిస్ అవుతుంది. మరి కొంత కాలానికి కోలెట్‌స్టీవెన్స్ ఇంట్లో జీనిన్ సోదరుడు ఆలివియర్ పరిచయమవుతాడు. వారి మధ్య స్నేహం బలపడుతుంది.

**ఆంట్వానెట్**

ఆలివియర్ తన సోదరి గురించి చెప్పిన కథనమే ఈ ఆరో భాగం. తండ్రి ఒకప్పుడు లాభాలార్జించిన బ్యాంకరే. కాని

పెట్టుబడుల గురించి తప్పుడు నిర్ణయాలు తీసుకోవడంతో నష్టాల ఊబిలో కూరుకుపోయి, అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడు. పిల్లల్ని తీసుకుని తల్లి ఉద్యోగం కోసం పారిస్‌కు వచ్చిందిగాని ఆ వెంటనే మరణించింది. అక్క, తమ్ముళ్లిద్దరూ అనాథలయ్యారు. సుఖపడే అవకాశం వచ్చినా ఆంట్వానెట్ సోదరుడికోసం పెళ్లి నిరాకరించి జర్మనీలోని గ్రూన్‌బామ్ కుటుంబంలో గవర్నెస్‌గా చేరుతుంది. అక్కడే క్రిస్తోఫ్ ఆమెను తొలిసారి కలుస్తాడు. తను చేసిన పొరబాటు వల్ల ఆమె ఉద్యోగం ఊడుతుంది. కాని కొద్ది కాలానికే ఉద్యోగాన్వేషణలో పారిస్ తిరిగి వచ్చిన ఆంట్వానెట్, సోదరుడు యూనివర్సిటీ డిగ్రీ తీసుకుని జీవితంలో స్థిరపడేదాకా ఉద్యోగం చేస్తూనేవుంటుంది. ఆలివియర్ ఈకథ ముగించిన కొన్నాళ్లకు క్షయవ్యాధితో ఆంట్వానెట్ మరణిస్తుంది.

## ఇల్లు

ఆలివియర్, క్రిస్తోఫ్ ఒకే అపార్ట్‌మెంట్‌లో జీవితం ప్రారంభిస్తారు. ఆలివియర్ శాంతస్వభావి, సౌమ్యుడు. క్రిస్తోఫ్‌ది దుందుడుకు స్వభావం. ఎవరితోనైనా ఘర్షణకు వెనుకాడడు. అయినా ఇద్దరూ ఆప్త మిత్రులు. ఫ్రెంచివాళ్ల స్వభావం, సంస్కృతి ఇంకా తనకు అర్థం కాలేదని గ్రహిస్తాడు క్రిస్తోఫ్. పారిస్‌లో వున్న ఈ వదరుబోతు విమర్శకులు, మేధావులు ఫ్రెంచి కళా ఔన్నత్యానికి నిజమైన ప్రతినిధులు కారు. ఆలివియర్, ఆంట్వానెట్ లాంటి సామాన్యులే అసలైన ఫ్రెంచి సంస్కృతికి ప్రతిబింబాలనుకుంటాడు.

ఆ బిల్డింగులో వుంటున్న వివిధ వ్యక్తులతో పరిచయం పెరుగుతుంది.

అతి సన్నిహితంగా వుండే అందరు వ్యక్తుల్లాగే క్రిస్తోఫ్, ఆలివియర్‌లు తరచు కలహించుకుంటుంటారు. ఒకసారి ఆలివియర్ చేసిన చిన్న పొరబాటు వల్ల క్రిస్తోఫ్‌కూ, విమర్శకుడు లెవీకూర్‌కూ మధ్య వైరం పెరుగుతుంది. ఇద్దరూ ద్వ్యాయెల్‌కు సిద్ధపడతారు. అదృష్టవశాత్తూ ఎవరికీ గాయాలు కావు. తల్లి మరణశయ్య మీదున్నదని తెలిసి క్రిస్తోఫ్, ఆలివియర్‌తో కలిసి జర్మనీకి ప్రయాణమవుతాడు. అప్పటికే జర్మనీ, ఫ్రాన్స్‌ల మధ్య యుద్ధ వాతావరణం నెలకొంది. తల్లి అంత్యక్రియల తర్వాత జర్మన్ పోలీసుల కళ్ళు గప్పి తిరిగి ఫ్రాన్స్‌లోకి ప్రవేశిస్తాడు క్రిస్తోఫ్. ఎందుకంటే ఒకప్పటి హత్యానేరానికి అతడు ఇంకనూ నిందితుడే. అప్పటికే సాబైన్, ఇతర మిత్రులు మరణించారు. అంతర్లోకాలలో స్మృతుల భారం పెరిగిపోతున్నది.

## ప్రేమా - స్నేహం

సంగీత కళానిధిగా క్రిస్తోఫ్‌కు గుర్తింపు వస్తుంది. విందులకు, కచేరీలకు ఆహ్వానాలు రానిరోజు లేదు. జాక్లైన్ లాంగేస్‌ను పెళ్ళాడి చిన్నఊరిలో టీచర్‌గా సెటిల్ కావటానికి వెళ్ళిపోతాడు ఆలివియర్. క్రిస్తోఫ్ జీవితంలోకి కొత్త మిత్రులు వస్తారు.

కీర్తి తనను వరించటం వెనక ఏదో అదృశ్యశక్తి ఉందని గ్రహిస్తాడు క్రిస్తోఫ్. ఇంత మహోపకారం చేసిన వ్యక్తులు కౌంట్ బెరెనీ, ఆయన సతీమణి అని తెలుస్తుంది. జర్మనీలో తన తల్లి సమాధిని దర్శించినప్పుడు వాళ్ల పలుకుబడే అతన్ని పోలీసుల నుండి కాపాడుతుంది.

ఇంతా చేస్తే ఆ కౌంట్, ఆయన భార్యా ఎవరో కాదు- ఒకప్పటి కోలెట్‌స్టీవెన్స్ సోదరి గ్రాజియా తన వివాహం తర్వాత కౌంటెస్ అయింది.

కొన్నాళ్ల తర్వాత వివాహం విచ్ఛిన్నమైన ఆలివియర్, కొడుకును తీసుకుని పారిస్‌కు తిరిగి వస్తాడు. ఆ పసికందు పేరు జార్జి. క్రిస్తోఫ్ మిత్రురాలు సిసిల్ ఫ్లూరీ పిల్లాణ్ణి

పెంచటానికి అంగీకరిస్తుంది.

**అడివంటుకున్నది**

మానవతావాద మౌలిక విలువలకే తమ జీవితాల్ని అంకితం చేసిన మిత్ర ద్వయం క్రిస్తోఫ్, ఆలివియర్ సమకాలీన సామాజిక, రాజకీయ ఉద్యమాల సుడిగుండంలో చిక్కుకుంటారు. వివిధ సోషలిస్టు విప్లవ గ్రూపులతో పరిచయమవుతుంది. చెప్పులు కుట్టే వ్యక్తి మనవడైన ఎమ్మాన్యుయెల్ సాహిత్యంపై ఆసక్తి కనపరచటంతో అతనిని ప్రోత్సహించి రచయితగా ఎదగటానికి కృషి చేస్తాడు ఆలివియర్. అయితే విప్లవ కార్యకలాపాలెప్పుడూ శాంతియుతంగా సాగవు. సార్వత్రిక సమ్మెకు పిలుపునిస్తారు ఆందోళనకారులు. వీధి పోరాటాలు, హింస చెలరేగుతాయి. ఒక పోలీసు వాడు ఆలివియర్ను కత్తితో గాయపరుస్తాడు. క్రిస్తోఫ్ వాణ్ణి తన బాయ్‌నెట్‌తో సంహరిస్తాడు. ఆలివియర్ పరిస్థితి గురించి క్రిస్తోఫ్‌కు తెలియకుండా జాగ్రత్త పడతారు మిత్రులు. ఫ్రాన్స్‌లో వుంటే తనకూ ప్రాణహాని వుంటుందని, హడావిడిగా రైలెక్కించి స్విట్జర్లాండుకు పంపిస్తారు. ఆలివియర్ మరణించిన విషయం ఆలస్యంగా తెలుసుకుంటాడు క్రిస్తోఫ్.

ఇప్పుడతడి మీద రెండు హత్యానేరాలున్నాయి. స్విట్జర్లాండులో మిత్రుడు డాక్టర్ బ్రాన్ ఆశ్రయమిస్తాడు. అయితే అతడు బిజీ డాక్టరు. ఇంట్లో ఒంటరిగా వున్న క్రిస్తోఫ్‌కు డాక్టరు భార్య సపర్యలు చేస్తుంది. తప్పని తెలిసినా ఇద్దరూ ప్రేమలో పడతారు. ఆ వెంటనే చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగా ఆత్మహత్య చేసుకోవాలనుకుంటారు గాని ఆ ప్రయత్నం ఫలించదు. మిత్రద్రోహానికి నిష్కృతి లేదనుకుని క్రిస్తోఫ్ ఇల్లు వదిలి వెళ్లిపోతాడు. పర్వత సానువులలో ఆత్మ ప్రక్షాళన చేసుకునే క్రమంలో మతవిశ్వాసాలు లేని క్రిస్తోఫ్‌కు కూడా అంతరాత్మ ప్రబోధమే భగవంతుడని జ్ఞానోదయమవుతుంది.

**మరో ఉషోదయం**

జుత్తు నెరిసింది. క్రిస్తోఫ్ ఇప్పుడు వృద్ధుడు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచాడు. ఏ దేశానికెళ్లినా ఇప్పుడతణ్ణెవరూ అరెస్టు చెయ్యరు. సంగీతంలో సరికొత్త ప్రయోగాలు చేస్తాడు. గ్రాజియా పునర్దర్శనంతో ఆశ చిగురిస్తుంది. ఇప్పుడామె వితంతువు. ఇద్దరు పిల్లల తల్లి- వాళ్ల పేర్లు ఆరోరా, లయొనెల్లో. వయసుమీద పడినా సౌందర్యం చెక్కుచెదరని పరిపూర్ణ స్త్రీమూర్తి ఆమె. పెళ్లిచేసుకోవాలనుకుంటాడు గాని ఆమెకు వికలాంగుడైన కొడుకున్నాడు. ఆ కుర్రవాడి సేవకే ఆమె తన జీవితం అంకితం చేసింది.

కళలోని మార్మికానుభవాన్ని ఆస్వాదిస్తూ చివరి ప్రయాణం కొనసాగిస్తాడు క్రిస్తోఫ్. ఆలివియర్ కొడుకు జార్జి, గ్రాజియా కూతురు ఆరోరా ఒకే ఈడు పిల్లలు. చిలకాగోరింకల్లా వుంటారు. ఎమ్మాన్యుయెల్‌తో స్నేహం చేస్తాడు క్రిస్తోఫ్. ఒకప్పుడు సంగీతరంగంలో తిరుగుబాటు జెండా ఎగరేసిన తనమీద ధిక్కారస్వరం వినిపిస్తున్నారు అప్పటి యువకళాకారులు. ఇదే చరిత్ర క్రమం. తనను తాను సమర్థించుకునే ప్రయత్నం చెయ్యకూడదనుకుంటాడు క్రిస్తోఫ్. పాతతరం మీద తిరుగుబాటే ప్రగతి. జార్జి, ఆరోరాల వివాహం చూసిన కొద్దిరోజులకే న్యూమోనియాతో క్రిస్తోఫ్ గళం మూగపోతుంది.

★ ★ ★

ఈ చివరి సంపుటంలో, 'కష్టాలు కడగండ్లే జీవితంగా, నిత్యయుద్ధాలు చేస్తూ అంతిమ విజయం తమదేనని ముందుకు సాగే స్వేచ్ఛాప్రియులైన అన్ని దేశాల ప్రజలకు' జీన్ క్రిస్తోఫ్‌ను అంకితమిచ్చాడు రోలా.

– ఎం. వసంత

# కన్నడ అక్షరబ్రహ్మ



వినాయక కృష్ణ గోకాక్

**ప్రాక్పశ్చిమ సాహిత్య వైభవాలను, తాత్త్విక వైలక్షణ్యాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారాయన. అలాగే విద్యావేత్తగా ఎన్నెన్నో ఉన్నత పదవులు దక్షతతో నిర్వహిస్తూనే వివిధ సాహితీ ప్రక్రియల్లో నిరుపమాన రచనలు సృజించి కన్నడ 'అక్షరబ్రహ్మ'గా విఖ్యాతులయ్యారు. వైదికయుగ ధర్మాన్ని, ఆధునిక కాల భావధారను సమ్యక్ సమ్మేళనంగా విస్తూ రచించిన బృహన్మహాకావ్యం 'భారత సింధురశ్మి' ఆయనకు 1990లో జ్ఞానపీఠ పురస్కారం లభింపజేసింది. సమన్వయాత్మక రూపానికి శ్రీకారం చుట్టి విమర్శకు కొత్తబాటలు పరచి, 'ఆధునిక కన్నడ విమర్శా జనకుడు'గా ప్రశంసలందుకున్న ఆయనే డా.వినాయక కృష్ణ గోకాక్.**

**క**ర్నాటక రాష్ట్రం ధార్వాడ్‌జిల్లా సవణూర్‌లో 1909 ఆగస్టు 9న వినాయక కృష్ణ గోకాక్ జన్మించారు. అది చిన్న సంస్థానం. తండ్రి కృష్ణారావుకు వకీలు వృత్తితో పాటు జ్యోతిష్యం, ధర్మాకార్యాలు ఇత్యాది వ్యాపకాలుండేవి. సవణూర్‌లోనే గోకాక్ ప్రాథమిక, మాధ్యమిక విద్య అభ్యసించారు. తర్వాత ధార్వాడ్‌లోని కర్ణాటక కళాశాలలో ఉన్నత విద్య సాగించారు. అక్కడ ఆధునిక కన్నడ కవికుల గురువు డా. దత్తాత్రేయ రామచంద్ర బేంద్రేతో పరిచయం గోకాక్‌లో అనూహ్య పరిణామం తెచ్చింది. సాంస్కృతిక వారసత్వం, కన్నడభాష, సాహిత్యసృష్టి, దేశభక్తి మొదలైన వాటిపై విశేషాభిమానం పెరిగింది. అప్పటికే ఆంగ్లంలో రచనలు చేస్తున్న గోకాక్ కన్నడంలో రచనలు చేసేందుకు అప్పుడే బీజం పడింది. 1931లో ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఎ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. 'దక్కన్ విద్యా సంస్థ' పుణెలో నిర్వహిస్తున్న ఫెర్గుసన్ కళాశాలలో ఆంగ్లశాఖలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా అదే సంవత్సరం ఔద్యోగిక జీవితం ప్రారంభించారు. ఆ విద్యాసంస్థ గోకాక్‌ను పైచదువుల నిమిత్తం ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి 1936లో పంపింది. సర్వ ప్రథమ స్థానం పొందిన తొలి శ్వేతేతరుడిగా గోకాక్ పట్టా స్వీకరించడం ఆయన ప్రతిభకు దర్పణం. ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చి సాంగ్లీలోని వెల్లింగ్టన్ కళాశాల ఉపప్రధానాచార్యులుగా చేరి, అనతి కాలంలోనే ప్రధానాచార్యులుగా పదోన్నతి పొందారు. విద్యావేత్తగా గోకాక్‌ను అనేక ఉన్నత పదవులు వరించాయి. పదవీ నిర్వహణ, రచనా వ్యాసంగం సమగతిలో నడి

జ్ఞాన పీఠాలు (28)

పిన సవ్యసాచి గోకాక్. హైదరాబాద్‌లోని ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంగ్లశాఖలో ఏడాది పాటు ఆచార్య పదవిలో ఉన్నారు. తర్వాత గుజరాత్‌లోని విసానగర్‌లో కొత్తగా నెలకొల్పిన కళాశాల ప్రధానాచార్యులుగా, ధార్వాడ్‌లోని కర్ణాటక కళాశాల ప్రధానాచార్యులుగా, హైదరాబాద్‌లోని 'సీఫెల్' సంచాలకులుగా, బెంగళూరు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా,

సిమ్లాలోని 'ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్' సంచాలకులుగా, పుట్టపర్తిలోని 'శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్' ఉపాధ్యక్షులుగా గోకాక్ అమూల్యమైన సేవలందించారు. ఇంకా కేంద్రసాహిత్య అకాడమీ అధ్యక్షులుగా, భారతీయ జ్ఞానపీఠ సంస్థ అధ్యక్షులుగా కూడా పని చేశారు.

విద్యార్థి దశలోనే గోకాక్ ఆంగ్లంలో 'ది స్కైలైన్' అనే కవితా సంపుటిని, 'ది సెయింట్ ఇన్ ఉమన్' నాటకాన్ని వెలువరించారు. మొత్తం ముప్ఫైకి పైగా ఆంగ్లంలో ఆయన రచనలు చేశారు. కన్నడంలో ఆయన గద్య, పద్య రచనలు సమాంతరంగా సాగించారు. 1930 తర్వాత కవితా రచన చేపట్టిన ప్రముఖ విద్యావేత్త గోకాక్. కొత్త కవితాశైలి ఆయనది. ఆయన ప్రయోగశీలి. ఆయన 'నవ్య కవితెగళు' నవయుగానికి తెరతీసింది. బెంగాల్ కరువును, ఆంగ్ల పాలన పీడనను 'అభ్యుదయ', 'హిగ్గు' రచనలు హృదయవిదారకంగా చిత్రించాయి. నాయక పాత్ర లేకుండా జీవితాన్ని ఆరాధించే విశిష్ట పాత్రలతో సాగిన కావ్యం 'బాలదేగులదల్లి'. గోకాక్ 'పయణ', 'కలోపాసక' 'ద్యావాపృథ్వీ' వంటి తొలినాటి కృతుల్లో ఛందోలయ విన్యాసాలు, వర్ణనా వైభవం అమోఘం.

'ఇందెల్లనాళ'లో అమెరికా వర్ణ వివక్షను నిరసించారు. వేద పురాణ చారిత్రక సాంస్కృతిక నేపథ్యంతో సాగిన కావ్యాలలో గోకాక్ విరాణ్మూర్తిగా దర్శనమిస్తారు. 'భారతసింధురశ్మి' అద్భుత సృష్టి. పుణ్యభూమి, భావరాగ, చింతన మొదలైన కావ్యాలు గోకాక్ భావౌన్నత్యానికి ప్రతీకలు. ఏ ప్రక్రియ చేపట్టినా గోకాక్ తనదైన ప్రత్యేక ముద్రను ప్రతిష్ఠించారు. మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబ సమస్యలను 'ఇజ్జోడు' కథలో అద్భుతంగా చూపారు. 'సమరసవే జీవన' నవలలో ముఖ్యపాత్ర నరహరి. వయోదశల పరిణామ క్రమం అద్భుతంగా గోకాక్ దీనిలో వివరించారు. యథార్థవాదం, ఆదర్శవాదం సమ్మిశ్రణమే ఇందులోని ప్రత్యేకత. భూసామ్య వ్యవస్థలోని దురన్యాయాలను 'జన నాయక' నాటకం ఎత్తి చూపుతోంది. 'యుగాంతర' ప్రతీకాత్మక నాటకం. ఇది 1947లో వెలువడింది. స్వాతంత్ర్యోద్యమం నాటి భావ సంఘర్షణ ఇందులో నాటకీకరించారు. కార్యకర్త, ధనిక వ్యాపారి, కమ్యూనిస్టు యువతి, కవి- ఇందులోని ప్రధాన పాత్రలు. ప్రాచ్య పాశ్చాత్య విమర్శనా సూత్రాలను జీర్ణించుకున్న గోకాక్ కలం నుంచి కవి-కావ్య మహోన్నతి, సాహిత్యదల్లి ప్రగతి, సౌందర్యమీమాంసె, విమర్శెయ తత్వగళు మత్తు ప్రాయోగిక విమర్శె వంటి ప్రామాణిక గ్రంథాలు జాలువారాయి. ఆయన మూడు యాత్రా వృత్తాంతాలు రచించారు. గోకాక్ 21 కావ్యాలు, 2 కథా సంపుటాలు, 4 నాటకాలు, 10 విమర్శనా గ్రంథాలు, 9 ఇతర రచనలు చేశారు.

జ్ఞానపీఠ పురస్కారం పొందిన 'భారత సింధు రశ్మి' ఇరవయ్యో శతాబ్దిలోని అత్యంత విస్తృత కావ్యం. ముప్ఫైఐదు వేల పంక్తులున్నాయి. దీని రచన 1971లో ప్రారంభమై, 1978లో ముగిసింది. రెండు వందల పాత్రలతో సంకీర్ణ ఛందస్సులో రచించిన మహాకావ్యం. వేదసంస్కృతి, ఆర్య ద్రావిడ సమాగమ సంఘర్షణలు దీని నేపథ్యం. ముఖ్యపాత్ర- క్షత్రియుడుగా జన్మించి గాయత్రీద్రష్ట రుషిగా మారిన విశ్వామిత్రుడు. ఈయన వేర్వేరు వర్ణాల సామరస్యానికి ప్రతీక. అలాగే మరో పాత్ర సుదాస్ రాజు భిన్న జాతుల సామరస్యానికి చిహ్నం. ఋగ్వేదంలోని ఆయన మహత్తర వ్యక్తిత్వానికి ఈ మహాకావ్యం అద్దం పడుతోంది. విశ్వామిత్రుణ్ని ప్రజల ఆలోచనలకు, భావనలకు, జీవితానికి ఒక విశిష్ట జాతీయ రూపమిచ్చి, జనజీవితంలో నూతన చైతన్యాన్ని ఉద్దీపింపజేసిన 'వైదిక నవజాగరణ యుగంలోని ప్రధాన వ్యక్తి' అని వర్ణించారు.

గోకాక్ కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం అందుకున్నారు. భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' ప్రదానం చేసింది. కాలిఫోర్నియా పసిఫిక్ విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటుతో సత్కరించింది. ధార్వాడ్‌లోని ఒక వీధికి 'గోకాక్ మార్గ' అని నామకరణం చేశారు. 1957లో టోక్యోలో జరిగిన ప్రపంచ సాహిత్య మహాసభలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. 1960లో ఆఫ్రికాలో జరిగిన ప్రపంచ ఆంగ్లోపాధ్యాయుల సమ్మేళనంలో భారతదేశానికి ప్రాతినిధ్యం వహించారు. అయన సత్యసాయి బాబా అనుయాయి.

1992 ఏప్రిల్ 28న గోకాక్ ముంబయిలో తుదిశ్వాస విడిచారు. ఆయన చితాభస్మాన్ని కన్నడిగులు ప్రభుత్వ లాంఛనాలతో ముఖ్య నదులలో నిమజ్జనం చేశారు.

డా. వినాయక్ కృష్ణ గోకాక్ భారత జాతి గర్వించదగ్గ మహాకవి. ఆయన రచనలు అద్భుత సాహిత్య నిధులు.

**– గోవిందరాజు రామకృష్ణారావు**




# వెయ్యిరూపాయల నోటు

ట్యాంక్ బండ్ 36 కథలు

ఎండాకాలం సాయంత్రం! ట్యాంక్ బండ్ జనంతో కళకళలాడుతోంది.

పాతికేళ్ల యాద్గిరి పల్లిమసాలా అమ్మడంలో బిజీగా ఉన్నాడు. ఉడికించిన పల్లీ పప్పుల్లో ఉల్లిపాయ ముక్కలు, కారం కలుపుతూ, నిమ్మరసం పిండుతున్నాడు. ఒకటిరెండు ఉడికించిన పచ్చి మిరపకాయల్ని కూడా కాగితం పొట్లాల్లో కలిపి కడుతున్నాడు. వచ్చేవాళ్లు వస్తున్నారు. పొట్లాలు కట్టించుకుని పోయేవాళ్లు పోతున్నారు.

రాత్రి తొమ్మిదయ్యేసరికి బేరాలు పలచబడ్డాయి. నిలబడి నిలబడి కాళ్లు లాగుతుంటే జంగిడిని పక్కన్నే నిలబెట్టి, శిథిలమైన తిక్కనగారి దిమ్మెదగ్గర కూర్చున్నాడు యాద్గిరి.

“ఏమ్మనవడా కూసున్నవ్? కాళ్లునొత్తన్నయ్యా?” అంటూ వచ్చి అదే దిమ్మెమీద పక్కనే కూలబడ్డాడు అరవయ్యేళ్ల గోవిందు.

“ఔమల్ల. సర్లేగానీ ఏంతాతా ఇయ్యాల్టి కలెక్సనెంత?” నవ్వుతూ అడిగాడు యాద్గిరి.

“యావుందిర మనవడ? కలెక్సన్‌లేదు.. మట్టిగడ్డాలేదు” అంటూ నోట్లోని తంబాకు కొరికి పక్కనే ఊశాడు గోవిందు.

గోవిందు- ట్యాంక్ బండ్ మీది లేపాక్షి

దగ్గర బట్టపరుచుకుని కూర్చునే కుంటి బిచ్చగాడు. పెళ్లాంబిడ్డలు లేరు. అడుక్కోంగా వచ్చే పాతిక పరకతో పొట్టబోసుకుంటా ఉంటాడు.

ఇద్దరూ కబుర్లాడుతూ కూర్చున్నారు.. మాట్లాడుతున్న గోవిందు ఏదో పరధ్యానంగా ఉన్నాడని గమనించి అతనివైపు చూశాడు యాద్గిరి.

గోవిందు దృష్టి అల్లంత దూరాన ఉండడం చూసి, తనూ అటే చూశాడు యాద్గిరి.

అంతే! అతని కళ్లు మెరిశాయి..

అదో వెయ్యిరూపాయల నోటు! ఎవరు పారేసుకున్నారో ఏం పాడో గొట్టంలా చుట్టున్న ఆ కాగితం గాలికి రివ్వున దొర్లుకుంటూ వచ్చి రోడ్డుమీది ఓ చిన్న కంకర్రాయిని తట్టుకుని ఆగిపోయింది..

ఇంకేముంది? యాద్గిరి బాణంలా అటు పరుగుతీశాడు. గోవిందు కూడా పడుతూ లేస్తూ అటువైపు దేకాడు..

★ ★ ★

"తాతా నువ్వేన్న సెప్పు! కచ్చితంగా ఆ వెయ్యి నాకే దొరికింది. నాదే ఇంకేం మాట్లాడకు" కసుర్తున్నాడు యాద్గిరి.

"అట్టెట్టా మనవడా? నోటును మొదట సూసింది ఎవులు? కాళ్లు తిన్నంగ ఉన్నాయిగన్క నువ్వు లగెత్తినవ్! దేవుడి నాయం పెకారం అందులో సగం నాదే! ఐదొందలు నాకిచ్చి మిగిలిన సగం నువ్వు తీసుకో" అంటున్నాడు గోవిందు.

కాలం గడిచేకొద్దీ ఇద్దరి వాదనలో వాడి, వేడి పెరిగింది.

"అడుక్కుతినే నాకొడక! ఐదొందలు కాదు అర్ధరూపాయి కూడా ఇవ్వ. దిక్కున్న కాడ సెప్పుకో"

"కుర్నాకొడక.. మళ్ల నోరెత్తితే ఎయ్యి రూపాలూ నావేనంట! పోన్లేనని సగం ఇత్తంటే తీపరమార"

"బిచ్చమడుక్కునే వోడికి ఇంత బలుపేం

# చతుర ప్రవేశిక

'మే చతుర' చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. 'స్వామి అండ్ ఫ్రెండ్స్' రచయిత?
జ.
2. విలేఖరిగా పనిచేసే వ.పి. అసలు పేరు?
జ.
3. గిరిజ ఎవరితో పారిపోవాలనుకుంది?
జ.
4. డా.రాన్‌ను ప్రశంసించే టాక్సీ డ్రైవర్?
జ.
5. రాన్ ఫొటోను తీసిన ఫొటోగ్రాఫర్?
జ.
6. 'శ్మశాన వాటిక' ఎవరి రచన?
జ.
7. ఆక్స్‌ఫర్డ్‌లో సర్వప్రథముడిగా పట్టాపొందినది?
జ.
8. 'జీన్ క్రిస్టోఫ్' నవలా రచయిత?
జ.
9. 'హరిశ్చంద్రుడు అబద్ధమాడితే' రచయితలు?
జ.
10. యోగానొక జీవన విధానం అన్న నటి?
జ.

పంపినవారి పేరు: ----------------

------------------వయసు ( )

చిరునామా: ------------------

------------------

------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.



# రచయితలకు సూచనలు

**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా : ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

సూస్కునిరా? గుడ్లల్లో పొడుస్త కొడుకా! అయినా నీకూ నాకు ఏంట్రా మాటలు? ఛల్ ఇదర్ సే ఛల్" యాద్గిరి దులపరిచ్చి పారేశాడు.

గోవిందు కూడా తక్కువేం తినలేదు.

"ఏందిరో నక్రాల్ పోతన్నవ్? టాంక్ బండ్ నీ అయ్యదేంట్రా ఛల్ ఛల్ అంట్నావ్? ఊపిరితీస్తా! ఉరికిచ్చి చంపుతా కొడక.. తియ్యి ముందు నా డబ్బు.."

చుట్టూ చూస్తున్నవాళ్లంతా విషయం ఏంటో అర్థంకాక బొమ్మలెక్క నిలబడి చూస్తున్నారు.

యాద్గిరి గోవిందును కొట్టడానికి లేచాడు..

గోవిందు తన చంక కర్రతీశాడు..

పరస్పరం ముష్టిఘాతాలు.. కర్రదెబ్బలు..

ఇద్దరికీ బలంగా దెబ్బలు తగిలాయి.. గోవిందుకైతే మూతిచిట్లి నెత్తురు వరదవుతోంది. ఆ కోపంతో గోవిందు కర్రవిసరడంతో యాద్గిరి పల్లీపప్పు జంగిడి ఎగిరి అంతదూరాన పడింది. పల్లీపప్పంతా నేల పాలైంది.

నలుగురూ గుమికూడి విడదీయడంతో ఇద్దరూ ఒగరుస్తున్నారు.. ఒకర్నొకరు క్రూరంగా చూస్తూ బండబూతులు తిట్టుకుంటున్నారు.

"ఓరి మీయవ్వ! తిక్కనాయాళ్లరా? రోజూ తీరి కూకుని ముచ్చట్లు చెప్పుకునే వాళ్లకేమొచ్చిందిరా ఇయ్యాళ? కొట్టుకు సత్తన్నారెందుకు?" చుట్టుపక్కల చిరువ్యాపారులు దారేపోయేవారు ఇద్దర్నీ తలవాచేలా చివాట్లేస్తున్నారు.

అంతలో-

యాద్గిరి కూతురు ఐదేళ్ల బుజ్జి పరుగు పరుగున ఏడ్చుకుంటూ వచ్చింది..

"అయ్యా.. అయ్యా బోరింగు దగ్గర నీళ్లు తెస్తూ రోడ్డు దాటుతుంటే అమ్మను మోటరుబండి గుద్దేసిందయ్యా.. రోడ్డంతా నెత్తురు.. బయమేసి లగెత్తుకొచ్చిన్నయ్యా.."

యాద్గిరితో సహా అంతా షాకయ్యారు.

ఓ నిముషం సేపు అక్కడంతా నిశ్శబ్దం!

మొదట చలనం వచ్చింది యాద్గిరికే. రోడ్డువారన చిందరవందరగా పడిపోయిన జంగిడిని, మిగిలిన సామగ్రిని బేసెన్లోకి ఎత్తుకుంటా "నూకాలూ.. నూకాలు.." అంటూ గోలుగోలున ఏడుస్తున్నాడతను.

"అయ్యా ఏందయ్యా నీకీ దెబ్బలేంది? అయ్యో అదేంది? గోవింతాత నోటమ్మట నెత్తురేందే?" అప్పుడే అక్కడున్నవాళ్లని పరిశీలిస్తూ అడుగుతోంది బుజ్జి.

"అంతా గాచారం తల్లీ! పద పద అమ్మకెట్టుందో పోదాం" అంటూ ఏడుస్తూనే కూతుర్ని ఓ చంకన, జంగిడీని ఓ చంకన ఏసుకుని బయల్దేరాడు యాద్గిరి.

బయల్దేరి నాలుగడుగులు వేసినవాడల్లా ఏదో గుర్తొచ్చినట్లు-

వెనక్కుతిరిగి వచ్చి-

"తాతా నిజంగా ఈ ఎయ్యిరూపాలు నీయేనే! దురాశకు పోయి అన్నాలంగా నిన్ను కొట్నా! గందుకే దేవుడు బానే బుద్ధి సెప్పాడు.. తీసుకో తాతా" అంటూ కళ్లు తుడుచుకుంటా వెయ్యిరూపాయల నోటు గోవిందు చేతిలో పెట్టాడు.

"నువ్వే ఉంచుకో బిడ్డా.. అడుక్కునేటోడికి నాకింత డబ్బెందుకు? ఇప్పుడు నువ్వు జరూరు పన్లో ఉండావ్. దవాకానకు పోవాలె. దవాకానంటే ఎన్నిడబ్బులూ సాలవ్! జంగిడి కూడా కరాబైపాయె.. కర్చుకి కావాల్సుంటది ఉంచుకో బిడ్డా" అంటూ ఆప్యాయంగా ఆ నోటుతీసి మళ్లీ యాద్గిరి జేబులో కుక్కాడు గోవిందు.

కళ్లు తడుచుకుంటూ ఆతృతగా బస్తీవైపు నడిచాడు యాద్గిరి.

–చంద్రప్రతాప్



# శాకాహారం నాకు ప్రియం

గత ఫిబ్రవరి 2011లో టెన్నిస్ స్టార్ మహేష్ భూపతిని పెళ్లి చేసుకున్న ఆమె మాజీ విశ్వ సుందరి. 2001లో యునైటెడ్ నేషన్స్ ఫండ్ ఫర్ పాపులేషన్ ఆక్టివిటీస్ గుడ్‌విల్ అంబాసిడర్‌గా ఎంపికైంది. 'అందాజ్' సినిమా ద్వారా 2003లో తెరంగేట్రం చేసింది. మస్తి, నో ఎంట్రీ, పార్ట్‌నర్, హౌస్‌ఫుల్, బ్లూ, భాగమ్ భాగ్, జూమ్ బరాబర్ జూమ్, కాల్, ఇన్‌సాన్, జిందా, దోస్తి, ముంబయ్ సే ఆయా మేరా దోస్త్ తదితర సినిమాల్లో కథానాయికగా నటించిందామె. ఇంతకీ ఆమె ఎవరో మీకు తెలిసేవుంటుంది. ఆమెనే మేటి అందాల తార లారాదత్తా. ఆమె యోగా సాధన చేస్తూ, తన శరీరాకృతిని చక్కగా మలచుకుంది. తన అందం, ఆరోగ్యం గురించి అనేక అంశాలను వివరించిందిలా..

★ జీవితంపై సమగ్రమైన దృక్పథం, పరిపూర్ణ వ్యక్తిత్వం ఏర్పరచుకోవడం ప్రతి ఒక్కరికీ అతి ముఖ్యం.

★ నేను పూర్తి శాకాహారిని. అలాగే ధూమపానం, మత్తుపానీయాలకు దూరం. మంచి శరీరాకృతిని దీర్ఘకాలంపాటు నిలబెట్టుకోవాలంటే ఆరోగ్యకరమైన అలవాట్లు ఉండాలి.

★ ఆరోగ్యం, సంపద, వివేకం- ఈ మూడింటిలో వివేకానికే నేను మొదటి పీట వేస్తాను. ఆ తర్వాతి స్థానమే ఆరోగ్యానిది.

★ ఎవరూ కావాలని స్థూలకాయాన్ని కోరుకోరు. అయితే దీని బారిన పడకుండా ఉండాలంటే ముందు మన దృక్పథంలో, వైఖరిలో మార్పు రావాలి. అనవసరంగా ఆందోళన, చిరాకు మానేసి, ఆరోగ్యంకోసం మనమేం చేస్తున్నామనేది ఆత్మవిమర్శ చేసుకోవాలి.

★ నా మట్టుకు నేను ప్రతిరోజు సగటున ఒకటిన్నర గంటలపాటు రకరకాల వ్యాయామాలు, యోగ చేస్తాను.

★ కాస్మెటిక్ సర్జరీ నేనెప్పుడూ చేయించుకోలేదు. అయితే దీని అవసరం ఏర్పడినప్పుడు చేయించుకుంటే తప్పేం లేదు. ఇది మీ ఆత్మవిశ్వాసాన్ని తప్పకుండా పెంచుతుందంటే మంచిదే!

★ గత దశాబ్దకాలంగా మెడిటేషన్ చేస్తున్నాను. అందాలపోటీలో పాల్గొనేందుకు శిక్షణ తీసుకుంటున్నప్పుడు దీన్ని ప్రారంభించాను.

★ నేను పెందరాళే నిద్ర లేస్తాను. రోజుకు 13 గంటలపాటు పనిచేస్తాను. అయితే ఆదివారాలు పిల్లలతో గడుపుతాను. అలాగే పెంపుడు కుక్కలన్నా నాకు చాలా ఇష్టం.

★ సేవాకార్యక్రమం అనేదాన్ని సమాజానికోసం మేలుచేస్తున్నట్లు మనమెంతో అతిగా ఊహించుకుంటాం. అది తప్పు. వాస్తవానికి సమాజంకోసం పనిచేయడం ప్రతి మనిషీ సామాజిక బాధ్యత. కష్టాల్లో ఉన్నవారికి తోడ్పాటునందిస్తూ మంచి కార్యంలో నిమగ్నమైతే ఎనలేని సంతృప్తిని, సంతోషాన్ని పొందవచ్చు.

★ బరువు తగ్గేందుకు కొన్నిరోజులపాటు తక్కువ కాలరీలు గల ఆహారాన్ని తింటూ కడుపుమాడ్చుకోవడం సరైనది కాదు. అలా చేస్తే దాని దుష్ప్రభావం మనసు, శరీరంపై పడుతుంది. మళ్లీ వెంటనే బరువు పెరిగేస్తాం. దీనికంటే మన జీవన సరళిని మార్చుకోవడం మేలు చేస్తుంది.

★ నేను అన్ని రకాల ఆహార పదార్థాల్ని సంతోషంగా తింటాను. ఆహారంలో గుడ్లు, పప్పు తీసుకోవడంవల్ల నాకు మాంసపుకృత్తుల కొరత ఉండదు. కాస్త తక్కువగానే అయినా రోజుకు ఏడుసార్లు ఆహారం తీసుకుంటాను. అవసరమైన మేరకు నీళ్లు తాగుతాను.

★ నవ్వు జీవితానికి చుక్కానిలాంటిది. చాలా మంది చిన్నచిన్నవాటికే మొహం మాడ్చుకుంటుంటారు. అది వారికెలాంటి మేలు చేయక పోగా చుట్టుపక్కలవారినీ ఇబ్బంది పెడుతుంది.

★ నేను బాగా తింటూనే చక్కగా కార్డియో, యోగా, స్ట్రెంగ్త్ ట్రయినింగ్ లాంటివి చేస్తాను. బరువు తగ్గాలంటే ఇదే సరైన మార్గం. ఏ వృత్తిలోనివారైనా ఒత్తిడులను తట్టుకుంటూ హాయిగా పనిచేయాలంటే సరైన వేళకు తినాలి.

★ పళ్లు, కూరగాయలు బాగా తీసుకుంటాను.



★ మహిళలు చక్కటి శరీరాకృతిని, ఆరోగ్యాన్ని కలిగివుండేందుకు నావంతుగా ఏమైనా చేయాలన్పించింది. అందుకే 'యోగా-రికవరీ & రిజువనేషన్' డీవీడీ సిరీస్ విడుదల చేశాను.

★ స్త్రీ పురుష తేడాలేకుండా వ్యాయామం, యోగాను తమ జీవితాల్లో సృజనాత్మకంగా ఆచరించాలి. వ్యక్తుల్ని బట్టి బరువు పెరిగేందుకుగానీ, తగ్గేందుకుగానీ వేర్వేరు పద్ధతులు ఉంటాయి. అందువల్ల పిడుక్కీ బియ్యానికీ ఒకే మంత్రం సరిపోదు.

★ కెనడాకు చెందిన టోనియా క్లార్క్ శిష్యరికంలో యోగాభ్యాసం చేశాను. యోగానుండి చాలా లాభించడంతో సరళంగా, అందరూ అనుసరించేందుకు అనువుగా ఉండేలా ఆసనాలను చేయడమెలాగో చూపించాలనే సదుద్దేశంతో యోగా డీవీడీలను విడుదల చేశాం.

★ యోగా కేవలం వ్యాయామం కాదు. అదొక జీవన విధానం. అన్ని వయసులవారూ చేయవచ్చు. దీనివల్ల భావోద్వేగాల్లో స్థిరత్వం, శారీరక పటుత్వం, ప్రశాంతత సిద్ధిస్తుంది. ఒత్తిడితో కూడిన జీవితంలో ఒడుదొడుకులను ఎదుర్కొనేందుకు కావాల్సిన మానసిక శక్తి చేకూరుతుంది

★ ప్రతి ఒక్కరూ తాము ఆశించిన రీతిలో చక్కటి శరీరాకృతిని పొందడం సాధ్యమే. దానికి కఠిన పరిశ్రమ, తగిన వ్యక్తుల మార్గదర్శకత్వంలో వ్యాయామం చేయడం అవసరం.

★ 'బ్లూ'లో నటించే సందర్భంగా ఈత కొట్టడం నేర్చుకున్నాను. అంతవరకూ నాకు నీళ్లంటేనే భయం. అనవసరమైన భయాలను తొలగించుకోవాలి. జీవితాంతం మనతో ఉండే విద్యలను తప్పక నేర్చుకోవాల్సిందే. మనం చేసే ప్రతి పోరాటమూ, ప్రయాస మనకు ఆ మేరకు లబ్ధి చేకూరుస్తుంది.

★ సినీ పరిశ్రమలోకి వచ్చినప్పటి నుంచీ ఉన్నఫళంగా బరువెక్కడంగానీ, తగ్గడంకానీ జరగలేదు. నేనెప్పుడూ డైటింగ్ చేసి, సైజ్ జీరో కావాలనుకోలేదు. పంజాబీ అమ్మాయినైనా చాలా అరుదుగా మతాచారాలు పాటించేటప్పుడు తప్ప ఎప్పుడూ ఉపవాసం ఉండను.

★ జీవనశైలిని మార్చుకోవడమంటే దానర్థం దృఢమైన శరీరం, మనస్సు, ఆత్మను కలిగివుండటానికి అవసరమైనవి అనుసరించడమే.

– కేఆర్జీ

# మనసున ఉన్నదీ...



★ ఏప్రిల్ నవల 'సంజవెలుగు' పేరుకు తగ్గట్టుగానే చాలా బాగుంది. వృద్ధులమీద ఇప్పటి వాళ్ళు ఎలాంటి ప్రేమను చూపిస్తున్నారో కళ్లకు కట్టింది. అలాగే 'చంచల' కథ ఆధునిక కాలానికి సరిగ్గా సరిపోతుంది. ప్రేమలో పడ్డప్పుడు ఇతరులు చెప్పే మంచిమాటలు సైతం చెడుమాటలుగా అనిపిస్తాయని చక్కగా విశ్లేషించారు.

–బి.సైదులు, చండూరు, నల్గొండ జిల్లా

★ అక్కినపల్లి సుబ్బారావుగారి నవలను చదివిన తర్వాత ఎన్నెన్నో ఆలోచనలు రేకెత్తాయి. సంతానాన్ని విదేశాలకు పంపించి, ఇక్కడ ఒంటరిగా ఉండలేక, ఆస్తిపాస్తుల్ని అమ్ముకుని తమ వాళ్ల దగ్గరకు వెళ్లలేక అవస్థలు పడుతున్నవారు ఎందరో. నలుగురు స్నేహితుల జీవితాలను తీసుకుని కథను చక్కగా నడిపించారు. ఇలాగే కొనసాగితే మన వృద్ధుల పరిస్థితి దీనంగా మారుతుంది. అన్నీ తనకు తెలుసన్న అహంభావంతో జీవితాన్ని వ్యర్థం చేసుకున్న అమ్మాయి 'చంచల' కథ కూడా కన్నీరు పెట్టించింది.

– సుబ్బలక్ష్మి సామంచి, విశాఖపట్నం

★ సమంత ముఖచిత్రంతో ఏప్రిల్ చతుర ఆకర్షణీయంగా ఉంది. 'సంజవెలుగు' నవల కంటతడి పెట్టించింది. జీవితమంటే కేవలం డబ్బుకాదని నిరూపిస్తూ పాశ్చాత్యీకరణకు గురైన భారతీయుల కుటుంబాల్లో తలెత్తుతున్న దృశ్యాలు, సమస్యల్ని వివరించింది. మంచి నవలను వేసినందుకు అభినందనలు.

–ఈ. వేమన, శ్రీకాకుళం

★ పిల్లల అవసరార్థం విదేశాలకు వెళ్లే తల్లిదండ్రుల మనో వేదనను, నిశ్శబ్దంగా వారిపై జరుగుతున్న అణచివేతనూ సరళమైన శైలిలో అక్షరబద్ధం చేసిన సుబ్బారావుగారి 'సంజవెలుగు' గుండెల్ని బరువెక్కించింది. అరవై దాటిన వృద్ధుల నిస్సహాయతను వివరించిన తీరు విదేశాలకు వెళ్లబోయే పెద్దవారికి హెచ్చరికలా ఉంది. ఓ చక్కని నవలను అందజేసినందుకు 'చతుర'కు కృతజ్ఞతలు.

–వై. సురేఖ, హనుమకొండ

★ స్త్రీ సాంప్రదాయంలోని మంచిని తీసుకుని బతకడమే ఆభరణమని చెప్పిన 'చంచల' కథ కదిలించింది. అనతోల్ ఫ్రాన్స్ 'పెంగ్విన్ ఐలండ్' నవలా పరిచయం ఆకట్టుకుంది.

–మోతి మోహనరంగా, సూర్యాపేట

గతనెల పజిల్ పూరించి, అన్నీ సరైన సమాధానాలు రాసినవారిలో డ్రా ద్వారా ఎంపికైన విజేత

**పప్పు కామేశ్వరరావు,**
ఇంటి నెం. 4-1-44/12,
వడ్లమానివారి వీధి,
భూపయ అగ్రహారం,
అమలాపురం,
తూర్పుగోదావరి జిల్లా
పిన్‌కోడ్ : 533201

వీరికి రూ. 150/- త్వరలోనే అందుతాయి.

## చతురంగం-1 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 జ | య | 2 భే | 3 రి | ★ | 4 అ | 5 ల | ★ | ★ | 6 శ్రీ |
| మ | ★ | 7 వి | నా | 8 య | కు | డు | ★ | 9 ప | కృ |
| ద | ★ | దం | ★ | 10 మ | ర | ★ | 11 ఆ | న | ★ |
| గ్ని | ★ | ★ | 12 సు | ధ | ★ | ★ | 13 యా | స | ★ |
| ★ | 14 వి | ష్ణు | శ | ర్మ | ★ | 15 వ | సం | ★ | ★ |
| 16 వ | సు | ★ | 17 ర్మ | రా | 18 జు | ధ | ★ | 19 ము | 20 ర |
| 21 గ | రు | 22 డు | ★ | 23 జు | న్ను | ★ | 24 ము | ద్రా | రా |
| 25 రు | రా | క | 26 త | ★ | ★ | 27 స్వ | రూ | ప | ★ |
| ★ | యి | ★ | 28 మ | 29 ధు | రం | ★ | ★ | 30 కు | 31 మా |
| ★ | ★ | 32 హ | స్సు | వి | ★ | ★ | ★ | 33 డు | రే |

# చతురంగం - 2 ఆధారాలు

## అడ్డం

1. రామాయణ కృతికర్త (3)
2. ఆసాంతం గోదారిపై తీసిన బాపు రమణల సినిమా (6)
7. పాత.. జరిగిపోయింది (3)
8. సంగీతంలో శ్రుతితోపాటు ఉండేది, ఒక అచ్చతెలుగు నటి (2)
10. పదును, అతడి (2)
11. అడవి (4)
13. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన పాలగుమ్మి పద్మరాజు తెలుగు కథ (4)
14. అవసరం తికమకగా సగమైంది (2)
15. సాధారణంగా కొన్ని సభలిలా ముగుస్తాయి(4)
19. తోక గజిబిజి (3)
20. క్షామానికి తోక తెగింది(2)
21. ప్రథమా విభక్తి ప్రత్యయాలు (3)
22. పాముకు తలలో ఉండేది (2)
23. రాత్రి, పగలు గజిబిజి (5)
26. 'జయం' నాయిక (2)
29. ఇంగ్లీషులో ఏజ్ కు తెలుగు (3)
31. అవినీతిపై తిరగబడ్డ వృద్ధ కమల్‌హాసన్ సినిమా (5)
32. స్త్రీలు నడుముకు పెట్టే ఆభరణం గజిబిజి అయింది (4)

## నిలువు

1. సుగ్రీవుని సోదరుడు (2)
2. దుకాణం (3)
3. దానశీలి (2)
4. ఎవ్వరూ ఆపలేనిది తడబడింది (3)
5. అగ్ని కింద నుంచి పైకి (4)
6. నరకాధిపతి తడబడ్డాడు (3)
9. పురాణం సుబ్రహ్మణ్య శర్మకి పేరుతెచ్చిన కథ (2)
10. కోతి (4)
12. కొత్త, తొమ్మిది (2)
13. విశ్వామిత్రుడ్ని ఇలా కూడా అంటారు (4)
16. సహవాసానికి మరో పదం (4)
17. కె. విశ్వనాథ్ సినిమా ఏడడుగులు (4)
18. రోషం (3)
19. రాముడి కొడుకుల్లో ఒకడు (3)
20. నన్నయ, తిక్కన, ఎర్రనలను ఇలా అంటారు (5)
24. వర్షం (2)
25. .... కుంభకర్ణులు (3)
26. భారతంలో రెండో పర్వం (2)
27. భార్య (2)
28. చక్రపాణిగారి మాసపత్రిక తలకిందులైంది (2)
30. తలకిందులైన భూమికి తోక తెగింది (2)

## నిబంధనలు

1. పక్కపేజీలోని చతురంగాన్ని అదే పేజీలో పూర్తిచేసి పంపాలి.
2. తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు.
3. గడువు తేదీ దాటిన తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు.
4. ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి ఒక విజేతను ఎంపిక చేస్తాం.
5. ఒక్కొకరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు.
6. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం**

**చతుర, ఈనాడు కాంపౌండ్,**

**సోమాజిగూడ, హైదరాబాద్ –082**

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు

★ చతురంగం, చతురప్రవేశిక, కాప్షన్ మీదే, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం

# చతురంగం - 2

రూ.150/- బహుమతి

గడువు తేది : ఈనెల 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | 2 | 3 | 4 | | 5 | 6 |
| | | | | 7 గ | | | | 8 | |
| | 9 | | 10 | | | 11 | 12 | | |
| 13 | | | | | | | 14 | | |
| | | | 15 | 16 | | 17 | | | 18 ప్రా |
| | | 19 | | | | | | 20 | |
| 21 | | | | | | | | 22 | |
| | | | | 23 | 24 | | 25 | | |
| 26 స | 27 | | 28 | | | | 29 | | 30 |
| 31 | | | | | | 32 | | | వ |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు ( ) చిరునామా : ------------------------------------

------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ------------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 29



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!

బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

**మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 17**

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : vipula.chatura@gmail.com

## ఉత్తమ వ్యాఖ్య :

**శ్రీఖర నామ సంవత్సరంలో నా ఖర్మకొద్దీ కాకులకి కూడా జ్యోతిష్యం చెప్పాల్సి వస్తోంది**

–సుబ్బలక్ష్మి సామంచి
విశాఖపట్నం



## కాప్షన్ మీదే -28

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

**మీ జాతకం చెబితే**
**నా జాతకం ముగుస్తుంది.**

– కె.మధుసూదన్‌రావు, నిజామాబాద్

**మీరేమీ వర్రీ అవకండి!**
**భవిష్యత్ అంతా కాకి లెక్కలదే!**

– సి.భానుమూర్తి, కోదాడ, నల్గొండ జిల్లా

**కంప్యూటర్ రిపేరు .. రేపు రండి మీరు**

– డా.కె.శ్రీనివాసకుమార్, నెల్లూరు

**ఈపడు మీలైపు ఆరు గుడ్లు, మూడు పిల్లలు. మీరు హాయిగా విహరిస్తుంటే మానవ మృగాలు మిమ్మల్ని పట్టేయాలని చూస్తుంటాయి. యోగా, ధ్యానం చేయండి. నా ఫీజు తలా రెండు జాంపండ్లు పెట్టి వెళ్లండి**

– బి.రాజేశ్వర్, పొన్కల్, ఆదిలాబాద్

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78

# సంతాన సాఫల్యతకు




## సరోగసి, ఎగ్‌డోనేషన్ సౌకర్యం.

9989432345
9989462345

SRUSHTI IVF ICSI

**అత్యధిక ఫలితాలు, మెరుగైన గర్భధారణ కోసం**

**IUI, IVF, ICSI ప్యాకేజిలు కలవు**

(For Best Results)

# సృష్టి టెస్ట్ ట్యూబ్ బేబి సెంటర్

www.srushtiivf.com

వెంకటరత్నం వీధి, సూర్యారావుపేట, విజయవాడ -2.
జిల్లాపరిషత్ జంక్షన్, మహారాణిపేట, విశాఖపట్నం -2.
4వ లైన్, కె.పి.హెచ్.బి. కుకట్‌పల్లి, హైదరాబాద్ -72.
లిటిల్ కృష్ణా థియేటర్ ఎదుట, కొత్తపేట, గుంటూరు -2.